

# భారతి


ఫిబ్రవరి

1945

సంపుటము 22 : : సంచిక 2

[విడిప్రతి 8 అణాలు]

## ఆంధ్రగ్రంథమాల, పోస్టుబాక్సు 212, మద్రాసు

**పండితారాధ్య చరిత్ర:** శైవమత ప్రతిపాదకమగు ద్విపద కావ్యము. పాల్కురికి సోమనాథ కవి రచితము. డా. చిలుకూరి నారాయణరావుగారు సంస్కరించిరి. దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వతములను పంచ ప్రకరణములును ఒకే సంపుటమున గలవు. ఇంత నిర్దుష్టముగ ఈ గ్రంథము నిదివర కెవ్వరును ప్రకటించ లేదు. నారాయణరావుగారు రచించిన అమూల్యమైన పెద్ద పీఠిక కూడ కలదు.

రూ. 5-0-0

**అళియరామభూపాలుడు:** టి. శివశంకరముగారు రచించినది. విజయ నగరపురాజగు అళియరామరాయల సమగ్రజీవితచరిత్ర. త్రివర్ణ, ద్వివర్ణ, ఏకవర్ణ చిత్రములతో సర్వాంగసుందరముగా ప్రకటితమైన చరిత్రగ్రంథము.

వెల 1-0-0.

**తంజాపురాంధ్రనాయక రాజచరిత్ర:** కురుగంటి సీతారామయ్యగారు రచించినది. తంజావూరును పరిపాలించిన ఆంధ్ర నాయకరాజుల చరిత్రోదంతములు యుక్తియుక్తములైన ఆధారములతో సవిస్తరముగా వివరింపబడియున్నవి. అనేక చిత్రపటములు గలవు.

వెల 1-0-0.

**జీర్ణవిజయనగర చరిత్ర:** కుందూరు ఈశ్వరదత్తుగారు రచించినది. కృష్ణదేవరాయల రాజధానియైన హంపీవిజయనగరముయొక్క ప్రాచీన వైభవమును కన్నులకు కట్టినట్లు వివరించుచున్న చారిత్రక గ్రంథము. అనేకచిత్రములతో సంకలితమైనది.

వెల 1-0-0



# విషయానుక్రమణిక

1945, ఫిబ్రవరి



## చిత్రములు



అశోకచ్ఛాయలో శోకమూర్తి సీతాదేవి

చిత్రకారుడు: శ్రీ ఎ. పైడిరాజు.









ఫిబ్రవరి, 1945

తారణ - మాఘము

# ధనుర్మాసము

= శ్రీ కపిస్థలం శ్రీరంగాచారి =

౧

తలపుల మంచు నించు చలితాకున, చీకటిరెమ్మలందు గొం
తుల వెలుగుల్ మునుంగ, కనుదోయి దొరంగిన సిరుపేర, మే
ల్కొలుపుల జాలిలో పులుగు లూరిన తూకుపు సూడ, వేకువే
వెలవెల బారెగాని, వెనువెంటనె కంట మెలంగె కాపురుల్.

౨

పొగమంచుల్ నిలువెల్ల నెత్తుకొలుకన్ పోరాడి పోరాడి, పై
కెగయంబారియు గొల్వలేక మరగెన్ కిమ్మీరవర్ణాలలో;
నగుమొగ్గల్ కొరడాల వేటు చలికిన్ శైత్యంబులో గర్వ - మిలా
నగుబాటుల్ తిలకించి నవ్వె నిల యానందాశ్రుకణాలతో.

౩

గుమ్మడిపూయు వెచ్చవెలుగుల్ కనులంటిన, గొబ్బిపాట పై
కమ్ముల ఘంపగొట్టినను, కమ్మని పొంగలి వంట లింటిలో
గుమ్మనినన్ - ముసుంగులిడి, గొంగళి కౌగిళులందె లీనమై
యిమ్ముల నుండు రేదు పవళించి ముసల్లను, కోడెదంపతుల్.

# పాల్కుఱికి సోమనాథుని కాలము



= శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

పాల్కుఱికి సోమనాథుని కాలమును నిర్ణయించుటలో ఇతనినిగుఱించి పిడుపర్తి సోమనాథుడు తన బసవపురాణమున చెప్పిన విషయములు చాల విలువైనవి. పిడుపర్తి సోమనాథుని కాలము మనకు నిశ్చితముగ తెలియనిమాట వాస్తవమేయయినను పాల్కుఱికి సోమనాథునిగుఱించి యతడు తన బసవపురాణమున జెప్పిన విషయముల ననుసరించియే పండితారాధ్యచరిత్రకృతికర్త కాలమును చక్కగ నిర్ణయించుటకు అవకాశము కలదు. పిడుపర్తి సోమనాథుడు తన బసవపురాణమున పాల్కుఱికి సోమేశ్వరునిగుఱించి తెలిపిన కథ ఇది :

"ఒకనాఁడు శివభక్తు లోరుఁగంటను స్వయం
భూదేవుమంటపమున వసించి
బసవపురాణంబు పాటించి వినువేళ
హరుని గొల్వఁ బ్రతాపుఁ డచటి కేగి
యాసంభ్రమం బేమి యనుడు భక్తులు బస
వని పురాణం బర్థి వినెద రనిన
విన నాపురాణంబు విధ మెట్లొకో యన్న
ధూర్తవిప్రుం డొకకర్త చేరి
పాలకుఱికి సోమపతితుఁ డీనడుమను
బెనచె మధ్య వళ్లు పెట్టి ద్విపద
యప్రమాణ మిది యనాద్యంబు పదమన్న
నరిగె రాజు భక్తు లది యెఱింగి.

"కరములఁ గర్మయుగ్మములు
గ్రక్కున మూయుచు బ్రహ్మబంధువుం
బొరిగొనఁజూచి యిట్టి ఘన
మూర్ఖులు భక్తు లటంద్రు వేగ పా
ల్కుఱికి పురీశదేశికున
కున్ వినిపించి తదభ్యనుజ్ఞ నీ
వెరవిడి విప్రుఁ బట్టుకొని
వే వధియింత మటంచు నందఱున్.

"చని పాలకుఱికి సోమే
శునితో నప్పాఱుపలుకు చొప్పడఁ జెప్పన్
విని యూరకున్న భక్తుల
కును దలవంపౌనటంచుఁ గుపితాత్ముండై.

"భవి కానివానితోడన్
వివాద మొనరింపఁ జూడ విధిలే దైనన్
శివభక్తిశక్తిఁ దృణమా
నవుచే గెలిపింతు దూషణపరుం బాఱన్.

"అని ప్రతిజ్ఞఁ జేసి హరభక్తియుక్తుఁడై
లింగముద్రయెడ్ల సంగడించి
కూడఁగట్టినట్టి గూడారుబండిపైఁ
గదలిపోయి రోరుఁగంటిపురికి.

"వారలు వచ్చు రాక పర
వాదు లెఱింగియు నేవపుట్టి యా
యూర వసించు ముక్కఁడుల
నున్మదవృత్తుల మొండివాండ్రనుం
జేరఁగఁబిల్చి చంద్రధర
చిహ్నితదేహులఁ జేసి యందఱన్
బోరన మీ రెదుర్కొనఁగఁ
బొం డని పంచిన దుండగంబునన్.

"ఎదురుగా వచ్చి వారు సోమేశ్వరునకు
మ్రొక్కినంతనె యంగముల్ మొదలియట్లు
చక్కనై లింగచిహ్నల సహజమైన
నర్థి వారలు గొలిచి రా నరుగునపుడు.

"గవనిపై లచ్చిప్రతిమయుఁ గరులు రెండు
నుండఁ గాడికిఁ గట్టిన యుక్షయుగము
గవనిఁ జొరకున్న సోమశేఖరుఁ డెఱింగి
తొలఁగు మని పంప నవి నేలఁ దునిసిపడియె.

"అది విని దూషకావళులు
నాపురి నేలు ప్రతాపుఁడున్ భయా

స్పదులయి వచ్చి మ్రొక్కినఁ గృ
పామతి వారలఁ గాంచి పంచి య
మ్మదనవిరోధిభక్తుల స
మాదరణంబునఁ గొంచుఁబోయి సా
ధ్యుదయమనస్కులై కొలుచు
చుండఁగ నుండెను గొన్ని వత్సరముల్.

"అట్లుండియు సోమేశ్వరుండు కాలత్రయవేది కావున నాగామికాల్యకౌశల్యంబు నెఱింగి పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యగా రాదిగాఁగల తమశిష్యుల నందఱ బిలిపించి యీదేశం బింకఁ దురుష్కులచే నాక్రాంతంబు కాఁగలదు మాబోటి నియమస్థుల కిం దునికి పొందుపడదని వారితో ని ట్లనియె—

"ఈరాజ్యంబున మా కిఁక
నారూఢిఁ జరింపుచుండ ననువుపడదు మీ
కీరాజసీమలో నొక
యూరు ఘటించి చిత్త నందు నుండుం డనుచున్

"తన శిష్యుఁడును నాప్రతాపుని మంత్రియు
నగు నిందుటూరి యన్నయ్యఁ బిల్వఁ
బనిచి నీ వెప్పుడు భక్తితో నరవత్త
ముగుర నర్చింతువు ముఖ్యవృత్తిఁ
దత్ప్రీతిగా మావ్రతస్థుల కొక గ్రామ
మిప్పించు మీ ధరాధీశుచేత
ననవుడు నతఁడు మహాప్రసాదం బని
యిప్పించె దోఁకిప ట్టిద్ధభక్తి
నందుఁ బ్రతివసించి రరవత్తముగురును
దాము ప్రేమఁ గనడభూమి కరిగి
యచట భక్తు లెల్ల నతిభక్తి సేవింపఁ
గొంతకాల ముండి యంతమీఁద ...."

ఇటుతరువాతివృత్తాంతము మన కప్రస్తుతము. ఈ పై వృత్తాంతమువలన పాలకుఱికి సోమనాథుఁడు రచియించిన ద్విపద బసవపురాణమును శివభక్తులు ఓరుగంటిలోని స్వయంభూనాథుని యాలయమున జదువుచుండిరని, ఆ కాలమున ఓరుగంటిని బరిపాలించుచుండిన రాజు ప్రతాపుడని, అతని మంత్రి ఇందుటూరి అన్నయ్యయని, పిడుపర్తి శివరాత్రి కొప్పయ్య మొదలయినవారు పాలకుఱికి సోమనాథుని శిష్యులని, సోమనాథుదు కొప్పయ్య మొదలగు దన శిష్యులకు అన్నయ్యతో జెప్పి ప్రతాపునిచేత దోకిపఱ్ఱు అను గ్రామము నిప్పించి, యిక నీదేశము తురుష్కులచేత ఆక్రాంతము కాగలదు గాన తనబోటి నియమస్థులకు అందుండుట 'పొందుపడ' దని తాను కన్నడభూమికి వెళ్లెనని తెలియుచున్నది.

ఈపైని చెప్పిన వృత్తాంతమే ఓరుగంటి కాకతిభూపతుల నుగుఱించి తెలుపు ప్రతాపచరిత్రమున ఈక్రిందివిధమునవర్ణితమైనది :"శ్రీమత్ప్రతాపవీరరుద్రుని మంత్రియగు పాలకుర్తి సూరయ్య ప్రతాపరుద్రున కి ట్లనియె. పాలకుర్తి సోమనాథుడు రచియించిన శివకథలు దేవరవారు రేపు శంభుని సేవింప బోయినపుడు సుఖస్థితిని గూర్చుండి వినివలె ననిన మరునాడు ఆరాధ్యునిచారిత్ర వినుచుండగాను కొందరు ధూర్తజనులు పాలకుర్తి సోమనాథుండు చెప్పినవి నూతనంబులు గాని అద్భుతంబులు కావు అనిన విని(న)నిరాకరించిన. ఆప్రతాపరుద్రుండు తన నిజనివాసంబునకున్ జనియె. అచట శివభక్తులు సిగ్గుపడి పాలకుర్తికి జని సోమనాథున కెఱింగించిన ఆసోమనాథుండు శైవులు కానివారలం జూడకుండుటంజేసి ఒక్కశకటంబుపై గుడారంబు పన్నించి యందుమీద తాను గూర్చుండి లింగముద్రలయెడ్లు కట్టించియే కామనాథుండును రంగనాథుండు మొదలుగాగల శిష్యజనంబులు తన్ను గొలువ ఏకశిలానగరమునకు జనుదెంచి యాబండికి గట్టిన యెడ్లు గవిని దూరకున్న నెరింగి గవినిపై అడ్డదూలంబు వేసిన ప్రతిమను రెండుయేనుగులంట దెలిసి తొలగుమని పలుకుటయు అది తునిసి యిరుగడలం బడుటయు, అంత యేకశిలానగరంబున తనశిష్యుడైన యిందూరి అన్నమదేవుని నివాసంబున నుండుటయు, ఆవార్త ప్రతాపరుద్రుం డెరింగి విస్మయంబొంది, కొందరు ధూర్తులు సహింపంజాలక శిలలు తెగిపడుట మంత్రవిద్యకాని వాక్సిద్ధి కాదు అతనివద్దికిం బోయి యీగుట్టు దెలిసి యిప్పుడె వత్తుమని రాజుచే ననుజ్ఞాతులై యీసోమనాథునివద్దికిం జనిన, అతండు అన్యమతస్థుల జూడకుండుటంజేసి యతనివద్దికి బోయిన ద్వారపాలకులచేత నివారితులై మగుడి పురవీథి కేతెంచి గుంపులుగూడి కటకటా వేదశాస్త్రసంపన్నుల జూడరాదట. ఛండాలుండైనను శైవుం డగునేని మాట్లాడవచ్చునట. అట్ల కాక యని నవ్వి యతని హాస్యంబుచేసి యీప్రొద్దె పురంబు వెడలననువవలయునని తలంచి యాపురిలోపల గ్రాసార్థులై తిరుగు అంగహీనులను మొండి మొఱ్ఱి ముక్కిడివాండ్లను అంధులను బధిరులను మూగలను మరియు రోతజనులను రావించి మీరు పోయి సోమనాథుని

హాస్యంబుజేసి వచ్చితిరేని మీకు అన్నంబు వస్త్రంబులు యిచ్చెదమని యొడంబరచి వారిని లింగధారణ విభూతి రుద్రాక్షధారులం జేసి యతనివద్దికి పంపినం బోయిరి. అతని ప్రభావంబున అంగహీనులకున్ను అంగంబులున్ను బధిరులకు వినవచ్చుటయు అంధులకు కన్నులు మూగలకు వాక్యంబు గలుగుటయు అంగవికలులకు సరాధ్యంబు గలుగుటయు, వారలు అత్యంతసంతోషంబున ఆయయ్యకు నమస్కరించి బహువిధంబుల గొనియాడి యాసోమనాథునిచే అనుజ్ఞాతులై పురవీధి కేతెంచుటయు, సకలజనంబులు జూచి యాసోమనాథుని మహిమ నియాడిరి యాధూర్తులు లజ్జించిరి. ఆ ప్రతాపరుద్రునకు సోమనాథుం డి మె శివుండు భక్తిసులభుండు గాన నొక్కమోక్షవ్రతంబు చేపట్టి నడుపు మనిన ఆవ్రతంబు భంగపడకుండ నడుపు మనిన శివుండు ప్రత్యక్షం బగునని మెరింగించిన...."

ప్రస్తుతము మన కిది చాలు. పిడుపర్తి సోమనాథుడు తెలిపిన వృత్తాంతమునకు, ప్రతాపచరిత్రకథనమునకు కొంత భేదము లేకపోలేదు. స్వయంభూదేవుని మండపమున శివభక్తులు వినుచుండినది బసవపురాణమని పిడుపర్తి సోమనాథుడు చెప్పుచుండ పండితారాధ్యచరిత్రమని ప్రతాపచరిత్రమున గలదు. బండిమీద గుడారు నిర్మించుకొని పాలకురికి సోమనాథుడు ఓరుగంటికి వచ్చుట, అతడు తొలగుమని ఆనయిడగా గవనిమీది గజలక్ష్మివిగ్రహశిల తునిగిపడుట, ధూర్తజనుల కృత్యము, అంగవికలులు మొదలైనవారికి అంగవికలత్వ బధిరతాగుణములు పోవుట - ఇవి పిడుపర్తి సోమనాథుని బసవపురాణమునకును, ప్రతాపచరిత్రమునకును సామాన్యములే యైనను ప్రతాపచరిత్రము శివరాత్రి కొప్పయ్యగారిని పేర్కొనదు; వారికి పాలకుర్తి సోమనాథుడు దోకిపర్తిగ్రామము నిప్పించినట్లును తెలుపదు. ఇది పిడుపర్తి సోమనాథుని బసవపురాణము పేర్కొను ఇందుటూరి అన్నమదేవుని ఇందూరి అన్నమదేవుడని వ్యవహరించుచున్నది. అయితే యీ అన్నమదేవుడు పాలకుర్తి సోమనాథుని శిష్యుడని, సోమనాథుడు అన్నమదేవునింటనే ఓరుగంట బసచేసె ననియు తెలుపుచున్నది. పిడుపర్తి సోమనాథుడు ఓరుగంటిభూవరుని ప్రతాపు డనగా ప్రతాపచరిత్ర విస్పష్టముగ అతడు కాకతి-ప్రతాపరుద్రదేవుడని పేర్కొనుచున్నది. మొత్తముమీద పిడుపర్తి సోమనాథుని బసవపురాణమువలనను, ప్రతాపచరిత్రమువలనను దెలియవచ్చు మూలకథ ఒక్కటే.

అయితే ప్రతాపచరిత్రమునకంటె పిడుపర్తి సోమనాథుని బసవపురాణమే ప్రాచీనమయినది. అందువలన అదియే యెక్కువ విశ్వాసపాత్రమయినది. కాకతీయ నృపాలురనుగుఱించి ప్రతాపచరిత్రము తెలుపువిషయములలో మూడువంతులు, ఇంకను అంత కెక్కువగనే యనవచ్చునేమో, కొట్టివేయవలసినవే; నిలుచునవి కావు. కాకతిరాజన్యులనాటి శాసనము లనేకములు బయలుపడినవి. వీనివలనను, సంస్కృతాంధ్రగ్రంథములవలనను, మహమ్మదీయుల చరిత్రలవలనను కాకతీయరాజన్యచరిత్రము ఒకవిధముగ స్పష్టముగనే తెలియవచ్చుచున్నది. ప్రతాపచరిత్రము తెలుపు అనేకవిషయములను శాసనములుకాని, మఱి యే యితరాధారములుకాని సమర్థింపవు. అందువలన ప్రతాపచరిత్రమునకు పుక్కిటిపురాణమున కుండు విలువకంటె ఎక్కువ లేదు. అయినను ఈపుక్కిటిపురాణములో అల్పస్వల్పముగ కొద్ది చారిత్రకవిషయములు లేకపోలేదు. అట్టి వాటిలో ఈపాలకుఱికి సోమనాథుని కథ యొకటి, అయినప్పటికి ఈకథ ప్రతాపచరిత్రమునందు దెలిపినదానికంటె పిడుపర్తి సోమనాథుడు చెప్పినదే ఎక్కువ ప్రామాణికమయినదిగా గ్రహించుట ఉచితము. పిడుపర్తి సోమనాథుని బసవపురాణము ప్రతాపచరిత్రమునకంటె ప్రాచీనమయినదే అయినను ఎంత ప్రాచీనమయినదో, బసవపురాణరచనాకాలమెప్పుడో మనకు నికరముగ దెలియదు: పాల్కుఱికి సోమనాథుని కాలనిర్ణయమునకు పిడుపర్తి సోమనాథుని కాలమును దెలిసికొనవసరమును లేదు. ఒక్కవిషయమును మాత్రము మనము గమనించిన జాలును. పద్యబసవపురాణ కృతికర్తయైన పిడుపర్తి సోమనాథుడు పాలకుఱికి సోమనాథుని శిష్యుడయిన పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యగారి వంశమున జనియించినవాడు. శివరాత్రి కొప్పయ్య మనుమడు పెదసోమయ యనియు, పాల్కుఱికి సోమనాథుని శిష్యులైన శివరాత్రి కొప్పయ్య మొదలగువారికి వెనుక ప్రతాపుడు (ప్రతాపరుద్రుడు) ఇచ్చిన దోకిపురము మధ్య 'అంకిలి'పడగా పెదసోమయ దానిని 'ప్రౌఢరాయమహీదయితునిచేఁ దెచ్చె' ననియు పద్యబసవపురాణమునందలి ఈక్రింది పద్యములు తెలుపుచున్నవి:

"సోమేశుఁడు హరిపురికిం
దా నేగకమున్న యన్నదండాధిపుచేఁ
బ్రేమంబున నిప్పించిన
భూమండలి దోకిపర్తిపురి శరణులలోనఁ

"ధరఁ బాలకురికి సోమే
శ్వరగురుకారుణ్య హస్తసంభవుఁ డగుటన్
గురుదత్తలింగభావాం
తరుఁడై శివరాత్రి కొప్పనాథుం డొప్పున్.

"ఆకొప్పయ్యకుఁ బుణ్య
శ్లోకుఁడు బసవయ్య పుట్టె ...."
ఈబసవయ కుమారులలో అగ్రజుడైన పెదసోమయ

"అది నృపతిఁ దెచ్చిన
యాదోఁకిపురంబు నడుమ నంకిలివడినన్
మోదమునఁ బ్రౌఢరాయమ
హీదయితునిచేతఁ దెచ్చె నిందఱు నెఱుఁగన్."

పద్యబసవపురాణము తెలిపిన ఈ యంశములను గ్రహించి పాల్కురికి సోమనాథుని కాలమును సునిశితముగ నిర్ణయించుటకు అవకాశము కలదేమో ఇక చూతము.

ఓరుగంటిపురమున పాలుకురికి సోమనాథునికి సమకాలీనుడై రాజ్యముచేయుచుండిన భూపతి ప్రతాపుడని పద్యబసవపురాణము తెలుపుచున్నను అతడు కాకతీయరాజన్యులలో కట్టకడపటివాడయిన ప్రతాపరుద్రుడని ప్రతాపచరిత్రము నిర్దిష్టముచేయుచున్నది. ప్రతాపరుద్రునికే వీరరుద్రు దనియు నామాంతరము. పాల్కురికి సోమనాథుఁడు ఇకనీదేశమును తురుష్కు లాక్రమించుకొందురని చెప్పుటను బట్టికూడ ఓరుగంటి నేలు ప్రతాపుడు ప్రతాపరుద్రుడే యనుట స్పష్టము. మొట్టమొదటిమాఱు తెలింగానాపై మహమ్మదీయదండయాత్రలు కాకతిప్రతాపరుద్రుని కాలముననే జరిగినవని మనకు చరిత్ర ననుసరించి తెలియుచున్నది. ఢిల్లీ సుల్తానయిన అలాఉద్దీన్‌ఖిల్జీకాలమున ఓరుగంటిపై మహమ్మదీయసైన్యములు క్రీ. శ. ౧౩౦౨-౦౩లో ఎత్తివచ్చినవి; కాని వీటికి విజయము చేకూరలేదు. రెండవ మహమ్మదీయదండయాత్ర క్రీ. శ. ౧౩౦౯ లో జరిగినది. మహమ్మదీయచరిత్రముల ననుసరించి కాకతిప్రతాపరుద్రధరావరుడు మహమ్మదీయులతోడి ఈసంగ్రామమున పరాజితుడై ఢిల్లీసుల్తానుతో సంధిచేసికొని యాతని కేటేట గప్పము కట్టుట కంగీకరించెను. కాని ముసునూరి ప్రోలయనాయకుని విలసశాసనము ననుసరించి చూడగా క్రీ.శ. ౧౩౨౩లో ఓరుగంటిపై జరిగిన కడపటి మహమ్మదీయదండయాత్రలో కాని కాకతి ప్రతాపరుద్రనృపతి యోడిపోవలేదు. ఈ శాసనముప్రకారము ప్రతాపరుద్రు డీనదియు, దేశము తురుష్కసమాక్రాంత మయినదియు ౧౩౨౩ లోనే. ఎట్లయినను పాల్కురికి సోమనాథుడు ౧౩౨౩ కు పూర్వము పాలకురికిలో నివసించియుండె ననుట నిక్కము. అతడు కన్నడభూమికి వెళ్లినది క్రీ. శ. ౧౩౦౯ ప్రాంతమునగాని, క్రీ. ప్రాంతమునగాని కావచ్చును.

పాల్కురికి సోమనాథుని శిష్యుడయిన పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యయు ఈకాలమువాడే. ఈతని మనుమడే పిడుపర్తి పెదసోమయ - బసవయతనూభవుడు. అందువలన తరమునకు ముప్పదివత్సరములచొప్పున లెక్కవేసినను పెదసోమయకాలము క్రీ. శ. ౧౩౯౯ ప్రాంతము కాని, క్రీ. శ. ౧౪౧౦ ప్రాంతము కాని అగును. ఈపెదసోమయయే నడుమ నంకిలివడ్డ దోకిపర్తిగ్రామమును 'ప్రౌఢరాయ మహీదయితునిచేతఁ దెచ్చె'నట. ఈ ప్రౌఢరాయలు కూడ పెదసోమయకు సమకాలీను డగుటచేత క్రీ.శ. ౧౪౦౦ల ప్రాంతముననే ఉండియుండవలెను. ఈకాలమున నుండిన ప్రౌఢరాయలు రెండవ హరిహరరాయల తనూభవుడును, బుక్కరాయల పౌత్రుడును అయిన మొదటి దేవరాయలు. ఈతడు యువరాజుగ నున్నప్పుడు క్రీ. శ. ౧౩౭౫ ప్రాంతముననే ఉదయగిరిదుర్గమున కధీశ్వరుడై తత్ప్రాంతప్రదేశమును బరిపాలించుచుండెను; తనతండ్రిమరణానంతరమున క్రీ. శ. ౧౪౦౪ లో ఇతడు సింహాసన మెక్కి విజయనగర సామ్రాజ్యాధినేత యయ్యెను. ఇతనికి ప్రౌఢరాయలనియు, ప్రౌఢదేవరాయలనియుగూడ వ్యవహారము. తరమునకు పాతిక సంవత్సరములే వేసి క్రీ. శ. ౧౩౦౯ నుండి లెక్కచూచినను ప్రౌఢరాయలు క్రీ. శ. ౧౩౭౪ ప్రాంతమునకు వచ్చును. ఎట్లు చూచినను ప్రౌఢరాయలు మొదటి దేవరాయ లనుట నిశ్చయము. పిడుపర్తి శివరాత్రి కొప్పయ్య మొదలైనవారికి కాకతిప్రతాపరుద్రమహీపతి యొసంగిన దోకిపర్తిగ్రామము నడుమను అంకిలివడ్డ దనగా దానిని ఆంధ్రదేశము నాక్రమించుకొన్న సందర్భమున మహమ్మదీయప్రభువులు లాగికొని రన్నమాట. పిడుపర్తి పెదసోమయ మొదటి దేవరాయలను ప్రార్థింపగా ఆమహీదయితుడు తురుష్కుల నుండి ఆగ్రామమును తీసికొని — ప్రాయికముగ వారి నోడించియే కావచ్చును — దానిని మరల పిడుపర్తివారి కిచ్చివేసెను. ఈదోకిపఱ్ఱు ఎచ్చటిది, దేవరాయలు ఈగ్రామమును ఎప్పుడు తిరుగ సంపాదించెను అన్న విషయములు

విజయనగరచరిత్రకారులు ఆలోచింపవలసినవి; మన కవి యప్రస్తుతము.

పాల్కుఱికి సోమనాథుడు క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్ద ప్రథమపాదమున ఉన్నవాడని పైవిషయములవలన నిశ్చయ మగుచున్నను అతనికాలము నింకను సూక్ష్మముగ నిర్ణయించుటకు వీలుకలదేమో చూతము. ప్రతాపరుద్రునితో చెప్పి తనశిష్యులకు ఒకగ్రామమును ఇప్పింపవలసినదని పాలుకుఱికి సోమనాథు డడిగినది అన్నయ్యను. ఈతడు ప్రతాపరుద్రుని దండాధిపతి యని, మంత్రి యని పద్యబసవ పురాణము తెలుపుచున్నది. ఈయన్నయమంత్రికూడ పాల కుఱికి సోమనాథుని శిష్యుడట; అరవత్తుమువురు శైవభక్తుల నర్చించు పరమభక్తుడట.పాలకుఱికి సోమనాథుడు ఓరుగంటికి వచ్చినప్పుడు ఈయన్నయమంత్రియింటనే విడిసెనని ప్రతాప చరిత్రము నుడువుచున్నది. అయితే ఈతని యింటిపేరును పద్యబసవపురాణము ఇందుటూరివారని పేర్కొనగా ప్రతాప చరిత్రము ఇందూరివా రనుచున్నది, కాని ఇవి రెంటును తప్పే. ఇందుటూరి యన్నది ఇందులూరి యనుటకు అచ్చు పొరపాటు. ఈయిందులూరి అన్నయదేవుని పెదతండ్రి సోమయతనూజు డయిన మనుమగన్నయవంశమున జని యించిన గణపతిదేవుడు రచియించిన శివయోగసారమున ఇందులూరివారి వంశము వర్ణితమైనది. అన్నయదేవుని పెద తండ్రి సోమయ కొలనిమండలికులను జయించి కొలనివీడు గైకొనుటచేత కొలని సోము డని ప్రసిద్ధినందినట్లు

"లీలఁ గొలని మండలీకుల వెసఁ దోలి
కొలనివీడు తాను గొనుటఁజేసి
కాకతీశుఁడైన గణపతియం(డను)
కొలని సోముఁ డనఁగ వెలసె జగతి."

అను పద్యమువలన దెలియుచున్నది. కాకతి ప్రతాప రుద్రుని ప్రధానదండనాయకులలో ఒకడైన యీయిందులూరి అన్నయదేవుని తండ్రి పెదగన్నయ; తల్లి గౌరమ. వీ రుభయులు పుత్రార్థులై పుణ్యతీర్థములు సేవించినపిదప ఒక్కపరమయతి

"అరుగుదెంచి గౌరమాంబచేఁ బూజలఁ
దనిసి యిట్లు లనియెఁ దల్లి నాకు
నింక నొక్కపుట్టు విలను బుట్టవలయు
నిక్కముగ నిది విధాతృకల్పితంబు"

అని చెప్పినట్లును; ఈయతియే తరువాత అన్నయ దేవుడన బుట్టినట్లును

"ఎనయఁగఁ గతిపయదినముల
ననుపమముగ నిందులూరి యన్నయదేవుం
డనఁ బుట్టె గౌరమాంబకు
జననుత దుగ్ధాబ్ధి బుట్టు శశియుంబోలెన్."

అను పూర్వోక్త శివయోగసారకృతియందలి పద్య ములవలన విశదమగుచున్నది. ఈకృతియందు ఇందులూరి అన్నమంత్రిప్రతాపాదికము లిట్లు అభివర్ణింపబడినవి.

"అప్యుత్తమంబైన యత్యాశ్రమస్థుండు
కారణజన్మసంగతి వహించె
ప్రకట సామ్రాజ్యసంపదలు సకలబంధు
కోటితోడను పంచుకొని భుజించె
మోహూరిరాజుల సేవణంచుచు రాయ
చౌహత్తమల్లుఁడై జగతిఁ బరగె
స్థల గిరి వనదుర్గ బలుకోట(?)మల్లుఁడై
గ్రక్కునఁ బెక్కుదుర్గములు గొనియె
నోపి తురకల గెలిచి ప్రతాపరుద్ర
మనుజనాయకుకోట నేమఱక కాచె
ననుచుఁ బొగడంగ నెగడె ని య్యవని నిందు
లూరి యన్నయదేవుఁ డసూనబలుఁడు.

"కాకతిరుద్రాంబ గాదిలిసుతయైన
రయ్యాంబఁ బెండ్లాడి రూఢికెక్కె
అద్రిజ లకుమాంబ య(ల)న విలసిల్లెడు
కులభామినులను మక్కువ వరించె
వడిఁ [దా గెలిచిన] దెబ్బదిరెండు ఘనదుర్గ
ముల నెల్లఁ [లోన?] దనబంధువులను నిలిపె
మోహూరి [ఘూ] విభులేపార రాయచౌ
హత్తమ ల్ల[ను]బిరుదంబుఁ గొనిన
తాన కొని వా రెదిర్చిననైనఁ బోరి (?)
పెద్ద బంచి(?)రిపులతోఁ బెద్దయైన
ఘంటనిలుని దునిమి తక్కంగ బిరుదు
గైకొనఁడె యన్నవిభుఁ డంద(డొంటి?)కయ్యమునను.

"మొగి నోరుగంటి తూర్పుగవని మొదలుగా
సింహాద్రిసీమగా క్షితి భరించె
హరులు పన్నెండువే లంతియ రౌతులు
పంచలక్ష[యగు] కాల్బలము నేలె

పెంపమహారాష్ట్రకముఁ గాని కాళింగ
  పతియైన గజపతిఁ బాఱఁద్రోచి
ఘలఘాను దగ నోరుగలు చుట్టుముట్టె నె
  క్కుడుపతిఁ జాని కరోల్కటఁ గాచె
నేపుమై పంచపాండ్యుల రూపుమాపి
యోలవెల్లాడిగా మామిడిఁ గొనియె
కొలనిచంద్రు.......................నిందు
లూరి యన్నయదేవుఁ డనూనబలుఁడు"

ఇంకను ఇట్టి పద్యములు చాల కలవు. ఇందులూరి వారినిగురించి మఱియొకతడవ వ్రాసెదను. ఈపై సుపా హృతములైన పద్యములవలన ఇందులూరి అన్నయదేవుడు ప్రతాపరుద్రుని దండనాయకులలో అగ్రగణ్యు డనియు, అతడు మహమ్మదీయదండయాత్రలకాలమున ఉన్నవా డనియు విస్పష్టమగుచున్నది. త్రిపురాంతకమునందలి త్రిపు రాంతకేశ్వరాలయములోని ఏకటిమిద్దె యుత్తరపుగోడమీద ఈ యన్నయదేవుని శాసన మున్నది. ఇది ఖరసంవత్సర మునకు సరియైన శకవర్షము ౧౨౧౩, అనగా క్రీ. శ. ౧౨౯౧ నాటిది. ఈ శాసనము మహాప్రధానియైన ఇందు లూరి గన్నయప్రెగ్గడ కుమారుడు అన్నలదేవుడుత్రిపు రాంతకేశ్వరుని కఖండదీపారాధనము నిమిత్తము ఏబది యావులను దానముచేసినట్లు తెలుపుచున్నది. (Ep. coll. 238 of 1905) ఇంతియకాదు, ఇతని పెదతండ్రి సోమయ (కొలని సోముఁడు) కొడుకు మనుమగన్నయశాసనముకూడ నిక్కడే యున్నది, (Ep. coll. 239 of 1905) ఆ శాసనమును 'అఖండదివియ'నిమిత్తము చేసిన గోదాన మును దెలుపునదే; ఖరసంవత్సరమునాటిదేకూడ. తూర్పు గోదావరిజిల్లా పలివెల శ్రీ కొప్పేశ్వరస్వామి యాలయమున కాకతి ప్రతాపరుద్రదేవమహారాజు రాజ్యముచేయుచుండగా శకవర్షము ౧౨౩౯ కి సరియైన పింగళసంవత్సరమున, అనగా క్రీ. శ. ౧౩౧౭ లో శ్రీమన్మహాప్రధాని అన్నయ ప్రెగ్గడగారికి అభివృద్ధిగాను చేసిన దానమునకు శాసనము కలదు (S. I. I.. V. No. 1). ఈ యన్నయప్రెగ్గడ ఇందులూరి అన్నయప్రెగ్గడయే కాదగును. పాలకుఱికి సోమనాథుని శిష్యుడయిన ఇందులూరి అన్నయప్రెగ్గడ శకవర్షములు ౧౨౧౩-౩౯ లనడుమ నుండినవా డగుటచేత సోమనాథుడును అప్పటివాడే యని వేఱ చెప్పనక్కఱ లేదు.

కాకతిరాజస్వతంత్రకాలమున పానుగల్లు మొదలు మార్జ వాడివరకు గల దక్షిణసీమను వారికి సామంతులై పరిపాలిం చినవారు కాయస్థమహామండలులు గంగయసాహిణి, జన్నిగ దేవ, త్రిపురారిదేవ, అంబదేవాదులు, 'జన్నిగ'పదము జనార్దనశబ్దభవమైయుండును. జన్నిగదేవ, త్రిపురారిదేవ, అంబ దేవాదులు కాకతి గణపతిదేవమహారాజుమంత్రియైన గంగయ సాహిణి మేనల్లుడు. వీరు అఖండపరాక్రమవంతులు; మండ లికబ్రహ్మరాక్షసులు; గండపెండారబిరుదాంచితులు. వీరిలో అంబదేవమహారాజు బహుయుద్ధవిజేత. ఇతనిశాసనములు శకవర్షము ౧౧౯౪ మొదలు కానవచ్చుచున్నవి. ఇతడు శకవర్షము ౧౨౨౨ తుదివరకుకూడ గొంతకాలమువఱకు రాజ్య మేలినట్లు కన్పట్టుచున్నది. ఈకాకతీయ కాయస్థ సామంతులు పరమమాహేశ్వరులు;పరమశివాచారతత్పరులు; త్రిపురాంతకదేవ దివ్యశ్రీపాదపద్మారాధకులు. ఈకాయస్థ సామంతులలోని అంబదేవమహారాజు భాను(౧౨), అర్క (౧౨) సంఖ్యావిలసితమయిన శకవర్షమున, అనగా ౧౨౧౨ కు సరియైన విక్రుతిలో భాద్రపద బహుళ అమా వాస్య మంగళవారమున 'ద్వాదశార్ధోపరాగ' సమయమున మొల్లకల్లూరిగ్రామమును మాహేశ్వరునికి దాన మొసంగినట్లు ఇతని సీలగంగవరముశాసనమునందలి

"శాకేభా స్వర్క సంఖ్యావిలసతి విక్రితే వత్సరే భాద్రమాసే
దర్శే భౌమస్యవారే సుక్రిచిని (?సుకృతిని) సమయే ద్వాదశా
ప్రాదా దంబక్షితీంద్రః ప్రథితశివపురం మొల్ల [ర్ధోపరాగే
మాహేశ్వరాయ ప్రకటిత మ...." [కల్లూరిగ్రామం

అనుశ్లోకమువలన దెలియుచున్నది. ఈశ్లోకము కడపటిపాదమున ఛందోభంగమైనది. పైగా శాసనపంక్తి చెడినదికూడ. అందువలన గడపటిభాగము పోయినది. శివునికి ప్రీతిగా సమర్పించినట్టికాని, శివభక్తులకు దానము చేసినట్టికాని గ్రామమునకు శివపురమని సంప్రదాయము. ఈశాసనము కొంత సంస్కృతభాషను, కొంత తెలుగు బాసను వ్రాయబడినది. చివర నొకసంస్కృతశ్లోకము కలదు. ఈశాసనమునందలి తెలుగుభాగ మి ట్లున్నది :

స్వస్తి శ్రీశకవర్షంబులు ౧౨౧౨ అగు నేంటి విక్రితి
సమ్వత్సర భాద్రపద బహుళ ౧౪ మంగ
ళవారాన సూర్యగ్రహణకాలమునం
దు స్వస్తి శ్రీమతు గండపెండార అంబదే

వమహారాజులు శ్రీత్రిపురాంతకం క్షే
త్రవాసులైన రెండ్రేవుల మల్లినాథయం
గారికి మొల్లకల్లారు సర్వబాధాపరి
హారము ఆచంద్రార్కస్థాయిగాను ఇచ్చిన శి
వపురము మంగళ మహాశ్రీ శ్రీ శ్రీ.

ఈతెలుగుభాగము పాలకుఱికి సోమనాథుని కాల నిర్ణయమునకు చాల ముఖ్యమయినది. ఈభాగము ననుసరించి శకవర్షము ౧౨౧౨ లో అంబదేవమహారాజు మాహేశ్వరుడయిన రెండ్రేవుల మల్లినాథయ్యంగారికి మొల్లకల్లారు గ్రామమును శివపురముగా నిచ్చినట్లు తెలియుచున్నది. ఈదానమును ప్రతిగ్రహించిన రెండ్రేవుల మల్లినాథయ్యంగారు ఎవరు? పాలకుఱికి సోమనాథుడు తనబసవపురాణమున తనకు సమకాలమువారయిన శివభక్తులను కొందఱిని ప్రశంసించును. వారిలో రెంటాల మల్లినాథు డొకడు. ఈ రెంటాల మల్లినాథుని పాల్కుఱికి సోమనాథుడు ఇట్లభివర్ణించియున్నాడు :

"ఆదివేదాంతసిద్ధాంతపురాణ
వేదశాస్త్రాగమవిహితమార్గములఁ
దనుమనోధననివేదనసమగ్రతను
బనుగొని జంగమార్చనలు సేయుచును
శీలంబు దనర సీమాలంఘనవ్ర
తాలంకృతిని బేర్చి యాచారలీల
యసలారఁగాఁ గుమారాద్రికిఁ దూర్పు
దెసను సోపానముల్ దీర్చి పొల్పార
మహితసద్భక్తి సమంచితవృత్తి
మహిఁ జను రెంటాల మల్లినాథుఁడును."

దానప్రతిగ్రహీతయైన రెండ్రేవుల మల్లినాథయంగారే రెంటాల మల్లినాథుడు. ఈశివభక్తుడు కుమారాద్రికి తూర్పు దెసను మెట్లు కట్టించినాడట. అయితే పాల్కుఱికి సోమనాథుడు పేర్కొన్న మల్లినాథుని ఇంటిపేరు రెంటాలవారు; అంబదేవమహారాజువలననుండి దానమును ప్రతిగ్రహించిన మల్లినాథయంగారి యింటిపేరు రెండ్రేవులవారు; ఇద్దఱు ఒకరెట్లగుదురు అని సందేహము కలుగవచ్చును. ఈశాసనము చివరనున్న సంస్కృతశ్లోకము ఈసందియమును పటాపంచలు కావించును. ఆశ్లోక మిది. ఇం దచ్చటచ్చట కొన్ని యక్షరములు చెడిపోయినవి : తప్పు లున్నవి. ప్రకటితమయిన ఈశాసనశ్లోకమును ఉన్నది యున్నయట్లు వ్రాయుచున్నాను.

[దే]వీ యస్య త్వకీయం (స్వకీయం?) త్రిపురవిజయినే
చక్షు రుత్పాట్య పూజా[ం*]
క్రిత్వా (కృత్వా) రేజే తతోపి[ద్ధ] ....తరమమలం
దోచా(చ)య్యాఖ్యం ప్రసిద్ధం[।*]
పూర్వద్వారే కుమారక్షితిభృ దుపరిత
స్త[త్*]పురారే[ః*]పురస్తా
ద్రమ్యం సోపానమార్గం [వుమ?]కరమమలం
ద్యుః ప్రతిజ్ఞం విధాయ॥

ఈ( )కుండలీకరణమున నున్నవి సరిదిద్దిన పదములు.
ఈ[ ]కుండలీకరణమున నున్నవి అస్ఫుటముగానున్నవి.
ఈ[*]గుర్తులోనివి శాసనమున లేనివి.

ఈనీలగంగవరముశాసనము (Ep. Coll. 229 of 1935-36) తొమ్మిదిసంవత్సరములక్రింద గాన వచ్చినది. దీనిని శ్రీ ఆర్. ఎస్. పంచముఖిగారు ఎపిగ్రాఫియా ఇండికాలో (౨౫ వ సంపుటము, పుట ౨౬౦ ఆరంభము) ప్రకటించినారు; శాసనప్రతిబింబము నీయలేదు. పై నిచ్చిన శ్లోకపాఠము వా రిచ్చినదే; ఈ( )కుండలీకరణమున జేసిన దిద్దుబాటులును వారు చేసినవే. ఆంధ్రులు కాకపోవుట వలనను, ఆంధ్రవాఙ్మయముతో పరిచయము లేకపోవుట వలనను ఈశాసనశ్లోకప్రాముఖ్యమును వారు గుర్తింపలేక పోయిరి. ఈశ్లోకమును గుఱించి వారు :—

"At the end is added a verse in Sanskrit which seems to refer to the construction of a flight of steps at the eastern gateway of the temple by Kumārakshitibhrit (i.e.) Kumāra Prataparudra" (P 271)

అనియు,

"An indirect mention of Kumarakshitibhrit in the present record points to the overbearing attitude of Ambadeva towards the Kakatiya monarch" (p. 276, f. n. 4).

అనియు వ్రాసియున్నారు. కాకతిప్రతాపరుద్రునికి, కుమారరుద్రదేవు డనుపేరు కొన్నిశాసనములలో ఉండుట




మా న్న వె లు వ డి న ద్వై త గీ త ము లు

శ్రీమతి బాలసరస్వతి &
మాస్టర్ రాజేశ్వరరావు

N. 18602 { రావేరావే
పొదరింటిలోన

పి. సూరిబాబు &
శ్రీమతి బి. రాజరత్నం

N. 18742 { నందకిశోర
రామనామ భజన

మాస్టర్ వి. జే. వర్మ &
శ్రీమతి బి. రాజరత్నం

N. 18747 { వచ్చే అలలు
ఊగవోయీ

"హెచ్. ఎం. వి." గ్రామఫోన్
వ్యాపారులందరియొద్ద
దొరుకును.

## సూదుల కొత్త ధరలు

"హెచ్. ఎం. వి." హైఫిడెలిటి 10 సూదుల పాకెట్ 1-కి రూ. 1/8/-

"హెచ్. ఎం. వి." ఉక్కు సూదులు 200 సూదుల డబ్బీ 1-కి రూ. 1/8/-

"ట్విన్" ఉక్కు సూదులు 200 సూదుల డబ్బీ 1-కి రూ. —/14/-




తారాగణం :

కన్నాంబ * పుష్పవల్లి * కోటిరత్నం *
శేషమాంబ * అద్దంకి * సి. యస్. ఆర్.
బందా * పారుపల్లి సోదరులు *
రఘురామయ్య * ఆరణి.

శ్రీ రాజరాజేశ్వరి పిక్చర్స వారి

# పాదుకా పట్టాభిషేకము.

డైరెక్షన్......K. నాగభూషణం...

'జెమినీ' స్టూడియో లో
నిర్మాణము

DISTRIBUTORS FOR ANDHRA, CEDED & NIZAMS :

**CHAMRIA TALKIE DISTRIBUTORS,**

MADRAS — BEZWADA — SECUNDERABAD — GUNTAKAL.

For Mysore & Tamilnad :—NARASU PICTURES CIRCUIT, MADRAS.

ననుసరించియు, కాకతిప్రతాపరుద్ర అంబదేవులకు రాజకీయముగ పొత్తు చెడినట్లు కొన్ని శాసనములవలన ఊహింపదగియుండుట ననుసరించియు శ్రీ పంచముఖిగారు అట్లు వ్రాయుటకు కారణమయినది. కాని యాశ్లోకమును సరిగా గమనించునెడల అట్లు వ్రాయుట కవకాశము లేదు. పై శ్లోకమునందలి 'కుమారక్షితిభృ'త్తన్నది కాకతిరాజన్యుడయిన కుమారరుద్రదేవునికిగాక కుమారాద్రికే అన్వయించును. సోపానపంక్తిని కట్టించినది కుమారరుద్రదేవుడుకూడ కాదు; రెంటాల మల్లినాథుడు. ఈవిషయము బసవపురాణమువలన విశదమే. అయితే రెంటాల మల్లినాథునిపేరు కాని, రెంద్రేవుల మల్లినాథునిపేరు కాని శ్లోకమున లేదు. తనకన్ను ఊడబెరికి త్రిపురవిజయికి (త్రిపురాంతకునికి) పూజచేసి ప్రసిద్ధిగన్న దోచనామాంకితమాత్రము ఉదాహరింపబడినది. నిత్యము హరునికి వ్రతముగా నర్పింపవలసిన వేయి కరవీర పుష్పములలో ఒకనా డొకటి తక్కువ కాగా తన నేత్రకమలము నూడబెరికి అర్పించి శివునిచే అప్పుడే మఱల దన కంటిని బడసిన దోచమాంబ యను భక్తురా లొకతె పాల్కురికి సోమనాథుని బసవపురాణమున ఇట్లభివర్ణితమైనది:

> "నిరతిశయప్రీతి నిత్యంబు నైదు
> కరవీరపుష్పముల్ హరున కర్పింప
> నొక్కనాఁ డొకఁ డుండఁ దక్కువయైనఁ
> గ్రక్కునఁ దననేత్రకమల మర్పించి
> శివునిచే ననదృశాంబక మర్థ పడసి
> భువికీర్తిఁ బేర్కొ-(ఁగ్గ)న్న దోచమాంబయును"

బసవపురాణమున రెంటాల మల్లినాథుని వర్ణన మైన వెంటనే ఈ దోచమాంబప్రశంస కలదు. శాసనమునందలి శ్లోకమునసైతము సోపాననిర్మాతప్రశంసయు, దోచమాంబ ప్రశంసయు ఒకదాని నొకటి వెన్నంటి యున్నవి. శాసన శ్లోకమున ప్రశంసింపబడిన దోచయాఖ్య పాల్కురికి సోమనాథుడు తన బసవపురాణమున వర్ణించిన దోచమాంబయే యనుటకు సంశయింపనక్కఱలేదు. కుమారాద్రికి తూర్పు ద్వారమున త్రిపురాంతకేశ్వరునిముందు సోపానములు కట్టించినవాడును మల్లినాథయ్యంగారే — రెంద్రేవులవారని శాసనము తెలుపుచుండగా రెంటాలవారని పాల్కురికి సోమనాథుని బసవపురాణ మెఱిగించుచున్నది. శకవర్షము ౧౨౧౨ (క్రి. శ. ౧౨౯౦) నాటి రెంద్రేవులపదమే అఱువందల యేబదిసంవత్సరములు పైగా గడచిన ఈనాటికి రెంటాలగా మారినది (రెంద్రేవుల——-ల్లు-రెండాల — రెంటాల). రెంటాలపదము ప్రాచీనరూపము రెంద్రేవుల. పాల్కురికి సోమనాథుని బసవపురాణముపాయమున గుర్తింపనైన ఈ విషయముల ననుసరించి యాశాసన శ్లోకమును ఈ దిగువరీతిని సంస్కరింపవచ్చు ననుకొందును:

> "దేవి యస్య స్వకీయా త్రిపురవిజయినే
> చక్షు రుత్పాట్య పూజాం
> కృత్వా రేజే తతోపి ద్ర(హ్యా)[నిః]శర మమలం
> దోచయాఖ్యా ప్రసిద్ధా
> పూర్వద్వారే కుమారక్షితిభృ దుపరిత
> స్తత్పురారేఃపురస్తా
> ద్రమ్యం సోపానమార్గం [సుఖ?]కర మమలం
> ద్యుః ప్రతిజ్ఞాం విధాయ"

రెంటాల మల్లినాథుడు శకవర్షము ౧౨౧౨ లో, అనగా క్రి. శ. ౧౨౯౦ లో నుండినట్లు శాసనమునుబట్టి విస్పష్టమగుచున్నందున పాలకురికి సోమనాథుడును అప్పటి వాడే యనుటకు అభ్యంతరము లేదు. ఓరుగంటిలో స్వయంభూదేవుని మండపమున శివభక్తులు చదువుచుండినది పాలకురికి సోమనాథవిరచితమయిన ద్విపద బసవపురాణమే యని విదుషర్తి సోమనాథుడు తెలుపుటచేతను, పాల్కురికి సోమనాథునిచేత బ్రస్తుతుడయిన రెంటాల మల్లినాథుడును, సోమనాథుని శిష్యుడయిన ఇందులూరి అన్నయప్రెగ్గడయు క్రి. శ. ౧౨౯౦ ప్రాంతమున ఉండినవా రగుటచేతను ద్విపద బసవపురాణము పదుమూడవశతాబ్ది కడపటిదళకమున శ్రీమత్కాకతి ప్రతాపరుద్రదేవమహారాజు రాజ్యమునకు వచ్చిన క్రొత్తలో రచియింపబడినదని చెప్పవచ్చును. బసవపురాణమునకు పిదపనే పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రమును విరచించెను.

> "నూతనమ్ముగ జగన్నుతముగా మున్ను
> బసవపురాణ మొప్పఁగ రచించితివి"

అని పండితసత్తములు త న్నన్నట్లు పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్యచరిత్రకృత్యారంభమున తానే చెప్పుకొనినాడు. పండితారాధ్యకథాశ్రోత పాల్కురికి సూరామాత్యుడు: పాల్కురికి సోమనాథుని ముద్దుమఱది. ప్రతాపచరిత్రమున శ్రీమత్ప్రతాపవీరరుద్రుని మంత్రియని పేర్కొన

బడిన 'పాలకుర్తి సూరయ్య'యే పండితారాధ్యకథాశ్రోత యని నా విశ్వాసము. దేశము తురుష్కసమాక్రాంతము కాకపూర్వమే పాల్కురికి సోమనాథుడు కన్నడభూమి కరిగినట్లు పిడుపర్తి సోమనాథుడు తెలుపుచుండుటచేత సోమనాథుని యానిర్గమనము క్రీ. శ. ౧౩౨౦ కి పూర్వము జరిగియుండవలెను. పండితారాధ్యచరిత్రమును పాల్కురికి సోమనాథుడు ౧౩౨౦ కి పూర్వము రచియించియుండును. ఎట్లయినను బసవపురాణ, పండితారాధ్యచరిత్రములు క్రీ. శ. ౧౨౯౦ కిని, క్రీ. శ. ౧౩౨౦ కిని నడిమికాలమున బుట్టిన గ్రంథములు.




దేవాలయములలోని విగ్రహములకు జీవమున్నచో—

# నన్నిచోడుని వస్తుకవి

## = శ్రీ కోరాడ రామకృష్ణయ్య =

నన్నపార్యుని ప్రసన్నకథాఫక్కికంటె నన్నిచోడుని ప్రబంధఫక్కి యెట్లు భిన్నమైనదో, దాని విశేషలక్షణముల నాత డెట్లు తన యవతారిక యందు సూచించినాడో పరిశీలింతము. కవిరాజశిఖామణి యగు నీతడు తన కవితాఫక్కి యెట్టిదో అవతారికలో స్పష్టముగనే చెప్పికొన్నాడు. అంతేకాదు–

" రవికులశేఖరుండు కవి
రాజశిఖామణి కావ్యకర్త స
త్కవి భువి నన్నెచోడు డటె
కావ్యము దివ్యకథం గుమారసం
భవ మటె సత్కథాధిపతి
భవ్యుడు జంగమ మల్లికార్జునుం
డవిచలితార్థయోగధరు
డట్టె వినం గొనియాడజాలదే ? "

అనునట్టి ప్రగల్భవచనములలో స్వీయకవితోత్కర్ష నుగూడ జాటుకొనినాడు. " అంబునిధి మేరగాగ నిఖిలజగము నేలి చనినవారికి సూర్యవంశాధిపతుల కెనవచ్చు సుశ్లాఘధనుడగు నన్నిచోడజనవిభుం డగుటచే నాతనిపట్ల నివి ప్రగల్భవచనములు కావేమో! ఇంతేకాక యీతనిది "సంహితారచన కాదు. సద్రస బంధురంబగు ప్రబంధరచన" దాని మహత్వ మెట్టిదో చూడుడు :

" జంగమ మల్లికార్జును ని
సర్గకవిస్తవనీయ సూక్తియు
క్తిం గొనియాడి సత్కవిత
గేనము లేకనురక్తయైన భా
షాంగనఁ దక్కనేలిన మ
హత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెద ప్ర
బంధము సద్రసబంధురంబుగాన్ "

అని చెప్పికొన్నాడు. ఈ కావ్యమువలన లోకప్రసిద్ధి యీతడు కోరినది. ఇదియు నష్టాదశ వర్ణనములతో బరిపూర్ణంబై దశప్రాణంబుల సప్రాణంబై నవరసభావభరితంబై షట్త్రింశదలంకారాలంకృతంబై రమణీయ కథాసందర్భము కలదట. ఈ అష్టాదశవర్ణనలను గూర్చిగాని, షట్త్రింశదలంకారముల గూర్చిగాని నన్నయ యెత్తుకొననేలేదు. కాని యిట్టి ప్రౌఢప్రబంధ రచనాఫక్కి నీ నన్నిచోడుడు స్వయముగ గల్పించికొన్న దనియు దలంపజాలము. ప్రాచీన కవుల జాడలు పెక్కిందు గలవు. కాని పెక్కువిషయముల నీతడు దేశీయమగు కన్నడభాషాసాహిత్యపు రీతుల ననుసరించిన ట్లగపడుచున్నది. కవిరాజమార్గకర్త తరువాత కన్నడ భాషలో రచించిన సుప్రసిద్ధ కవులందరు వారి రచనలను చంపూ పద్ధతిని ప్రబంధ ఫక్కిలో నడపినవారే. కావున నా ఫక్కినే యవలంబింపదలచిన నన్నిచోడునికి వారు పెక్కు విషయముల మార్గదర్శకు లగుటలో నాశ్చర్యము లేదు.

విక్రమార్జునవిజయ మనుపేర వ్యాసభారత కథను రచించిన పంపకవి, గదాయుద్ధ మనుపేర నా కథనే గ్రహించి రచించిన రన్నకవియును గూడ నీ భారతకథయందలి అర్జునభీములను తమ కథలకు నాయకులనుగా జేసికొని వారికిని,దమ కృతిపతులగు ప్రభువులకును నభేదము కల్పించి యా కథలను ప్రబంధఫక్కినే నడిపించిరి గాని, నన్నపార్యునివలె జగద్ధితము కొరకు పరమార్థదృష్టితో " కృష్ణద్వైపాయనమునివృషభాభిహిత మహాభారత నిరూపితార్థ మేర్పడవలయు" నను

బుద్ధితో రచించినవారు కారు. ఈకారణముచేతనే- అనగా కన్నడమునందలి యీ గ్రంథముల నెఱింగినవాడు గనుకనే కావోలును రాజనరేంద్రు డట్లు నన్నియతో చెప్పియుండును. పంపకవియే తాను చేయబోవు భారత రచనను గూర్చి భారతమునందలి కథవంతను చెప్పుట దుర్లభము గావున కథతో గొన్ని వర్ణనల నొడగూర్చి దీని నొక ప్రబంధముగా జేసెదనని చెప్పికొన్నాడు.

కథలో వర్ణనలను విశేషముగా జేర్చి పెంచి చెప్పుటయే ప్రబంధఫక్కిగా గనబడుచున్నది. కావున కన్నడకవులది ప్రధానముగా ప్రబంధరచనాదృష్టియే యని తలంపనగును. పంప రచించిన రెండవ గ్రంథమగు ఆదిపురాణము జైనమతమునకు సంబంధించినదైనను దానినికూడ ప్రబంధమనియే చెప్పినాడు. ఈతని భారతము ఆదిపురాణము అను ప్రబంధములు పూర్వకావ్యములనెల్ల నణచివేసి పైకి రాగలవని కూడ తలంచియున్నాడు. కాని ఆదిపురాణము సుకవిలోకమునే కాక భవ్యలోకమును గూడ సంతోషపెట్టగలదని యాశించినాడు. ఏలయనగా,నిందు తాను కావ్యధర్మములనేకాక జినధర్మమునుగూడ చెప్పినాడు గనుక. నన్నపార్యుడు నిట్లే మహాభారతసంహితారచనచే జగద్ధితమును గోరినను, కవీంద్రులను ఇతరులనుగూడ తృప్తిపరుప యత్నించెనుగదా. కాని కన్నడకవులవలె నాతడు ప్రబంధలక్షణములను పనిపట్టి వెలయింపదొరకొనలేదు. ప్రాచీనకవిప్రశంస, సుకవిస్తుతి, కుకవినింద, కవితాలక్షణప్రతిపాదనము మొదలగువాని పొంతబోనేలేదు. నన్నిచోడుడు కన్నడకవు లవలంబించిన ప్రబంధమార్గము నవలంబింపదలచినవాడు గనుకనే వారివలెను, వారికంటె నెక్కుడుగను కవితాగుణములను గూర్చి ప్రశంసించినాడు. అందష్టాదశవర్ణనములతో గూడి నవరసభావభరితంబై షట్త్రింశదలంక్రియాలంకృతంబైనదే సత్కావ్యమని వానిని ప్రత్యేకముగా జేర్కొనినాడు. వీని సంఖ్యనుగూర్చి పంపకవి ప్రత్యేకముగా జెప్పకున్నను రన్నకవి సరస్వతీస్తుతిలో వానిని చమత్కారముగా జేర్కొన్నాడు.

ప్రాచీనాలంకారికులలో షట్త్రింశదలంకారములను జేర్కొన్నవాడు దండ్యాచార్యులుగా కనబడుచున్నాడు. ఈతని ననుసరించియే నృపతుంగుడు కవిరాజమార్గమున దోషాలంకారప్రకరణములను రచించి యందు ముప్పదియా రలంకారములనే తెలిపియున్నాడు. ఈతని మార్గమునే రన్నకవియు ననుసరించి అలంకారములు 'మూవత్తారు' అని పేర్కొనియుండును. నన్నిచోడుడు నట్లే చెప్పియుండుటచేత నీతడు నాకాలమువాడేయగునని తలంప నవకాశము లేదు. నన్నయవలె పురాణపద్ధతినిగాక కావ్యపద్ధతి నవలంబించుటలో కన్నడకవుల ననుకరింపదలచుటచేతను, అందు ప్రసిద్ధుడగు కవిరాజమార్గకర్త దండిమార్గమునే యనుసరించుటచేతను ఈత డట్లు చెప్పియుండును. ఇంతేకాక యీనన్నిచోడునికి తరువాతివాడే యగు విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణిలోగూడ నీయలంకారములను ముప్పదియారుగనే పేర్కొని యుండుటనుబట్టి యాతని కాలమువరకునుగూడ నీ దండిమతమే యాదరింపబడుచున్నట్లుగూడ తెలియుచున్నది. పెద్దన "కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే, తేచాద్యాపి వికల్ప్యంతే కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి" యను దండివాక్యమునే యీ క్రిందిపద్యమున ననువదించియున్నాడు.

"కావ్యశ్రీల నలంకరించుట నలం .
కారంబులై చాలశ్రో
తవ్యార్థంబుల నొప్పి పూర్వకృతసం
దర్భంబులన్ జెక్కులు
దాఖవ్యప్రోక్తుల నాఱుముప్పదియునై
భాసిల్లు వానిం గవి
స్తవ్యాద్యుక్తపదస్వరూపములుగా
సాగింతు శాస్త్రక్రియన్"

మహాకావ్యమున నష్టాదశవర్ణన లుండవలయునను విషయముకూడ దండిమతానుసారముగనే నన్నిచోడుడు చెప్పియుండును. కాని కన్నడకవుల ననుసరించి తెనుగున నట్టి కావ్యమునకు ప్రబంధశబ్దమును వాడుట కీతడే ప్రథముడు. తెలుగు లాక్షణికులలో

# నన్నిచోడుని వస్తుకవిత

పెద్దనయు నష్టాదశవర్ణనలతో గూడినదే ప్రబంధ మను నని క్రిందిపద్యమున సూచించి నాడు.

> “నగరము ఖ్యాత్యష్టాదశవర్ణనములం జేసి
> పరగ వచియించు దివ్య ప్రబంధమనగ.”

అష్టాదశవర్ణనలేకాక యరువదినాలుగు విద్యలు కూడ నేర్వనివాడు కవిత చెప్పరాదని నన్నిచోడుని యభిప్రాయముగా గనబడుచున్నది.

> “ఓలిన కడచన నరువది
> నాలుగు విద్యలను నేర్పు నై సర్గికమై
> వాలిన సుకవులపంగా
> కేలతరమె కృతులు చెప్ప నెవ్వరికైనకా”

అను నీతని పద్యము కన్నడభాషలోని కవిరాజ మార్గములో సకలకళలు, భాషలు, లౌకిక సామయికాదివర్ణనలతో గూడిన వస్తువిస్తర కల్పనాశక్తిలేనివానికి కృతులు చెప్పసాధ్యముగాదని చెప్పినపద్యమును దలపించుచున్నది. అందలి “వస్తు విస్తరవికల్పవిదు” అను విశేషణమును నన్నిచోడుని కవితా లక్షణసందర్భమున మనము ముఖ్యముగా గమనింపవలసియున్నది. ఏలయనగా నాతడు తన కవిత ‘వస్తుకవిత’ యని చెప్పుకొనియుండుటయే కాక, కుమారసంభవమున నాతని ప్రశంసకు పాత్రులైన పెక్కు కవులనుగూడ ‘వస్తుకవు’లనియే పేర్కొనుచు వచ్చినాడు. తాను గురువుననుగ్రహమున బడసినది ‘వస్తుకవిత’ యేయట.

> “నింగిముట్టియున్న జంగమమల్లయ
> వరమునందు గనిన వస్తుకవిత
> దగిలి వారియంద నెగడింతు రవికి దీ
> పమున నర్చలిచ్చు పగిదివోలె”

అట్టి కవితమూలముననే తన గురువు నాతడర్చింపబూనినాడు. ఇక పురాణకవులను నుత్తమమార్గ నత్కవీశ్వరులలో వాల్మీకిని, భారవ్యుద్భటులను ఈతడు స్తుతించిన రీతి గమనింపుడు అందు వాల్మీకిని “వస్తు కావ్యాబ్జరవి” యను విశేషణముచేతనే పేర్కొన్నాడు. భారవినిగూర్చి చెప్పినది నాతని కవితయే.

> “భావము వస్తుకవితయు
> పాకవితయును జాతి రసయుతప్రసాద
> గ్రాహ్యోహమేంద్రకేళిన
> గాఢోహ్యావర్ణనల జనావాడైకైకై”

ఉద్భటునిగూర్చి చెప్పుచు నాతడు కుమారసంభవ మును “గూఢవస్తుమయ కావ్యముగా” చెప్పి దాని మెచ్చించె నన్నాడు. ఇట్లు పూర్వకవుల ‘వస్తుకవితా’ విశేషమునే ప్రశంసించుచు అట్టి కవుల “నిజ స్వేచ్ఛగి కృతివస్తుసమితికి వడలగ మది నెఱుగ విబుధవర్గము దల తుకా” అని యాకృతులందలి “వస్తుసమితి”ని మనసెఱిగి గ్రహింపగల విబుధవర్గమునుగూడ కొనియాడినాడు. అనగా కావ్యమున బహిస్ఫుటములై కానవచ్చు ప్రసన్నకథాశీకతార్థముగాని, లేదా అక్షరరమ్యత గాని గాక కావ్యమున నిగూఢమై యున్న వస్తు సమితినే బుధు లీతని కవితలో గ్రహింపవలసినదని యాతని భావముకాబోలును. ఈతని కవిత ‘వస్తుకవిత’. అది జంగమమల్లయవరమునందు గనిన ‘వస్తుకవిత.’ అందు బుధులు గ్రహింపవలసిన విషయము ‘వస్తు సమితి.’ ఇట్లీతడు తన కవిత్వలక్షణమును దెలుపునపు డీ ‘వస్తు’ శబ్దమునకెట్టి ప్రాముఖ్యము నిచ్చినాడో గమనింపుడు. నన్నయగారి ‘ప్రసన్నత’, ‘అర్థయుక్తి’, ‘అక్షరరమ్యత’ల నీతడును గ్రహింపక పోలేదు.

> “సరళముగాగ భావములు
> జానుదెనుంగున నింపుసొంపుతో
> బిరిగొన వర్ణనల్ ఫణితి
> పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
> ధురముగ ప్రాణముల్ మధుర
> దుత్వరసంబున గందళింపన
> క్షరములు నూత్న లార్యులకు
> గర్ణరసాయనలీల గ్రాలగాకా.”

కాని అంతకంటె దన కవిత్వమునకు గల వైశిష్ట్యమును వ్యక్తపరచుకొనుటకు దరువాతి రెండు నిమిదపద్యములను రచించినాడు.

"మృదుకీర్తి సూక్తు లింపొదవింప మేలిల్లు
భావమ్ము నెలమి క్రొ న్వహాముగ
దేశిమార్గమ్ములు దేశియములుగా న
లంకారములఁ దా నలంకరింప ...
వలవజే రచింప వరకవీశ్వరునకు
నూత్నరుచిరకావ్యరత్నవీథి."

ఈతఁ బట్టి వరకవీశ్వరుడు, ఈతని దట్టి నూత్న రుచిరకావ్యము ననియేకదా దీని భావము. అసత్కవి కావ్యము సువర్ణబంధమ్మృదుభావము గల్గియు లోను జూడగా బొరపగు చిత్రరూపమువంటిది. సత్కవి కావ్యము రత్నపుత్రికవంటిది. సత్కృతియందు మహార్థనివహంబు, సదుక్తులు ముక్కిడమై యుండవలె. చీకులావుకంద్రొక్కిన ట్లొకొక్కడు సక్కనైన యాకృతిని కృతి యందురా ? అట్టిదానిని మెత్తురా ? కృతి వరసతివలె చతురోక్తుల, నుతపదబహుగతుల, నలంకారభావకాంతిరసార్థోన్నతి గలదై రసికులకు దన సౌభాగ్యము నెఱిగింపవలె. జగన్మాన్య ప్రభావంబుల మదనాగంబును బోలి క్రాలవలయును. సత్కవికావ్యము విలుకాని పట్టినమ్మును, పర హృచ్ఛిదములై తలయూపింపవలె. అరువది నాలుగు విద్యల నేర్పు నైసర్గికమై వాలిన సుకవులకుగాక కృతులు రచించుట యితరులకు తరమా ? అరువది నాలుగు విద్యలే కాదు; అష్టాదశవర్ణనలతో బరిపూర్ణంబై దశప్రాణములు, నవరసములు, షట్త్రింశదలంకారములతో గూడి రమణీయంబైన దివ్యకథారంభమునకే ఈ నన్నిచోడు డభిముఖు డైనాడు. ఇంతకు పూర్వమే దోషగ్రాహులగు కుకవివరాకులను దుర్మార్గపదవర్తులని, గుణమును దోషమునుగామాత్రమే చేయనేర్చు 'నాయి' వంటివారని, చెఱకువిడిచిన రసమును గ్రోలక పిప్పి కరిగొడు నీగలపెల్లువంటి యలుపులని కుకవివరాకులను బరిహరించి, కనకవర్ణోత్కరమును ఒరగంటవలె కవితా విశేషమును (తనవంటి ?) తజ్ఞునందే గాంచవలయు నని సూచించుచు

"అన్యతారకవితతుల నాదరించి
వెలయ సత్కవిబుధగురుబలము వడసి
యొనర దైవజ్ఞునట్లు శుభోదయమున
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ దిరముగాగ"

అని తన దివ్యసుకృతి ప్రతిష్ఠాపనాప్రతిజ్ఞను ప్రకటించినాడు. ఈ పద్యమునందు దనను దైవజ్ఞునితో బోల్చుకొను సందర్భమున జూపిన శ్లేషభంగిమ, అర్థచమత్కారము మనము గమనింపదగియున్నది ఇట్లే ఉత్కృష్టకవితారీతినిగూర్చి పైని దెలిపిన యేడెనిమిదిపద్యములలోను ఏదోయొక చమత్కృతి, వైశిష్ట్యము కనబడుచునేయున్నది. ఈ వైశిష్ట్యము ఒక్కవస్తువునే, లేదా ఉన్న విషయమునే సామాన్యముగా శ్లేషభంగిమములచేతను, ఉక్తివైచిత్ర్యము చేతను పెక్కురీతుల వర్ణించి చెప్పుటచే గలుగు చున్నది. "చతురోక్తుల, నుతపదబహుగతుల, నలంకారభావకాంతిరసార్థోన్నతిని, కృతి వరసతివలె సౌభాగ్యమును దెలుపవలదా" యని యాతడు చెప్పియే యున్నాడు. ఇక్కడను శ్లేష. సతికి, కృతికి సామ్యము. మరియొకమారు కృతికి, మదనాగంబునకు సామ్యము. "సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్ మదనాగంబునుబోలె గ్రాలవలదా." ఇంకొకదానిలో సత్కవి కావ్యము రత్నపుత్రిక. మరియొకదానిలో నూత్న రుచిరకావ్యము-రత్నవీథి. వేఱొకదానిలో సత్కవి కావ్యము విలుకానిపట్టినమ్మువంటిది—పరహృచ్ఛిదమై తలయూపించునది. దీనినిబట్టి యీతని రచనలో నవవరతముగా శ్లేషపద్ధతిని అసాధారణములగు వస్తువుల తోడి యౌపమ్యమును సాధించుట యొక విశేషలక్షణముగా మనము గ్రహింపవచ్చును. దీని కాకాలమున బ్రసిద్ధమైయుండిన త్రివిక్రమభట్టునలచంపువు నాదర్శముగా గ్రహించెనేమో యనియు దలంపవచ్చును. ఏలయనగా సత్కవికావ్యమును విలుకాని యమ్ముతో బోల్చిన పద్యమునకు మూలమగు శ్లోక మాగ్రంథావతారికలో గానవచ్చుచున్నది:

"కింకవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః"
"ముదమున సత్కవికావ్యము
నదరగ విలుకాని పట్టినమ్మును బరహృ

ష్ఫదమై తలయూపింపని
యది కావ్యమె తలకి పట్టినదియుం గరమే"

నన్నిచోడుని రచనాశక్తి, శ్లేషపద్ధతిని కొంత వరకు త్రివిక్రమభట్టుపద్ధతిని బోలియున్నదనిపించును. ఈతని యవతారికాశ్లోకములధోరణిని చూడగా కొంత వరకు నన్నిచోడు డీతని పద్ధతిని గ్రహించినాడనియు దోపకపోదు.

సామాన్యముగా నసదృశములుగా గనబడు వస్తువులకు శ్లేషభంగిమచేతను, రూపకోత్ప్రేక్షాద్యుక్తి వైచిత్ర్యముచేతను సాదృశ్యము కల్పనముచేసి వర్ణనాప్రౌఢిమను ప్రకటించు కవితాపద్ధతియందు సామాన్యముగా 'భావము'నకుకంటె వస్తువునకే ప్రాధాన్యముండకతప్పదు. కావుననే నన్నిచోడుడు తన కవితను 'వస్తుకవిత' యని చెప్పియుండును. పూర్వకవులను స్తుతించునప్పుడుగూడ వాల్మీకి 'వస్తుకావ్యాబ్జరవి' యని, భారవి 'వస్తుకవితను జనారాధితు'డని, ఉద్భటుడు 'గూఢవస్తుమయకావ్యము చెప్పె'ననియు జెప్పుటచే నీతని కీరీతికవితయం దభిమానము కలదని వ్యక్తమగుచున్నది. కవితయందలి వస్తురసాలంకార ప్రాధాన్యతలనుబట్టి కవితాభేదము లేర్పడుచున్నట్లు విన్నకోటపెద్దన కావ్యాలంకారచూడామణిలో జెప్పియున్నాడు.

"ఆరయ వస్తురసాలం
కారప్రాధాన్యవృత్తి గబ్బంబులు పెం
పారు ద్రివిధార్థఘటనల
ధీరులు పరికించి వాని దెలియగవలయుణ్"

కాని పూర్వకవులెవరు ప్రత్యేకముగా తమది వస్తుకవితయనికాని, రసకవితయనికాని చెప్పుకున్నట్లు కనబడదు. ఈకాలమున భావప్రధానమగు కవిత యను నర్థమును స్ఫురింపజేయు 'భావకవిత' యను కవితాభేద మేర్పడినట్లే ఆకాలమున నన్నిచోడుడు వస్తుప్రధానముగా దాను రచింపబూనిన కవితకు 'వస్తుకవిత' యను పేరు పెట్టుకొనిన ట్లూహింపనగును. పెద్దన వస్తుప్రాధాన్యమున కిచ్చిన యుదాహరణ మిది.

"శేముక విశ్వేశుడు శివ
చూడామణికులమునందు సుస్థిరుడగుటన్
జూడ(గ గనకాద్రికవకుం
గూడక య వ్వెండికొండ కొండిక యయ్యెన్"

చాళుక్యవిశ్వేశ్వర చక్రవర్తి (శివుడు) శివచూడామణి కులమునందు (చంద్రవంశమునందు) సుస్థిరుడగుటచేత (శివుని నివాసమగు) వెండికొండ కనకాద్రితో కవగూడలేక కొండిక (చిన్నది)అయిపోయినదట. వెండికొండ బంగారుకొండతో సమాన మెట్లగును ? శివునికి నెలవగుటచే గలిగిన గౌరవముకూడ నిపు డాతడు (విశ్వేశుడు) చంద్రవంశమున సుస్థిరుడగుటచే పోయినది. కావున వెండికొండ కొండిక యైనది. ఇట్లు వస్తుస్థితినే శ్లేషోత్ప్రేక్షాదుల మూలముగా భిన్నరీతుల చమత్కరించి వర్ణించుటవలన వస్తుప్రాధాన్యము కలుగుచున్నది. గ్రంథమునంతను నిట్టి వర్ణనలతో నింపినపుడది వస్తుకవిత యనకతప్పదుగదా. నన్నిచోడు డిట్లే చేయదలచి తన కవితకు వస్తుకవిత యని పేరుపెట్టుకొనిన ట్లున్నాడు. ప్రాచీనకవుల కవితాభేదములలో మాత్ర మిట్టిది కనబడదు. కావ్యభేదములలో ప్రబంధ చాటుప్రబంధములని గద్యపద్యోభయ సంమిశ్రితములని అప్పకవి మొదలగువారు చెప్పినారు. కవితలు ఆశు, చిత్ర, గర్భ, బంధభేదములచేతను, ఆశు, మధుర,చిత్ర,విస్తర భేదములచేతనుగూడ ప్రసిద్ధములు. ఈ తుదినాల్గును ప్రాచీనాలంకారికుల మతమున గానరాకుండుటచే దేశీయకవితకు సంబంధించినవిగానే కనబడుచున్నవి. ఇటీవలి తెలుగులాక్షణికులు, కవులు కొందరు వీనిని చేర్కొనినారు. తమిళభాషలోని కొన్ని "పాట్టియల్" లక్షణ గ్రంథములలో నీభేదము కానవగును. అందు (కవిజర్వగై) కవుల భేదములను దెలుపుచు "కవి గమకన్, వాది, వాక్కి ఎన్ఱ వగైయిన్ ఇయల్పుం. పలనూల్తన్నైయుం ఆరాయ్ంద ఆశు, మదురం, చిత్తిరం, విత్తారం ఎన్ఱ నాల్వగైప్పట్ట కవిజరెన్ ఇయల్పుం" అని కలదు. ఇందలి తొలిచతుష్కము "కవి, గమకి, వాది, వాగ్మి" అని ప్రాచీన కన్నడకావ్యములలో గాన

వచ్చును. తెలుగున నన్నిచోడుని కావ్యములోను కవిగమకి శబ్దములు కలవు. కుమారసంభవము ఏకాదశాశ్వాసాదిని జంగమమల్లికార్జున స్తుతియం దాతనిని "శ్రీరమణః సకలసుజనాధారుడు కవిగమకి బుధనిధానుడు" అని స్తుతించినాడు. తిక్కనార్యుడుకూడ కవిగమకి శబ్దములను వాడినాడు. ఆశు, మధురాదిభేదమును తెలుగున ప్రాచీన లక్షణకర్త లంతగా తెలుపకున్నను శ్రీనాథుడు, పింగళిసూరన మొదలగువారు తమ కావ్యములలో నీభేదములను మాత్రము పేర్కొనియున్నారు. లక్షణకర్తలలో నీభేదమును గూర్చి తెలిపినవాడు లక్షణదీపికాకారు డొకడు కానిపించుచున్నాడు. ఈతని గ్రంథము ముద్రితము కాలేదు. దీనినిబట్టియే వీని లక్షణమును సవిస్తరముగా తెలిసికొన నవకాశ మేర్పడుచున్నది. కావున నాభాగము నీ క్రింద బొందుపరచుచున్నాను. కవితామహత్త్వంబున చతుర్విధ కవిత్వరచనా చమత్కారంబులని చెప్పంబడువాని నాత డిట్లభివర్ణించినాడు. ఇతర లాక్షణికులు వీనిని గూర్చి చెప్పకుండుటచే వీని వివరము తెలిసికొనుట యావశ్యకము.

"ఆశుమధురవిస్తార చిత్రకవిత్వంబు లని విలసిల్లె. అందు ఆశుకవిత్వం బన్నది—ఏకపాద త్రిపాద కఠిన ప్రాస విషమసమస్యా పూర్తులు వ్యస్తాక్షరీ సంఘటిత పద్యంబును, ఇష్టార్థ దేవతా వరప్రతిపాది నిషేధాక్షర రచనా చమత్కృతియు, నష్టావధానంబులు, ఘటికాశత గ్రంథకల్పనయు, ఆకాశ పురాణంబు లని తత్కాలోచితాతిత్వరితగతిని రచింపబడునది యాశుకవిత్వంబును ; మధురకవిత్వం బన్నది — నాటకాలంకారంబులు, కలికోత్కలికలు, విభక్త్యాది దేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్లట్లు గీతప్రబంధంబులు, చతుర్భద్రికాష్టభద్రికలు బిరుదావళి నామావళి భోగావళి రంగఘోష జయఘోష చతురుత్తర సంఘటనలును, యక్షగానంబున వెలయు పదములు, దరువులు, లీలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులుయ్యాలజోలలు, జక్కులరేకు పదంబులు, చందమామసుద్దులు, అష్టకంబులు, ఏకపద ద్విపద త్రిపద చతుష్పద షట్పదాష్టపదులు నివియాదిగా గల్గు నన్నియు లయప్రమాణంబుల నొప్పి మృదుమధుర వచనరచనల ప్రసిద్ధంబైనయవి మధురకవిత్వంబులు; విస్తార కవిత్వం బన్నది- ఇష్టదేవతా ప్రార్థనయు, కృతికర్త వంశావళియు, పురవర్ణన, మృగయాత్ర గిరి వన వర్ణన, జలనిధివర్ణన ద్యూత వినోద రాయబార వివాహోత్సవ సురతక్రీడ పుత్రోత్సవ సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయ చంద్రోపాలంభన విరహ వర్ణనలు, షడృతువులవర్ణనలు జలక్రీడలు, మధుపాన దండయాత్ర రణక్రీడ దిగ్విజయంబులు నివి యాదిగా గలిగిన యష్టాదశ వర్ణనలు, అలంకారంబులు, రీతులు, శయ్యలు, వృత్తులు, పాకంబు లుత్ప్రేక్షలు శ్లేషోల్లేఖలుధ్వనులు వ్యంగ్యంబులు నివియాదిగాగల్గు కావ్య లక్షణంబులు గలిగి పంచలక్షణ, దశలక్షణంబుల నొప్పి కథాసరణి విస్తరిల్లుటంజేసి యది విస్తారకవిత్వం బన్నది మహాప్రబంధంబు; చిత్రకవిత్వంబన్నది— పాదగోపనంబును పద్యభ్రమకంబును పాదభ్రమకంబును నామగోపనంబును అవిలోమ విలోమగతి పద్యంబులు, కందగీత గర్భితవృత్తంబును, కందద్వయగర్భిత మణిగణనికరంబును, క్రౌంచపదగర్భిత కందద్వయంబును, ద్విపద చౌపద లాలి సువ్వాల మంగళహారతి ధవళంబులు శోభనార్థచంద్రికాది పద దరువ్వాలాది లయ గతి గర్భిత సీసంబును, కంకపటహ మండూక తురంగ నట భేరీ నినాదనాలుకరంపవృత్తంబులును, ఓష్ఠ్య, నిరోష్ఠ్య సంకరజిహ్వా అచలజిహ్వా వృత్తంబులును,రగడభేదంబులును,తాళగతులును, దండకవృత్తంబులును, అష్టదళ షోడశదళ ద్వాత్రింశద్దళ పద్మబంధంబులును, నవావరణ ద్వాదశావరణ చక్రబంధంబులును, రథ నాగ ద్వినాగ కులాలచక్ర ఆందోళికా ఛత్ర బంధంబులును, గోమూత్రికా పుష్పమాలికా పుష్ప గుచ్ఛ మృదంగ డమరు ఖడ్గ త్రిశూల కంకణ సర్వతోభద్ర కవికల్పిత కల్పవల్లరి నివి యాదిగాగల్గు బహువిధ చమత్కారంబుల చిత్రంబులు రచియించుటంజేసిన నిది చిత్రకవిత్వము. ఇట్టి కవిత్వంబు కావ్యలక్షణంబునం జెప్పిన వాక్యపదదోషంబులు

చతుర్వింశతి దోషంబులు పరిహరింపవలయు. దోషంబులు వర్జించి కవిసమయసిద్ధ ప్రయోగంబు లరసి యభినవకావ్యం బుపక్రమించునపుడు భారత భాగవత రామాయణానేక పురాణప్రసిద్ధంబులైన యితిహాసంబునం గల కథ విస్తరించుట యిహపర సాధనంబని మహాకవిశ్రేష్ఠుల కభిమత మది కవిత్వరచన సన్మార్గంబు—"

ఇట్లు పైలక్షణమున జెప్పబడినట్లుగా ఇష్ట దేవతా ప్రార్థనము, కృతికర్తృవంశాభివర్ణనము, అష్టాదశవర్ణనలు, అలంకారములు, రీతులు, శయ్యలు, రసములు మొదలుగాగల పంచలక్షణ దశలక్షణంబుల నొప్పి కథాసరళి విస్తరిల్లునట్లు నన్నిచోడు డీ గ్రంథమును సద్రసబంధురం బగు ప్రబంధంబుగా జేయుటచేనిది పై లాక్షణికమతము ననుసరించి 'విస్తర' కవిత యనుట కవకాశము కలదు. ఇట్టి వస్తువిస్తరము కలది గనుక నీతని మతమున 'వస్తు' కవితయు, లాక్షణికమతమున విస్తరకవితయుగూడ గావచ్చును.

తమిళమున క్రీ. శ. ౧౨-వ శతాబ్దినుండి ప్రసిద్ధి గాంచిన 'పాట్టియల్' గ్రంథములో నీభేదము తెలుపబడియుండుటచేతను, అంతకుబూర్వమేయుండిన నమ్మాళ్వారు శిష్యులలో నొక 'మధురకవి' బిరుదాంకితుడుండినట్లు తెలియుచుండుటచేతను ఈవిభాగము దేశీయమై చిరకాలమునుండియే వచ్చుచున్నదని యూహింపదగియున్నది. తాను 'వస్తుకవి' నని గాని, తనది 'వస్తు' కవిత యనికాని ప్రత్యేకము చెప్పికొనినవారు తెలుగుకవులలో నున్నట్లగపడదు. కాని యీపేరు, లక్షణము నన్నిచోడుని కవితకు ప్రత్యేకముగా దగియున్నదని, అది వస్తుప్రాధాన్యమును సూచించుచున్నదని మాత్రము చెప్పకతప్పదు. ప్రాచీనకవు లెవరు నీ'వస్తు' కవితనుగూర్చి ప్రత్యేకముగా జెప్పకొనకపోయినను కన్నడకవులలో పంప "వర్ణకంక తెయొ లాడంబడం" అని చెప్పినాడు. అర్వాచీన కన్నడ కవులలో నొకడగు రత్నాకరకవియు (క్రీ.శ. ౧౫౫౦ ప్రాంతమువాడు) "వస్తువిద్యయొ నె" అనియు, తాను రచించిన 'భరతేశవైభవ'మను షట్పదికావ్యములో దీనిని ప్రశంసించినాడు. ఈతడు కావ్యములు ఓదుకబ్బవ (చదువుటకైన కావ్యములు), హా (పా)డు కబ్బవ (పాడుటకైన కావ్యములు) అని రెండు విధములని, అందు పాడుకావ్యములలో లక్షణ మంత విశేషముగా పాటింపనక్కరలే దనియు జెప్పుచు నందు లక్షణయుక్తమైనది 'వస్తుకవిత'యని, తద్భిన్నమైనది 'వర్ణక కవిత' యని యొకవిధమైన విభాగము చేసినాడు.

సకలలక్షణ యుక్తముగా జేసి కావ్యమును బిరుసుగా జేసినచో నది (బదనెకాయ) వంకాయకవిత్వమవునట. దీనినిబట్టి సకలలక్షణ సంయుతమగు కవిత 'వస్తు' కవిత యనదగునని తోచుచున్నది. నన్నిచోడుడు తన కవిత "అష్టాదశ వర్ణనాపరిపూర్ణంబై, దశప్రాణంబుల సప్రాణంబై, నవరసభావభరితంబై, షట్త్రింశదలంకారాలంకృతంబై, సకలలక్షణ యుక్తముగ రచింపదలచినట్లు చెప్పికొనినాడు. శ్లేషోత్ప్రేక్షాద్యలంకారముల మూలమున వస్తుస్థితి ననేకభంగుల వర్ణించుటలో నీతని మించినవారు తెలుగుకవితలో నున్నట్లగపడదు. ఈతని గ్రంథము మొదటి నుండి తుదివరకు నిట్టి వర్ణనలతో గూడియేయున్నది. తొలియవతారికాపద్యములలోనే యీధోరణిగానవచ్చినదిగదా. "కృతి నతిరసికులు సతిగతి నెరిగింపవలదె"; "సత్కృతి జగన్మాన్యప్రభావంబులన్ మదనాగంబునుబోలె గ్రాలవలదా" మదనాగంబుతో నింకను బోలికలు - నదులు మదనాగంబులవలె ననుదెంచినవట—

"దరములు ముంపుచున్ దరుల
తాతతి వేళులతోన కూలగా
సురవడి ద్రోచుచున్ మడువు
లోలి గలంచుచు నంబుజాలిసం
హరణముసేయుచు న్మదజ
లౌఘము గ్రమ్మ మదాంధగంధసిం
ధురమును బోలె బెల్లున న
దుల్ సనుదెంచె భయంకరాకృతిన్"

వసంతాగమమున మామిడిచెట్ల నెన్నిరీతులుగా వర్ణించినాడో చూడుడు—

ఒకచో నవి వలరాజుపంచమణిహర్మ్యములు-

"మొగడలు వజ్రముల్ విరులు
ముత్తెము లింపగు సున్నగెంపులే
జిగురులు పద్మరాగములు
చిల్కలు నైరిజరాజి తుమ్మెదల్
నగరిపునీలజాలములు
నా దనరారె వసంతవల్లభుం
డగు వలరాజు పంచమణి
హర్మ్యములో యన జాతభూజముల్"
(క. సం. ౪-౯౯)

మరియొకచో నీసహకారచక్రవర్తి శంభుమూర్తి దాల్చినాడు—

"పలకెడు కోరకు లలితాస్థిచయము గా
పోలుకొమ్మలు పలుకేలుగాగ
బాలపల్లవములు వ్రేలు కెంజెడలుగా
బెనగు తీగెలు దొడ్డ ఫణులుగాగ
గలకంఠనికరంబు గళమున కప్పుగా
బుప్పొడి మేని విభూతి గాగ
ఫలములు వరదానఫలములుగా నలి
మాలికల్ రుద్రాక్షమాలికలుగ
శంభుమూర్తి దాల్చె సహకారభూరుహ
చక్రవర్తి నవవసంత వేళ"  (౪-౧౦౧)

మరియొకమారీమామిడి వలరాజును బోలినది:—

"తలి రెల్లి పూవుటమ్ముల
బలసిన పికకీరభృంగపరివారముతో
వలరాజుబోలి మామిడి
సలలితగతి నుతవసంతసంగతి నొప్పెన్"
(౪-౧౦౩)

వేరొకచో నీ సహకారము లతాంగి యైనది:—

"అలరుల మందహాసమున
నన్నన షట్పదమంజుగీతిరా
చిలుకల ముద్దుమాటలను
జెందలిరాకుల రాగలీల గో
కిలనినదంబులన్ బికిహి
కేశభరంబున ముక్తపర్ణమే
ఖల నభిరామమయ్యె సహ
కారలతాంగి మధుప్రసంగతిన్"

భిన్నరంగముల నాట్యపాత్రలు చేయునృత్యము నెన్నిరీతుల వర్ణించినాడో చూడుడు:—

"ఆక్రోకాక రను రాజుమ్రోల నిజరా
వానంతగేయాభినా
దైకాతోద్యము గూర్చి మ్రోయ సురగో
పాంభోజరాగత్వణా
నీకోద్యద్ధరిదశ్మకస్థలలస
న్నృత్యోర్వరరంగస్థలిం
గేకీపాత్రము లాడె భావముగ ను
క్షిప్తాగ్రపింఛంబులై."  (౬-౭౬౦)

"గళనాదంబులు మంజుగానములుగా
గాంచీలసత్కింకిణీ
కలనాదంబులు హృద్యవాద్యములుగా
గాంతోరుపీఠోన్నత
స్థలరంగమ్ముల గాముడ న్నటికుడై
జ్ఞం గూడ నాడింపగా
లలనాపాత్రము లాడి రొప్ప రతిలీ
లాలాస్యలోలాస్యలై"  (౮-౧౮౦)

మహాకాళి పేరోలగమున:—

"భటవాజిరుండముల్ పటహముల్ గా దీర్చి
రమణ వేతాళవాద్యములు సెలగ
దలితకపాలముల్ దాలముల్ గా జంబు
కముల సంకీర్ణరాగములు మొరయ
సరసాజినంబులు సల్లడంబులు గట్టి
నాకకులకంచెల లొనర బెట్టి
హాస్యబీభత్సభయానకరసములా
యత్తంబుగా నోలి నభినయించి
సంగరాంగణంబు రంగంబుగా భూత
గణము విచ్చలింపగా బిశాచ
నర్తకీచయంబు నర్తించె గంకాళి
చిత్రమలరి యంగచిత్ర మెసగ"  (౧౧-౨౨౦)

# నన్నిచోడుని వస్తుకవిత

ఒకసారి గుహుని వాహిని పరమేశ్వరువాక్కృతిని బోలి నడచినది:—

"ధరణీధరశోభితమై
నిరుపమమై యమరవాహినీ సంయుతమై
హరిభూషితమై పరమే
శ్వరువాకృతి బోలి గుహుని వాహిని నడచెన్"

మరియొకసారి క్రొక్కారురో యనునట్లుగా నడచినది:—

"ఉరుహేతిప్రకరోల్లసద్ద్యుతులు వి
ద్యుల్లేఖ లుత్తుంగసిం
ధురముల్ నీలఘనాఘనంబులు మహా
తూర్యధ్వనుల్ గర్జన
స్వరముల్ భూషణరత్నదీప్తులు మరు
చ్చాపంబులై క్రాల
కరమై నిర్జరవాహినుల్ నడ: క్రొ
క్కారురో యనం బేర్మితోన్"

అనేకవస్తువులను క్రొక్కారుతో బోల్చి వర్ణించుట యీతని కిష్టము. ఉమాసహితుడై హరుడు రజతగిరికి క్రొక్కారులీల వచ్చెనట:—

"పింఛాతపత్రముల్ పెనగి మరుద్వీథి
గార్క్రొను నీలమేఘములుగాక
వివిధభూషారత్న వివిధాంబుజాలముల్
సదములాఖండలచాపములుగ
ఘనవీథి బొలసాడు ఖచరాంగనాపాంగ
తరళాక్షురుచులు సౌదామనులుగ
సింధురోన్నతకరశీకరాసారముల్
ధారుణి గురియు నాసారములుగ
సంచితంబులైన పంచమహాశబ్ద
రవము లులియ మేఘరవము లెసగ
హరుడు వచ్చె రజతగిరి కుమాన్వితము క్రొ
క్కారులీల గరము గారవమున"

"మణికోదండము లింద్రచాపములుగా
మత్తిల్లి గర్జిల్లు వా
రణముల్ లీల ఘనాఘనంబులుగ వీ
రవ్రాతముల్ గార్చు మా
ర్గణవర్షం బతివర్షమై కురియ నా
కాశాంతరాళంబు ఘా
రుణియుం గప్పుచు క్రొంచ రోలి వోలంగా
రుంబోలె నాఘోరణుల్."

పోరుభూమి క్రొక్కారువలె నున్నది:—

"గర్జిల్లి తోతెంచు కరిఘటాభ్రావళి
జలిగెడు శాతాసి విద్యుదాలి
చివిరెడు రణతూర్యరవగర్జనంబున
నై గ్రమిస్త్ర కురిసెడు బాణవృష్టి
బలసియాడు నురుకబంధబర్హిణముల
ప్రీతి బొలయు భూతచాతకములు
నలియు జంబుకోత్కరోరుభేకముల క్రొ
క్కారుబోలి తనరె బోరుభూమి."

గుహునితో గూడిన సరోవరము కాంచనాచలముపలె నున్నదట:—

"అరుణకిరణసహస్రోదయంబుకంటె
మిగిలి గుహు తేజ మడర సమీపమెల్ల
సలలితద్యుతి గాంచనాచలమువోలె
సురుచిరంబగు నాసరోవరము గనిరి"

ఇట్లు వస్తుస్థితియం దసాధారణములగు నౌపమ్యములను గల్పించి ప్రౌఢవర్ణనాచమత్కృతిని జూపుటయేకాక, తన వస్తుకవితాచతురత నింక ననేకవిధముల వెల్లడించినాడు. చక్రబంధ నాగబంధ మురజబంధాదిరూపంబగు బంధకవిత్వరచనముచే గూడ నీతని వస్తుకవితాప్రౌఢిమ వ్యక్తమగుచున్న దనవచ్చును. అందును మరియొక విశేషము. దేవేంద్రుడు "నాగాభరణుని నాగబంధమురజబంధములచే బ్రస్తుతించినాడట". చక్రిచక్రాద్యమరచక్రంబు చక్రవిద్యా (బంధ) ద్యనేకస్తుతిశతంబుల "తారకమారకు నాకుమారకున్" స్తుతియించిరట. నాగాభరణుని నాగబంధముచేతను, తారకమారకు డగు కుమారకుని చక్రిచక్రాద్యమరచక్రము చక్రబంధముచేతను స్తుతించిరని చెప్పుటలో బంధకవితారచనాభిమానముతో పాటు శబ్దచిత్రాభిమానమునుగూడ వెల్లడించినాడు. వస్తుస్థితిని వర్ణించుటలో

ఇట్టి చమత్కారకారిత్వము నీతడు మరియొకవిధముగా గూడ వెల్లడించినాడు. తెలుగుకవితలో సంస్కృత వృత్తములను వాడుకొనునపుడు ఛాయావృత్తముల నామ ములకు సందర్భానుసారముగా నౌచిత్యమును గల్పిం చుచు రచించు పద్ధతి నీత డీగ్రంథమున నవలం బించెను. మునికుమారుని రూపమున వచ్చిన యీశ్వరు నకు అగజచే "స్వాగతాభిమతవాక్యములను" స్వాగత వృత్తమునందే రచించి చెప్పించెను.

"అగిరీంద్రసుత హర్షముతో సై
వాగమోదితవిధాయతితో సు
స్వాగతాభిమతవాక్యములం ద
ర్భ్యాగతోచితసపర్యల దన్పెన్"

మానినీరూపచరిత్రలను 'మానినీ'వృత్తములోనే వర్ణించుట:

"ఆననలీలసుధాకరబింబము
 నంబురుహంబుల గెల్వగుటన్
వేనలి కృష్ణభుజంగకలాపిస
 విస్తరభాసురమై చనటం
దానతిబాలిక యయ్యు దపం బుచి
 తస్థితి జేయుచు నుండుట నీ
మానిని రూపచరిత్ర లుదారస
 మంబగుచున్నవి చిత్రగతిన్"

క్రౌంచపదగతులను 'క్రౌంచపద'వృత్తమునందే వర్ణించెను:—

"చంచుల నాస్వాదించుచు లేదూం
 డ్లకరవుప్రియులకు నలదుచు మైరో
మాంచము లోలిం గంచుకితంబై పాడ
 మగ నడరుచు బులినములం గ్రీ
డించుచు సంభాషించుచు బ్రీతిం
 బొలుచుచు జెలగుచు బొలయు సముద్య
త్క్రౌంచగతుల్ వీక్షించుచు భాస్వ
 జ్జ్వలనుడు శరవణ సరసికి వచ్చెన్"

కుమారసంభవమునం గలిగిన యుత్సాహము 'నుత్సాహ'వృత్తములోనే వర్ణించినాడు:—

'ఆ హరాద్యమరతతుల హర్షమెసగ దేవసం
దోహమునకు వీరలక్ష్మితోడ వేడ్కలందె బు
ణ్యాహఘోష మెసగె మునిజనాశీయమ్ముల న్మహో
త్సాహ మయ్యెనకుమారసంభవంబునం దొగిన్."

అంబరమున నుడుతతి మణిగణ నికరవిభాతి నుండుటను "మణిగణనికర" మను వృత్తమునందే వర్ణించినాడు:—

"సరసిజహితుడట చన దరతరమ
త్యరుణరుచిన్ మెరుగడరుడు వడినం
బరమున నుడుతతి ప్రవిమలమయ్యెన్
నిరుపమ మణిగణ నికరవిభాతిన్."

పార్వతి మత్తేభవిక్రీడితమును జూచుట మత్తేభ విక్రీడితమునందే చెప్పినాడు:—

"హృదగాహ్లాదముతోడ బాయక సదా
 నేకప్రకారంబులన్
మదనాసక్తి జెనంగుచున్న విలస
 న్మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణి చూచి కౌతుకరతై
 కాలీనభావాభిలా
షదృగత్యుజ్జ్వల దీధితుల్ పరపె నీ
 శానాననాబ్జంబుపైన్."

మరియు వసంతఋతువున మత్తకోకిలల విజృం భణమును "మత్తకోకిల" వృత్తమునందే వర్ణించినాడు:—

"మెత్తమెత్తన చందనాద్రిసమీరణుండు మనోభవుం
డెత్తకుండగ వేగకుండగ నెత్తు మెత్తక తక్కినన్
జత్తుసుమ్మి వసంతుచే నని చాటునట్లు చెలంగెనా
మత్తకోకిల లాఅమింగడమాసరంబగు నామనిన్"

ఈరీతిగా తెలుగుకవితలో సంస్కృతవృత్త సంగ్రహణమున కొకవిధముగా సార్థక్యమును గల్పింప నెంచి నన్నిచోడు డిట్లు రచించినాడా యను సం దేహము కలుగకమానదు. దేశిమార్గములను దేశీయ ములుగ జేయు రీతులలో నిది యొకటేమో? నన్న యకు బూర్వమునందలి తెలుగుశాసనముల కవితలో

## నన్నిచోడుని వస్తుకవిత

నింతవరకు సంస్కృతవృత్తము లగపడకుండుటచే నన్నయయే తొలుత తెలుగుకవితలో సంస్కృత వృత్త సంగ్రహణము చేసినవాడని తలంపవలసియున్నను, అత డిట్టి చమత్కారమును, చాతుర్యమును గనపరుప లేదు. నన్నిచోడుడు ప్రౌఢప్రబంధఫక్కి నవలంబించిన వాడగుటచే నిట్టి శబ్దార్థచమత్కారము లాతని వస్తు కవిత కుపస్కారము లైనవి. ఇట్టి ప్రౌఢప్రబంధ లక్షణలక్షితమగుటయే కాక కథావస్తువిస్తరముకూడ గలదగుటచేతనే యాతని కవిత వస్తుకవితయు, విస్తర కవితయు నగుచున్న దని నిశ్చయింపవగియున్నది.

మల్లాపురమువద్ద 'తుంగభద్రా డాం' నిర్మాణస్థలము



వట్టిదండుగకు సాగరములో కలిసిపోతున్న తుంగభద్రానదిని పైరుపచ్చలకు విచ్చలవిడిగా వినియోగించి రాయలసీమను రత్నాలసీమగా మార్చుటకై బళ్లారిజిల్లాలో హంపీ శిథిలములకు నాతిదూరమునందు ఈగ్రామసీమలో బంధింపనున్నారు. ఇందును గురించిన సన్నాహములు గతిని సాగుతున్నవి.

# పార్వతీ పరమేశ్వరులు

(శ్రీ సత్యనారాయణ, హేమావతీ నాట్యభంగిమలు)



సువానం సత్యనారాయణగారు కేవల స్వయంకృషితో నృత్య విద్యను అభ్యసించి పరినిష్ఠిత ప్రావీణ్యమును సంపాదించినవారు. శ్రీమతి హేమావతిని తోడు చేసుకొని వెళ్లి రాష్ట్రరాష్ట్రాంతరములలో అనేక ప్రదర్శనములు చేసి 'సై' యనిపించుకొని బహుళ బహుమతుల నందినారు.



**శ్రీ క్రొవ్విడి లింగరాజు**

"ఎవరండీ అధికారులు?"

"ఎందుకూ ?"

"కేసు రిపోర్టు పుచ్చుకొనేవారు"

"ఏం కేసు ?"

"కూనీ"

"ఏమిటీ ! కూనీకేసూ ! ఊఁ...."

"అవునండి. నేనే కూనీ చేసింది."

"ఎవరిని?........పెళ్లాన్ని చంపేవేమిటి ?"

"కాదండి........కొడుకుని........"

"ఏమిటీ, కొడుకునా ?"

సబిన్స్పెక్టరు ఉలిక్కిపడ్డాడు. పర్వతంలాంటి మనిషొచ్చి తనంతట తాను నేను నేరస్థుడ నని చెపుతుంటే ఇనస్పెక్టరు తెల్లపోవడ మేమిటి ? నేరం దొరికితే తియ్యనీటికి చేపెక్కినట్లు ఉత్సాహపడే పోలీసుఉద్యోగి కీమాంద్యం ఏమిటీ ? నిజంగా పారిపోతూన్న దొంగను తరుముకెళ్లి గభాలున మీదపడి ఒడిసిపట్టుకున్నంత హంగామా చేయవలసిన పోలీసుఆఫీసరు నెమ్మదిగా లేచి "అరెస్టుచేశాను. కూచో"మన్నాడు. తర్వాతి ప్రశ్న లాయనదగ్గరనుంచి రాకుండానే నేరస్థుడు "సందేహించకండి. నేనే చంపేను. కారణం మీకు తెలియనక్కరలేదు. ఇదిగో రక్తం చవిచూచిన కత్తి, శవదహనమైపోయింది." అన్నాడు.

ఇనస్పెక్టరు విధిలేక చట్టప్రకారం జరుపవలసిన కర్మకాండ అంతా జరిపించడం మొదలెట్టాడుకాని ఆతని హృదయంలో ఏదోఒక సంకోచం వెనక్కి లాగుతూనే ఉంది. చేతులకు సంకెళ్లు తగిలిస్తుంటే సంకెళ్లు తన చేతికే బరువుగా కనుపించాయి. ముద్దాయిశరీరాన్ని శోధిస్తుంటే నవనవలాడుతూ వికసించిన గులాబిపువ్వును అకారణంగా నలిపేస్తున్నట్లు వెక్కసపడ్డాడు. చీకటిగా ఉండే అలాకప్ లో ఆతన్ని నిర్బంధిస్తుంటే ధర్మదేవతను చీకటికొట్లో వేస్తున్నట్లు కటకటపడ్డాడు, కాని డ్యూటీ........డ్యూటీ.... ఇండియన్ పీనల్ కోడ్........అవి స్టీమురోలరు........

*　　*　　*

కొంత స్తిమితపడ్డాక ఇనెస్పెక్టరు నేరస్థుని ప్రశ్నించడం ప్రారంభించాడు. నేరాలు కూపీతియ్యడంలో ఉండే నేర్పంతా చూపించాడు. చచ్చిపోయిన పెళ్లాంకొడుకేమో అనే అనుమానంతో ప్రశ్నలు కురిపించాడు. చేతి కందిన వయస్సు అవడంవల్ల సరసంలో తండ్రికొడుకు లొకచోట తారసిల్లేరేమో నని సంశయించాడు. ఎన్నిప్రశ్నలకైనా నేరస్థుడు ఒక్కటే సమాధానం ఇచ్చాడు. "నేను నేరస్థుడిని. నాచేతుల్తో నా కన్నకడుపును కోసుకున్న పాపిని. ఈప్రపంచంలో జీవించడానికి నాకు చోటూ లేదు, అర్హతాలేదు, అందుచేత నన్ను శిక్షించండి. శిక్షంటే జైలు కాదు, ఉరికి పంపించండి" అన్నాడు. అల్లా మాట్లాడే నేరస్థుడితో వ్యవహరించడం గణపతిరావునాయుడుకు మరింత ఇరుకనిపించింది. లా అంటే మాటలా? చంపినవాడు చంపలేదంటే ఊరుకుంటుందా ? చంపనివాడు చంపేనంటే ఊరుకుంటుందా ? పెళ్లికీ చావుకీ ఉన్నంత కర్మకాండ జరగాలిసి ఉండె. నూరుమంది కళ్లఎదుట మనిషిని మనిషి చంపితేనే సవాలక్షగ్రంథం జరగాలసిన లా, ఒక మనిషొచ్చి నేను హత్యచేశా నంటే మాత్రం ఒప్పుతుందా ! కాకపోతే ఇలాంటి కేసును ఎన్నడూ చూచిఎరుగని నాయుడుకుమాత్రం ఆశ్చర్యకారణ మైంది. నాయుడికే అంతంతగా ఉంటే జవానుల కేమి తెలుసు ? వాళ్ల సంతోషమల్లా ఒక్కటే. ఉచ్చులో పడింది పెద్దపక్షి,

అంతే, ఎంతో పనిచెయ్యకపోతే ఇల్లా వచ్చి ఇందులో చిక్కుకుంటాడా అనే సమ్మరం.

*    *    *

ముద్దాయి రాయన్నగ్రామం విజయేశ్వరం గోపూరు పోలీసుస్టేషనుకు ఎనిమిదిమైళ్ళదూరంలో ఉంది. గ్రామమైతే పెద్దదీ, మోతుబరికైతాంగంకలదీ. అయినా ఆ ఊరు ప్రయాణానికి సౌకర్యంలేదు. వేసవికాలంలో తప్ప బిళ్లబాట లేదు. మిగతారోజుల్లో కోటీశ్వరుడికైనా కాలినడకే శరణ్యం. అందుచేత ప్రజలు నానాఇబ్బందీ పడుతున్నా ఉద్యోగస్థుల రాకిడీ తక్కువవడంచేత ఇదే నయమనుకుని రోడ్డుకోసం ఆందోళనచెయ్యడం లేదని ప్రతీతి. కొద్దిరోజులక్రిందటనే గోపూరుస్టేషనుకొచ్చిన నాయుడు తెల్లవారకట్టే లేచి నానా శ్రమా పడి విజయేశ్వరం చేరుకున్నాడు. ఉద్యోగస్థుల రాకిడి అంతగా ఎరుగని జనం పోలీసుఉద్యోగి వచ్చేసరికి గడబిడపడ్డారు. గణపతిరావునాయడు గ్రామచావడిలో మకాం వేసి జవానుతో కబురంపి మునసబును రప్పించాడు. మునసబు రావడంతోనే

"ఏదయ్యా నీబకీరు" అన్నాడు నాయుడు.

"అదేటండోయ్! బకీరా?"

"అవును. ఏమెరగనట్లు మాట్లాడతావేం?"

"ఏటండోయి ఇనస్పెక్టరుగారూ! ఇపరీతంగా సెప్తున్నారే?"

"ఏమయ్యా మునసబూ: అట్టే నటించకు. ఊళ్లో పలుకుబడి ఉన్నంతమాత్రాన కేసు కుమ్మకు చేద్దామంటే సాగదుసుమా. అందులోనూ కూనీకేసు!"

"కూనీకేసేంటండి! మాఊళ్లోనా? అదేటండీ"

"ఓహో! నంగనాచిలా మాటాడుతున్నావు. ఇంతకూ అతని పలుకుబడి అంత గొప్పదేం? అబ్బాయి! మునసబూ, ఈ పోకడలు కట్టిపెట్టు. నిన్న ప్రొద్దున్న మీఊళ్లో కూనీ జరిగింది. ఈ ఊరికల్లా నాయకుడుట కాదూ ఆ రాయన్న. అంతమాత్రాన్ని దాగుతుం దనుకోకు, ఆరాయన్న కొడుకుని కూనీచేశాడు. మరి......."

"అదేటండోయ్ — రాయన్నదొరా: కూనీ! కొడుకుని...." అని తెల్లబోయాడు మునసబు.

మొదట సందేహపడుతూవచ్చిన ఇనస్పెక్టరుకు ఇందులో ఏదో కుంభకోణ ముందనే అనుమానం ప్రబలింది.

"ఏమయ్యోయ్ మునసబూ! ఇందులో దాచడాని కేమీ లేదు. నిన్న ఉదయం రాయన్న తన కొడుకును తాను కూనీ చేసినట్లు ఒప్పుకుని రాత్రివచ్చి రిపోర్టు ఇచ్చి అరెస్టు అయినాడు. ఆ కేసువిచారణ జరుపడాని కొచ్చాను. బకీరు రాయకపోతే నీకొంపమీది కొస్తుంది...."

అని ఇంకా చెప్పబోతుంటే మునసబు మాట కడ్డొచ్చాడు: "ఏమండోయి ఇనస్పెక్టరుగారూ! నిజం చెప్తా వినండి. రాయన్నదొర అలాంటి మనిషి కాదు. బహూ పెద్దమనిషి, మాఋరదనాటినీమంతా ఆయన్ని ధర్మదేవతలా చూచుకుంటాం. నిన్న ఆయనకొడుకు చచ్చిపోయినమాట వాస్తవమే. మేమంతా వెళ్లి దహనంచేసొచ్చాం. కాని అది కూనీ ఏమిటండీ? ఆకతాయిముండకొడుకు ఆకొడుకు నానారోగాలూ పడి ఒళ్లు పాడుచేసుకొని చచ్చాడు. వాడిని ధర్మదేవత చంపడ మేమిటండీ? ఇందులో ఏదో ఉంది బాబూ! నిన్ననే నేను జననమరణాల పుస్తకంలో వ్రాశాను. అంతేకాని కూనీ లేదండి బాబూ! నమ్మండి!"

ఇనస్పెక్టరు అడ్డొచ్చి "మునసబూ! అదేమీ ప్రయోజనం లేదోయి, నేరస్థుడే వచ్చి నేరాన్ని ఒప్పుకుంటే నువ్వూ నేనూ గిజగిజలాడితేమాత్రం ఏమి ప్రయోజనం? రాయన్న గోపూరులాకప్‌లో ఉన్నాడు తెలుసా?"

"ఇనస్పెక్టరుగారూ, నమ్మడానికి మనసొప్పడం లేదండి. మాదొర ఖైదీ అవడమేటండి! అలాంటి అల్లరి చిల్లర మనిషి కాడండి!"

"అదేమిటోయి! నీ కెంత చెప్పినా అర్థం కాదేమిటి? చూడగాచూడగా నీపీకిమీదకి తెచ్చుకొనేటట్టున్నావు. మాట్లాడక నేచెప్పినట్లు బకీరు వ్రాయి. పద వాళ్ల ఇంటికి, విచారణ చేద్దాం"

"ఏం విచారణ బాబూ! ఆ ఇల్లాలి మొహం ఎల్లా చూడడం? ఇంతకీ ఎంత నిర్భాగ్యుడైనా ఒక్కడేకదా కొడుకు. కడుపుదుఃఖంచేత మనిషి కేమైనా మతిభ్రమ కలిగిందేమో యోచించారూ?"

"అలాంటి చిహ్నా లేమీ లేవు. కొంచెం ఆవేశం కనుపించింది, అంతే"

*    *    *

నాయుడు, మునసబు, నలుగురైదుగురు పెద్దమనుష్యులు రాయన్నఇంటి కెళ్లేరు. పుత్రశోకంతో మూలబడ్డ ఆతని భార్య లచ్చమ్మ (అనే లక్ష్మిదేవమ్మ-పోలీసురికార్డులో)

# కోహిమా వీరగాథ

కోహిమా

మీరు దానినిగురించి విన్నవారైవుండరు. అది చాలాకాలంలో. అస్సాం కొండలలో ఆయుమువేల అడుగుల ఎత్తున వుంది కాని. అకస్మాత్తుగా ఏప్రిల్ నెలాఖరున, మే నెలలో దానిపేరు మారుమ్రోగిపోయింది. వార్తాపత్రికలలో పెద్ద అక్షరాలతో కొన్ని వారాలపాటు అది ప్రధానవార్తగా వుంది.

టోజో సైనికులు చిండ్విన్‌ను దాటారు. మెల్లమెల్లగా. దొంగచాటుగా వారు మౌంట్ జప్వో, నాగకొండలు చేరారు కోహిమా చుట్టునూవున్న కొద్ది మిట్టలను, కొండలను జపానువారు వశపరుచుకున్నారు. నాగజాతి జనులు తమతమ గ్రామాల నుంచి తరిమివెయ్యబడ్డారు. జపానువారు ఆ అభాగ్యుల ఇళ్ళను తగులబెట్టారు. ఆ గ్రామస్థుల గుడిసెలను నేలమట్టంచేసి, వారి పందులను, కోళ్ళను. పంటలను దోచుకున్నారు. "ఇండియాపై దండయాత్ర'' అని జపానువారు ఈముట్టడికి పేరుపెట్టారు.

తరువాత సంఘటనలు గిరున జరిగాయి ఈపేర్లు మీకు జ్ఞాపకం వున్నాయా? జెయిల్ కొండ: జి.పి.టి. మిట్ట: ఎఫ్.టి.ఎస్ మిట్ట: సింపుల్: ఆఖరుది డి.సి. బంగాళా. ఈ రంగంలో భయంకరపోరాటం జరిగింది.

కాని, మన సైనికులు శత్రు సైనిక సంఖ్యాబలాన్ని మించి, జపానువారి ముట్టడిని నిలిపి వెయ్యడమేకాకుండా చివరికి వారిని నాశనంచేసి, మహత్తర విజయాన్ని సాధించారు.

కోహిమా వీరగాథ ఇది.
ఇక్కడ మన సైనికులు
రుజువుచేసినది...

'జపానువారిని మనం కొట్టగలము..... మనము వారిని తిరుగ కొట్టుతున్నాము''

# నటీమణులవలె మీశరీరసౌందర్యమును కాపాడుకొనుడు!



## రమోలా

తన శరీర లావణ్యమే తన ప్రథమ కర్తవ్యమని రమోలా అంటుంది. ఆమె లక్స్ టాయిలెట్ సబ్బు నిత్యము వుపయోగించి చర్మాన్ని మిక్కిలి మృదువుగాను సున్నితంగాను వుంచుకొంటోంది. "ఇదే నేను అందంగా వుంటానికి చేయుచున్నది" అని అంటుంది. ఏ వనిత చర్మాన్నిఐనా ఈ సుగంధ మిళితమైద సబ్బుయొక్క నురుగు మృదువుగాను, లావణ్యంగాను వుంచగలదని గట్టిగా నమ్ముచున్నది.




## లక్సు టాయిలెట్ సబ్బు

LTS. 120-111-40 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

కు రాయన్నకబురు చెప్పేరు. ఒక్కవేటులో కూలిపోయిన అరటిచెట్టులా పడిపోయి ఘొల్లుమంది. కొడుకుచావుకు భర్తపాటు తోడై జీవితమంతా అంధకారమైపోయింది. ఈ రెండు బాధలకన్న తెరబయట నున్న పోలీసుఇనస్పెక్టరు ప్రశ్నలకు సమాధానం చెప్పే బాధ మరింత ఎక్కువైంది. అప్పటికప్పుడే నాయుడు ఇంక్వయిరీలో రాయన్నచాలామంచి వాడనీ, సంపన్నగృహస్థుడనీ, పెద్దమనిషి అనీ, ధర్మాత్ముడనీ, చుట్టుప్రక్కల నాలుగైదు గ్రామాలవాళ్లు ఆతని ధర్మనిష్ఠయానికి బద్ధులై ఉంటారనీ తెలిసింది. అందుచేతనే గణపతి రావునాయుడుకు నేరంసంగతి మరింత అగమ్యమైపోయింది. అలాంటి ఘరానామనిషి తనూ, భార్యా అనేకమ్రొక్కులు మ్రొక్కి నలభైయవఏట కన్న కొడుకును — ఎంతో అపరూపంగా పెంచుకున్న కొడుకును — వాడు ఎంత దుర్మార్గుడైతే మాత్రం చేతులారా చంపడాని కేమిటి కారణం ఉంది? అందుచేతనే లచ్చమ్మను విచారించడంలో సామాన్యంగా పోలీసుఉద్యోగస్థునిలో అపురూపమైన శాంతాన్ని, సౌమ్యతనూ తెచ్చుకొని మాట్లాడేడు.

"గోరుచుట్టుమీద రోకటిపోటా దేవుడా!" అంది.

"తెలిసినదంతా చెపితే ఉపకారం జరుగుతుందమ్మా"

"నాజన్మ కిక ఒకటే ఉపకారం....ఇంతకీ ఆమహరాజు చంపడమేమిటి కొడుకుని? వాడి కర్మానికి వాడే పోయాడు...."

"ఆయనే వచ్చి తన కొడుకుని తానే చంపినట్లు చెపుతున్నాడే మరి!"

"అదేమిటో నాయనా ? నాకేమీ తెలియదు. ఆయనల్లా ఎందుకు చెప్పేరో! చెట్టంత కొడుకు రాలిపోతే మతి చలించడంలో ఆశ్చర్యమేమిటి? -మొండిఘటాన్ని కనుక నేను బ్రతికున్నాను. అయిన కర్మమంతా చాలక కోర్టుకు కూడా ఎక్కాలికాబోలు...."

"తండ్రికొడుకుల కేమైన తగాదా లున్నాయా ఏమిటి ?"

"అయ్యో రామా? అదికూడానా? నూరునోములు నోస్తే లేకలేక కలిగిన నలుసును అపరూపంగా పెంచుకున్నాం. మాప్రాలుబ్ధంకొద్దీ వాడి నడవడి మంచిదైంది కాదు. అయినా తండ్రీకొడుకులు మాట్లాడుకుంటేగా దెబ్బలాట రావడానికి?"

"ఆవేళ ఏమైనా తగాదా పడ్డారా?"

"అదేమో నాకు తెలియదు. క్రితంరాత్రి ఏడు గంటలకు పడమటపేట వెంకయ్యగారు, ఇంకా ఎవ్వరో వచ్చి కొడుకుమీద ఆమహరాజులో ఏవో నేరం చెప్పేరు. వాళ్ల అమ్మాయిని వాడు మోటసరసం చెయ్యబోయాడని రాబోలు! మావాడు అనేకరోజులుగా దుస్సహవాసం పట్టి అన్నివిధాలా పాడైపోయేడు. నాయనా! వారితో ఎన్నోసార్లు మూర్ఖపురాలిని నే చెపుతూవస్తే వినిపించుకోలేదు. ఇంటి వ్యవహారాలు చూడడానికి వారికి తీరి కెక్కడ? ఎప్పుడూ ఏదో ఊరివ్యవహారమే ఆయిరి....పెద్దమనుష్యులు వెళ్లిపోయిన తర్వాత మాత్రం మామూలుగా భోజనానికి లేవకుండా బెంగపడి కూచున్నారు. ఎన్నిసార్లు పిలిచినా లేవలేదు. దానికి తోడు తెలివితక్కువదాన్ని నేనుకూడా ఆయన్ని ఒకమా టన్నాను. 'కొమ్మైనప్పుడు వంగకపోతే మానైతే వంగుతుందా? చిన్ననాడు వాడిని అదుపాజ్ఞల్లో పెట్టకపోయి ఇప్పుడు దిగులుపడితే ఏం ప్రయోజనం? లేవండి' అన్నాను. ఆమారాజు కేం కష్టం కలిగిందో మరి. ఎప్పుడూ లేదు - భోజనం చేసి కాడుక్కోసం చావట్లో అల్లాగే కునుకుతూ కూచున్నారు. కొడుకు రాత్రి తొమ్మిది పదిగంటలకు తూలుతూ వచ్చి తిన్నగా తన గదిలో కెడుతుంటే తండ్రి చెయ్యిపట్టుకున్నారు. వాడు విదలించుకుని లోపలికి పోయాడు. లోపలినుంచే భోజనం అక్కరలేదని ఒక్క కేక పెట్టేడు నాకు. తండ్రి కూడా గదిలో కెళ్లేరు. నేనుకూడా వెళ్లబోతే తండ్రి రావద్దన్నారు. కడుపుతీపి ఏడిపించినా ఆడదాన్ని నా కెందుకన్నట్లు వెనక్కొచ్చాను. తండ్రి వాడిని మందలించారు. లాలించారు. కొడుకుకూడా కొంచెం మర్యాద హీనంగా మాట్లాడినట్లు అక్కడక్కడ వినిపించిన ముక్కలవల్ల నాకు తెలిసింది. అప్పటికి రెండు రోజులక్రిందటనే రామన్నపేట నుంచి వాడికి ఇరవైయకరాలు కట్నమిచ్చి పిల్లనిస్తామని వచ్చారు. మారాజు ఏమీ మాట చెప్పలేదు. 'పెళ్లిఅయితే కుదుటపడుతాడు చెయ్యకూడదా' అని నేనొక ఆడమాట అన్నాను. 'దాని గొంతుకకూడా కొయ్యాలా?' అన్నారు. మళ్లీ ఆరాత్రి వాడితో పెళ్లిసంగతేదో చెప్పిన ట్లున్నారు. 'నాకొద్దు. పెళ్లీ వద్దు పెటాకులూ వద్దు' అనే మాటొక్కటే నాకు వినిపించింది. నేనెరిగింది అంతే. అర్ధరాత్రి ఆయనగారు లేచి కొడుకుగదిలో కెళ్లి, కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ వచ్చి నన్ను లేపి 'అంతా అయిపోయింది. అబ్బాయి చచ్చిపోయాడు' అన్నారు. నేను గొల్లుమంటూ లేచి గదిలోకి వెళ్లేసరికి మొగం నల్లబడిపోయి పడున్నాడు కొడుకు. తర్వాత చెప్పడాని కేముంది? నలుగురూ వచ్చారు.

ఏడుపులు, పెడబొబ్బలు: నాయనా, కలికాలం. తండ్రిఆపత్తు గడపవలసిన కొడుకుని తండ్రే చేతుల్తో కొరివెట్టవలసి వచ్చింది. లేకలేక కలిగిన మాసంతానం మూడునాళ్ల ముచ్చటైపోయింది."

అని ఒక్కసారిగా లచ్చమ్మ బావురుమంది. ఇనస్పెక్టరు హృదయంకూడా కరిగిపోయింది. అతనికి దిక్కు తోచలేదు.

*  *  *

గణపతిరావునాయడు కథంతా మననం చేసుకున్నాడు. ఊళ్లో పర్యాప్తువల్ల తెలుసుకున్నదానికి లచ్చమ్మకథ కలుస్తోంది. కాని రాయన్న స్టేటుమెంటుకు ఏమీ అందడం లేదు. ఆత్మహత్య అనే సంశయం కలుగకపోలేదుకాని రాయన్న అఘాయిన్ని తనమీద ఎందుకు వేసుకుంటాడు ? కడుపుతీపే కాని ప్రాణంతీపుమాత్రం తక్కువదా? కాని శాంతుడైనవాడు రేగితే ధర్మరాజుకోపంలాంటిదేకదా. అందులోనూ పరువు ప్రతిష్ఠలతో బ్రతికేవాడికి కడుపుతీపికన్నాకూడా ఆత్మగౌరవం ఎక్కువై, కొడుకు చేసిన ఏదుర్మార్గానికో కుపితుడై తాత్కాలికోద్రేకంచేత ఏ కొట్టరానిచోటనో కొట్టిఉంటే చచ్చిపోవచ్చును అని కథ కలుపుకున్నాడు. ఇందులో వెనుకముం దాలోచనలకీ, దయాదాక్షిణ్యాలకీ పరిపూర్ణమైన ఆస్కారమున్నా 'లా' దృష్టిలో వీటికి చోటు లేదు. మతాచారాల్లో అశానికీ, శుభానికీకూడా ఎంతో తతంగం విధిగా నడవవలసినట్లే 'లా' కూడా దానిపంథా నది అవిచ్ఛిన్నంగా నడవవలసిందే. అప్రయత్నంగా రాయన్న నిర్దోషి యనీ, అతన్ని తప్పించా లనీ నాయడు కేదో అభిప్రాయం స్ఫురించేది కాని పోలీసు ఉద్యోగం, డ్యూటీ,లా, పీనల్‌కోడ్ ఇవన్నీ జ్ఞాపకం వచ్చేసరికి మామూలు ఉద్యోగస్థు డయ్యేవాడు. రాయన్న వ్యవహారం చూస్తే ఎంత ప్రయత్నించినా కొరుకుపడేటట్టు లేదు. లాకప్‌లో ఏదో దీర్ఘాలోచనాతత్పరుడై ఉండడం, ఎన్ని ప్రశ్నలకైనా ఒక్కటే జవాబు చెప్పడం జరుగుతోంది.

"ఎందుకండీ ఈ తర్జన భర్జన? నాకడుపును కోసుకున్న కఠినుడ్ని.... ఎవరికోసం నే బ్రతకాలి ? లాప్రకారం శిక్షించి నా బాధ తప్పించండి. మీ కెల్లా కావలిస్తే అలా బందోబస్తు చేసుకోండి" అనేవాడు. పైగా ఊరివాళ్లు, బంధువులు ఎందరో చూడడాని కొస్తే ఎవ్వళ్లనీ తనదగ్గరకి తీసుకురావద్దన్నాడు. ఈ మనిషితో ఏంచెయ్యడం ? కేసు తంతు నడువవలసిందే. దొరికినంత కథను గుదిగుచ్చి, పై ఉద్యోగస్థులతో సంప్రదించి కూనీకేసు బనాయించాడు నాయడు.

*  *  *  *

కూనీకేసు తతంగం అంతా నడిచింది. మొదట మేజస్ట్రీటు ఎదుట ఆయనస్టేటుమెంటు రికార్డు చేయడం, మేజస్ట్రీటు కోర్టులో కొంత తంతు నడవడం, మేజస్ట్రీటు సెషన్సుకు పంపడం జరిగింది. కేసులో ఎన్ని లోపాలుంటే మాత్రం ఏమిటి ? ముద్దాయి నేరాన్ని ఒప్పుకుంటున్నప్పుడు కేసులో కష్టమేముంది? రాయన్నను సెంట్రలు జైలులోకి తీసుకుపోయారు.

*  *  *  *

సెషన్సుజడ్జీ గిరిరావుపంతులుకు పింఛను పుచ్చుకొనే కాలమయ్యేసరికి జిల్లాజడ్జీపనైంది. జిల్లామునసబు ఉద్యోగంలో ప్రవేశించి క్రమంగా ఈ ఉద్యోగాని కొచ్చాడు. మనిషి చాలా శాంతస్వభావుడూ, పాపభీతి కలవాడూ అవడంచేత ఉద్యోగంలో ప్రమోషనుకూడా నిదానంగానే వచ్చిందని ప్రతీతి. ముద్దాయిని శిక్షిస్తుంటే ఆ శిక్ష తా ననుభవిస్తున్నట్లు తహతహలాడేవాడు. అట్టే కాలం ఉండడు కనుక హైకోర్టు ఊరుకుంది కాని, లేకపోతే ఎన్నిదెబ్బలు తినవలసినవాడో. ఆయనఎదట రాయన్నవిచారణ. పబ్లిక్ ప్రాసెక్యూటరు రావుసాహెబు వెంకయ్యనాయడు అధికారుల దయవల్ల తొమ్మిది సంవత్సరాలుగా ఆపని చేస్తున్నాడు. మళ్లీ మూడు సంవత్సరాలు ఉద్యోగం పొడిగించుకోడానికి ఆత్రపడుతున్నాడు. కేవలం అలవాటువల్ల పోలీసుకేసులో తిరుగు డుండదనీ, చిన్నచిన్న లోపా లున్నా వాటిని సర్దుకోవలసిన పూచీ ప్రాసెక్యూటరు దనే నమ్మకంతో వాదించేవాడు. పోలీసు కేసులో ముద్దాయికి శిక్ష పడినప్పుడల్లా తన దివాణ్‌బహదూరు ఆదర్శానికి ఒక మెట్టు సాధించినట్లుగా నమ్మేవాడు. లాయొక్క నిరంకుశత్వంలో అలాంటి విశ్వాసాన్ని ఆయన కుదుర్చుకున్నాడు. ఇనస్పెక్టరు గణపతిరావునాయడు సామాన్యంగా కూనీకేసుల్లో పోలీసు అధికారులు చూపించే ఉత్సాహాన్ని చూపకుండా ఏదో పోలీసు యంత్రంలో ఒక్క కీలుగా మాత్రమే పనిచేస్తుండడం రావుసాహేబుకు అత్యంత ఆశ్చర్యం కలిగించింది.

ప్రాసెక్యూషన్ సాక్ష్య మైపోయింది. ముఖ్య సాక్షి గణపతిరావు నాయుడే. రాయన్న అంగీకారానికి అనుగుణ్యంగానే ఉంది అతని సాక్ష్యం. ముద్దాయి వకీలును ఏర్పాటు చేసుకోవడానికి నిరాకరించాడు. అతడు తప్పించుకోదలచు

కుంటేగా! జడ్జీ పట్టుదలమీద గవర్నమెంటు ఖర్చుతో ముద్దాయి తరఫున వకీలు ఏర్పాటైనాడు. అతడుమాత్రం ఏం చేస్తాడు? ప్రాసెక్యూషనులో లోపాలు చూపించగలడు గాని రాయన్నకు పాఠం చెప్పగలడా? సాక్షి విచారణ ముగిసిన తర్వాత జడ్జీ ముద్దాయిని:

"ఏం చెప్తావు? నేరం చేశావా?"

"నేరస్థుడనే."

"మేజస్ట్రీటు ఎదుట ఇచ్చిన స్టేటుమెంటు ఐచ్ఛికంగానే ఇచ్చావా?"

"ఆ."

"అందులో సంగతు లన్నీ నిజమేనా?"

"మార్చడాని కేమీ లేదు."

"హత్యకి కారణం ఏమిటి?"

"అయిపోయినతర్వాత ఆ విచార మెందుకండీ?"

రాయన్న ముఖంలో దీనత్వ ముంది గాని, అధైర్యం ఎక్కడా కనబడడం లేదు. మానవప్రకృతిని గురించిన తత్త్వవిమర్శనను ఎంతో అప్పుడప్పుడు గిరిరావుపంతులు చదువుతూ వచ్చాడు కాని ఈముద్దాయి వైఖరీ తనకు అవగాహన కాలేదు, అయితే ఇతడు అపూర్వమైన ధర్మమూర్తి కావాలి; లేకపోతే తడిగుడ్డలతో గొంతుకోసి పచ్చినెత్తురును త్రాగే కటికివాడైనా కావాలి. సాక్ష్యంలోని విషయాలు, ముఖంలోని దీనత్వం, ధైర్యలక్షణాలు సమన్వయిస్తే రెండవ తరహాగా ఆలోచించడానికి ఆస్కారం కనుపించలేదు జడ్జీగారికి.

ప్రాసెక్యూటరు నేరారోపణ చేస్తూ వాదించాడు. ముద్దాయి అంగీకారం, హఠాత్తుగా చచ్చిపోయినవాడి శవాన్ని పరీక్షకు పంపకుండా తన పలుకుబడి నుపయోగించి దహనం చేసెయ్యడం, ముద్దాయిభార్య లచ్చమ్మ స్టేటుమెంటులోని తండ్రికొడుకుల తగాదా అన్నీ ముద్దాయిదోషానికి నిర్ధారణలుగా చూపించాడు. హత్యకు కారణం ఏదో ప్రబలమైనది ఉండితీరుతుం దనీ, ఏస్త్రీయైనాకూడా కారణం కావచ్చు ననీ, రాయన్నపలుకుబడివల్ల ఆలాంటిసాక్ష్యం రావడం అసంభవమనీ వాదించాడు. ఆయన వాదిస్తుంటే రాయన్న ముఖం చిట్లించుకుని కటకటపడ్డాడు. ఒళ్లంతా చీమలు, జెర్రెలు పాకినట్లు చిరాకు పడ్డాడు. శరీరాన్ని సూదుల్తో గుచ్చినట్లు బాధపడ్డాడు. ఈతతంగం ఎప్పుడైపోతుందా అని తహతహలాడేడు. ఆ తహతహ రావుసాహెబు కేం తెలుస్తుంది? ఎద్దుపుండు కాకికి నొప్పా? రాలిపోయినది ముసలిపండైనా, భ్రద్దలైనది పచ్చికాయైనా అపరకర్మ చేయించే పురోహితుడికి మంత్రతంత్రాలు ఒక్కటే. తంత్రప్రకారం గోదాన భూదానసాలిగ్రామదానాలు అడుగుతూనే ఉంటాడు. లా తంత్రంకూడ అలాంటిదే. అది యథావిధిగా సాంగోపాంగంగా నడవవలసిందే. ముద్దాయి పలుకుబడివల్ల కలిగిన లోపాలని నాస్కారం చేసుకుని అతన్ని విడుదల చేస్తే పరగణాలో నేరం హద్దులుమీరిపోతుందనికూడా వాదించాడు రావుసాహెబు.

గవర్నమెంటు ఏర్పాటుచేసిన ముద్దాయివకీలు యథావిధిగా తన ధర్మాన్ని నిర్వర్తించాడు. ముద్దాయి నేరాన్ని అంగీకరించినంతమాత్రాన్ని శిక్షార్హుడు కాడనీ, పుత్రశోకం వల్ల మతి భ్రమించి తత్కాలమైన ఆవేశంవల్ల చచ్చిపోయే ఉద్దేశ్యంతో ఆలా అంగీకరించి ఉండవచ్చుననీ వాదించాడు. ఇంతకూ ఇలాంటి నేరానికి కారణం ప్రధానమైనదని హైకోర్టుతీర్పులన్నీ చూపించి, ఆలాంటి ప్రబలకారణం ఏమీ ప్రాసెక్యూషన్ ఋజువుచేయలేదుకనుక అందుచేత సంశయానికి తావుందనీ, బ్రిటిష్‌చట్టప్రకారం సంశయముంటే ముద్దాయి కనుకూలంగా తీర్పుఇవ్వాలనీ చక్కగా వాదించాడు. రాయన్న మహనీయమైన ఒక ఆవేశంలోనో, ఒక్క ధర్మవివేచనలోనో పడి ఈ నేరాన్ని తన నెత్తిపై వేసుకుంటున్నాడనీ, ఈలాంటి బాధ్యత వహించడం అగాథమైనట్టిన్నీ, భవిష్యత్తులోమాత్రమే గోచరమైయేట్టిన్నీ ఒక్క మహత్తరమైన నైతికకారణం ఉంటుందనీ, మామూలు కేసులా దీనిని విచారించకూడదనీ, ఆలా చూచేయెడల భగవంతుని ధర్మానికి అపచారం కలుగుతుందనీ, ఈబాధ్యత న్యాయమూర్తిదే అనీ వాదన ముగించాడు.

ఈ యువకుడి కెందుకు తన జీవితంయెడల ఇంత పట్టుదల కలిగిందా అని తెల్లబోయి చూస్తున్నాడు రాయన్న. బాధ్యత తనమీద పెట్టిన ఆఖరువాక్యం విని జడ్జీ నూతన భారంతో క్రుంగినట్లయినాడు. పబ్లిక్‌ప్రాసెక్యూటరు ముద్దాయి వకీలువాదనను హేళనచేస్తూ జవాబుచెప్పేడు. తీర్పుకు కేసు వాయిదావేశారు.

* * *

విచారణ జరుగుతున్నంతసేపూ జడ్జీదృష్టి ముద్దాయి ముఖంమీదనే ఉంది. పిసరంతైనా మృత్యుభీతి ఆ ముఖం మీద కనబడడం లేదు. నిండుకుండలా తొణుకూ బెణుకూ లేకుండాఉన్నాడు, ఆకుండలో నిండిఉన్నది నిజమైన శాంతో లేక,దుఃఖమో పరమేశ్వరుడి కెరుక. విచారణ ముగిసి

నప్పటినుండి ఆయనకు ఆందోళన హెచ్చింది. ఇక ఆ మనిషిప్రాణం తన చేతులో ఉంది. ప్రాసెక్యూషన్ వాదంలో లోపాలున్నా ముద్దాయిఅంగీకారం బలంగా ఉంది. డిఫెన్సు వకీలు చెప్పిన మహత్తరమైన నైతికకారణం ఉండడానికి సావకాశా లున్నాయి. కేవలం ముద్దాయిమాట నమ్మి శిక్షిస్తే ఒక్కప్రాణం తన చేతిమీదుగా పోతుంది. జైలులో అతని ప్రవర్తన ఎలా ఉందో తెలుసుకోవడానికి జైలుఅధికారుల నడిగేడు. రాయన్న ఎప్పుడూ ఏదో ధ్యానంలో ఉంటాడని, మామూలుకూనీఖైదీలులాగా తన కేసుసంగతి అందరిలో చెప్పుకోడని, ఎవరికీ ఏవిధమైన శ్రమా ఇవ్వడనీ జైలధికారులు చెప్పేరు. ఈలాంటి అగాధమైన మనిషియొక్క ఆంతర్యం తనకు ఎల్లా తెలుస్తుంది? కేవలం నిర్జీవమైన పుస్తకపు లా నాధారంచేసుకుని శిక్ష విధించాలనొస్తే తన చేతిమీదుగా ప్రాణం తీయాలనొస్తుందే. ఈ విచక్షణ చెయ్యకపోతే తాను చేసే న్యాయమేమిటి? ఈ విషయంలో తన కెవరు సాహాయ్యం చేస్తారు? ఇలా పరిపరివిధాలుగా జడ్జీ ఆందోళనపడ్డాడు.

జడ్జిమెంటురోజు వచ్చింది. ముద్దాయిని తన ప్రైవేటు గదిలోనికి రప్పించాడు. ఒంటరిగా ముద్దాయి ఎదుట నిలబడ్డాడు. జడ్జీ కూచోమని కుర్చీ చూపించాడు. రాయన్న చేతులుజోడించి కూచోడానికి నిరాకరించాడు. ఆ మర్యాదకు రాయన్న ముగ్ధుడైనాడు.

జడ్జీ—రాయన్నా, చాలా కేసులు విచారించాను. చాలా మంది నేరస్థుల్ని చూచాను. కాని నీలాంటి నేరస్థుడిని కాని, ఈలాంటి నేరాన్ని కాని చూడలేదు.

ముద్దాయి—చిత్తం.

"నువ్వు నిజంగా ఈనేరం చేశావా?"

"నేరస్థుడినేనండి"

"అది కాదోయ్! నువ్వు నీచేతుల్తో నీకొడుకును చంపేవా అంటాను."

"అపరాధం నాదే ప్రభూ"

"మాటకి మాట సూటిగా చెప్పవోయ్!"

"చెప్పడాని కేముందయ్యా! నేనే నేరస్థుడిని"

ఈమాటల్లో ఏదో మడత గోచరిస్తూనేఉంది జడ్జీకి. చివరకి కొంచెం నిస్పృహతో—

"ఏమోయి రాయన్నా! ఈప్రశ్నలన్నీ నేను నా ఉద్యోగంహోదాతో వెయ్యడం లేదు. అలా వేస్తే కోర్టులోనే అడుగుదును. నీ ప్రవర్తనలో నా కేదో చిత్రం కనుపించే ఒక పెద్దమనిషి అడిగిన ట్లడుగుతున్నాను. అంతే కాదు. నీవిషయమైన సత్యం తెలుసుకోకపోతే అపరాధిని నే నవుతాను"

జడ్జీమాటల్లో సౌజన్యత, అభ్యర్థిత్వం రాయన్నను కరగించినాయి. బందోబస్తుగా కట్టివేయబడిన దుఃఖానికి కట్లు తెగిపోయినాయి. పాతాళజలకు గడ్డపార తగిలితే నీరుబికినట్లు దుఃఖం ఉబికివచ్చింది. కన్నీరు ధారగట్టింది. రాయన్న తల వంచినాడు. గద్గదస్వరంతో "ప్రభూ! ఈదీను డింత గౌరవానికి, ఇంతటి ఆలనకు అర్హుడుకాడు"

"రాయన్నా! ఆప్రసక్తి వదిలెయ్యి. నీగాథ ఉన్న దున్నట్లు చెప్పు. న న్నన్యాయపంథాలోనికి పోనీయకు. ఆ పాపం నా కొడిగట్టకు"

ఆమాటలు రాయన్నహృదయానికి తగిలేయి. ఏనాటి క్రిందనో వదలిపెట్టిన ఆప్తమిత్రుడు తిరిగివచ్చిన తృప్తి తోచింది. ఇక తన గుట్టు దాచలేకపోయినాడు.

"ప్రభూ! ఈ నిర్భాగ్యుని కథ నిశ్శేషంగా వినండి. ఇంతటి ఆప్యాయతతోనూ, ధర్మచింతతోనూ తా మడిగి నప్పుడు చెప్పకపోతే ధర్మం నన్ను హర్షించదు. ఇదివరకు చేసిన నేరంకంటే ఎక్కువవుతుంది"

జడ్జీ మాటాడకుండా వింటున్నాడు....

"తమరు చిత్తగిస్తే మా పరగణాలో నేను పెద్ద సంసారుల్లో లెక్కండి. మీదయవల్ల పెద్ద లిచ్చినదే నూరెకరాలు కొండ్రా, దానితోపాటు తోటా దొడ్డీ సమస్తం లోటు లేకుండా ఉన్నాయి. కుటుంబం చాలా సాంప్రదాయమైన కుటుంబమండి, నేనూ పెద్ద లప్పచెప్పిన వసతిని వృద్ధిచేస్తూ కుటుంబసాంప్రదాయాన్ని కాపాడుతూవచ్చానండి, నిజానికి ఆప్రాంతంలో మంచొచ్చినా చెడ్డొచ్చినా నాచేతిమీదుగా నడుస్తోందండి"

"అవునవును, విన్నా అదంతా. అందుకే నాకు మరీ చిక్కు వచ్చింది"

"చిత్తం, వాస్తవానికి నాకు నా స్వంతవ్యవహారాలు దిద్దుకొనేందుకే తీరుబడుండేది కాదండి, పల్లీకువ్యవహారాల తోటే రోజంతా సరిపోయేది. ఇంతెందుకు స్వామీ! నామాటే మాటగా చెల్లిపోయింది ఇన్నినాళ్లన్నూ. కాని ఇంట్లోమాత్రం ఒక్కలోటుండేదండి, చాలాకాలంవరకూ సంతానం కలుగలే

దండి. భార్య కాపురానికొచ్చిన రెండుమూడు సంవత్సరాల నుంచీ ఆలోటు కనుపించడం ప్రారంభమైంది. ఈలోపాన్ని గురించిన బాధ మొట్టమొదట మామునలమ్మతో ప్రారంభమై క్రమంగా నాభార్యకు పాకింది. లోకవ్యవహారాల్లో నిమగ్నుడనైన నేను కొంత మొండికెత్తినా అప్రయత్నంగా నాకు ఇదొక లోపంగానే కనుపడి మనస్సుకు బాధ కలిగిస్తూ ఉండేది. సహజంగా ఇంటి వ్యవహారాల్లో ముక్తసరిగా ఉండే అలవాటువల్ల ఈబాధను మ్రింగేసేవాడిని. మా ముసలమ్మమాట అలా ఉండగా ఈవాంఛ నాకూ నాభార్యకూ కూడా ఆవేదనగా పరిణమించింది. కాని ఆవిషయమైన ప్రస్తావన చేయడానికిగాని, ఒకరిబాధ ఒకరితో చెప్పుకోవడానికిగాని మేము సాహసించలేదు. క్రమంగా మాజీవితంలో మాంద్యం ఏర్పడిందిగాని జీవితంమాత్రం యంత్రవతుగా నడచిపోయింది. నాభార్య అనేకనోములు నోచింది. మందులూ మాకులూ సేవించింది, నేను ఆ ఆవేదన మనస్సును బాధించకుండా ఉండాలని లోకవ్యవహారాల్లోనూ, ఏవో ధర్మకార్యాల్లోనూ నిమగ్నుడనయ్యేవాడిని. ఇలాంటి స్థితిలో నాకు నలభై సంవత్సరాల వయస్సు వచ్చేటప్పటికి మాఅదృష్టం పండిం దనుకున్న రోజులు వచ్చాయి. నాభార్య గర్భిణి అవడం, నాకు భార్యయెడల కొత్త మమకారం కలగడం తటస్థించింది. ఈశ్వరుని కృపవల్ల నాకు కుమారుడు పుట్టేడు. బ్రహ్మాండమైన సంతోషంతో ఉత్సవం చేసుకుని, మాతండ్రి రామయ్యపేరు పెట్టుకుని జన్మ సార్థకమైన దని సంతోషించాము. అతిఅపరూపంగా పెంచాము....కుర్రవానికి పది సంవత్సరా లొచ్చాయి. చదువు కప్పచెప్పేను. అందులో ఏమీ చురుకు కనుపడలేదు. చదువు కేమి, బుద్ధి ప్రధానం కదా, అది తిన్నగా ఉంటే అంతే చాలనుకుని సరిపెట్టుకున్నా. కాని రోజురోజూ అదీ అనుమానంలో పడింది, అసలే నాది ముక్తసరిస్వభావం, అందులోనూ లేకలేక కలిగిన ఆ నలుసును గట్టిగా మందలించలేకపోయాను.

కుర్రవాడికి పద్దెనిమిదిఏళ్లు వచ్చాయి. చదువు అట్టే అబ్బలేదని లోపల నాకు బాధ ఉండేదికాని ఎవరి కర్మ వాళ్ళది, చదువుకోడానికి నేను అవకాశాలు ఇచ్చానుకదా, అంతకంటె నేనేం చెయ్యను అని సంతృప్తిపరుచుకునే వాడిని, మానాయ నెంత చదువుకున్నాడు? నే నెంత చదువుకున్నాను? బుద్ధి ప్రధానం అనుకున్నాను. కాని నా ఆశలన్నీ విఫలమైనాయి. నీతుంటే చాలనుకున్న ఆశకూడా విఫలమైపోయింది" రాయన్నకు నిష్ప్రహతో కూడిన వైరాగ్యదుఃఖం పొంగి మాటాడలేకపోయాడు. కాస్సేపటికి సంబాళించుకున్నాడు.

"నాకొడుకు రొంబెం త్రాగుతున్నాడనీ, పోకిరీస్నేహాలు పట్టి జూదం జులాయితనంలోకి దిగేడనీ కర్ణాకర్ణిగా వింటూవచ్చాను. కాని ఎవ్వరూ నాతోమాత్రం చెప్పేవారు

తర్వాత ఒకటిరెండుసార్లు 'అబ్బాయి చెడ్డస్నేహాలు చేస్తున్నాడుట. మందలించ'మని చెప్పుతూవచ్చింది. 'మన బంగారం మంచిదైతే సరి' అని నిర్లక్ష్యం చేశాను. అప్పుడప్పుడు చూచాయగా మందలించేవాడిని. కొన్నిసార్లు ప్రత్యక్షంగాకూడా చెప్పిచూచాను. అంతకంటె చొరవచెయ్యడం నాస్వభావం కాదు, చెయ్యలేకపోయాను, అంతే. తుదకు వాడిదుర్మార్గం బహిరంగంగా చెప్పుకోవడందాకా వచ్చింది. నాపరువుకుకూడా తాకిడీ తగిలింది. లోకవ్యవహారాలు గురించి మాట్లాడుతూ కొందరు 'ఊరందరికీ పంచాంగాలు చెప్పొచ్చు. తనదాకా వస్తే తెలుస్తుంది' అని వ్యంగ్యంగా దెబ్బలు కొట్టడం ప్రారంభించారు. మరికొందరు ప్రత్యక్షంగానే 'లోకాని కంతా చెప్తావు నీతులు. నీకొడుకుని సర్దుకోవేం' అని చెప్పుతూవచ్చారు. అలాంటి రోజున కొడుకుమీద చిరాకుపడడం తప్ప ఏమీ చెయ్యలేకపోయినాను. చేపేపడునుకూడా తప్పిపోయిందేమో. అప్పటికప్పుడే నాపరువు కొన్ని అంతరాలు పడిపోయింది. కొద్దిరోజుల క్రిందట కొందరు పెద్దమనుష్యులు నాయింటి కొచ్చి నేను నా పలుకుబడిని దుర్వినియోగం చేస్తున్నాననీ, కొడుకును అచ్చోసి ఊరిమీదకు వదిలిపెట్టేననీ, వాడిప్రవర్తనకి బాధ్యత నాదే అనీ ఘట్టిగా చెప్పేరు. అప్పటికప్పుడే వాని ఆతతాయితనం హద్దుమీరింది. నాకు శరీరం నీరైపోయింది. మాటాడలేకపోయాను. మౌనంతో నా అపరాధాన్ని అంగీకరించాను. నా ప్రారబ్ధాన్ని నిందించుకున్నాను, కొడుకుకోసం ఉబలాటపడినంత కాలంలో వెయ్యోవంతుకాలం పట్టలేదు ద్వేషం కలగడానికి. కొడుకును గట్టిగా మందలించాను. కాని వ్యవహారం ముదిరిపోయింది. కట్టు తప్పింది, నన్నే ధిక్కరించాడు.... ఇక నెందుకు?....ఆఖరురోజుకథ చెప్తాను. సాయంకాలం ఇంటికొచ్చేసరికి పడమటవీధి పెద్దమనిషి అతి ఆవేశంతో వచ్చి నన్ను అనరాని మాట లన్నాడు. అనడానికి సబబుంది, పడడానికి నేను అన్నివిధాలా అర్హుడనైనాను. ఆయన ఆడుబిడ్డను నానిర్భాగ్యుడు అగౌరవం చేశాడు. వాళ్లు నలుగురూ మెత్తగా, సున్నంలోకి ఎముక లేకుండా వాడిని తన్నేరు. అంతటితో ఆగక వాడిమీద కేసు బనాయించి నాతో చెప్పడాని

కొచ్చారు, మరునాడు పోలీసులు వాడిని అరెస్టుచేయడమే తరువాయి. నాయోగ్యత, నాకుటుంబసాంప్రదాయం అకాడి కొచ్చాయి. వాళ్ల తీవ్రంగా నన్ను తిడుతుంటే సిగ్గుచేత నేను భరిస్తే అదికూడా వాళ్ల అపార్థమే చేసుకున్నారు. నామెత్త రనమే ఊరి కుపద్రవ మని ఎత్తిపొడిచారు. నాశరీరమంతా పోట్లు పొడిచినట్లయింది. హృదయం కుమిలిపోయింది. వాళ్లను సమాధానపరచి చావడిలో కుర్చీలో పడ్డాను. పొంగి వస్తున్న దుఃఖాన్ని, ఆవేశాన్ని ఆపుకున్నాను. నాభార్య భోజ నానికి పిలువడాని కొచ్చి, నావాలకం గ్రహించింది. జరుగ నున్న సంగతి చెప్పేసరికి 'అదుపులో అదలించకపోతే ఏమవుతుంది? అనుభవించాలి' అంది. ఆమెకూడా అబాధ్యత నానెత్తినే వేసింది. ఆరాత్రి నాకొడుకు ఇంటికొచ్చేదాకా వాకట్లోనే కనిపెట్టుకున్నాను. రాత్రి తొమ్మిదిపదిగంటల మధ్య తూలుతూవచ్చాడు. కళ్లు జ్యోతుల్లా ఉన్నాయి. నాకేసి చూడకుండానే గభాలున తన గదిలోకి ఒక్కచెంగున దూకేడు. ఒక్కక్షణం నిదానించి లోపలి కెళ్లేను.

"ఏమబ్బాయి! ఏంపనిది!" అన్నాను.

"ఏం?"

"నీకుటుంబ సాంప్రదాయమేమిటి ? నీ అంతస్తేమిటి? నువ్వు చేస్తున్న పనేమిటి ?"

"నేను చేస్తున్న పనేనా? ఇప్పుడు చెప్పడాని కొచ్చావా? నువ్వు చేసిన పనేమిటి?"

"కళ్లల్లా ఉన్నాయే?"

"త్రాగుడు........"

ధోరణి ముదిరిపోయింది. ఇదివర కెన్నడూ ఇల్లాంటి బహిరంగధిక్కారం లేదు. ఇక ఆలాంటి ప్రశ్న వేస్తే మాట దక్కేటట్లు లేదు,

"సాయంత్ర మేదో అల్లరి జరిగిందిటగా!"

"అవును. మామూలు అల్లరే. కొత్తేమిటి?"

"నిన్ను అరెస్టుకూడా చేస్తారటగా?"

"నన్నెవ్వరూ అరెస్టుచేయలేరు."

"ఏం?"

"ఎవరికీ అందనుగా? మానవమాత్రుడి తరం కాదు

"అబ్బాయీ....ఏమిటి నీకీకర్మం?

'ఇప్పు డిక మాట్లాడకు....ఇప్పుడు చెప్పి లాభం లేదు. అసలు నువ్వే కారణం నాస్థితికి"

"నేనా? ఏం?"

"ముమ్మాటికీ నువ్వే. నువ్వే."

వాడి కంఠంలోంచి ఆమాటలు పిడుగుల్లా పడ్డాయి.

"నే నేమి చేశాను? నీ కేమి తక్కువైంది....ఇంత కూ నీకర్మ ఇలా ఉంది...."

"నాకర్మా....అవును. నీకర్మకూడా ఇల్లాగే ఉంది.... నా కేమీ లోటు లేదు.... నీ అలక్ష్యమే న న్నింత చేసింది.

నాహృదయం కలుక్కుమంది. అట్లే హృదయం చిక్కబట్టుకుని "నాయనా! నీమంచితనానికి నే నడ్డొచ్చానా?" అని అడిగేను.

అడ్డుకూడా రావాలీ ? నాకు తండ్రిసహాయం కావలసిన రోజుల్లో నీకు తీరిక లేదు. ఊరివ్యవహారా లన్నీ చక్కదిద్దగలిగేవు గాని నా బ్రతుకు దిద్దలేకపోయినావు. నా కర్మకు నన్ను ఇదివరకు వదిలిపెట్టనే వదలిపెట్టేవు, ఇక ముందూ వదలిపెట్టు" అని బావురు మని యేడ్చి తల అటు తిప్పుకున్నాడు. ఆ స్థితిలో మాట్లాడి ప్రయోజనం లేదని నేను పొంగుతూన్న దుఃఖాన్ని సంబాళించుకోలేక బయటి కొచ్చాను. 'నువ్వే బాధ్యుడవు, నాకర్మానికి నన్నొదిలిపెట్టు' అనే మాటలు నా చెవుల్లో గింగురుమం టున్నాయి. అప్పుడే కాదు ఇప్పటికీని. ఒక్కరూ మయినాక కొంచెం మూలుగు వినిపించింది. ఏమో నని లోపలి కెళ్లి చూచేసరికి గుండె గుభేలు మంది. కుర్రవాడు మరణావస్థలో నున్నాడు. మంచం మీద ఏదో సీసా ఉంది. అరవబోతే నోరు రాలేదు. నోరు తడబడుతూ, 'నాన్నా, నన్ను శాంతంగా చచ్చిపోనియ్యి, ఇదే నువ్వు చేసే ఉపకారం. నలుగురినీ పిలిచి నాబ్రతుకు కల్లరి చెయ్యకు. ఒక్కక్షణం ....నాకర్మ....నీ కర్మ....కుటుంబాని కింక కళంకం లేదు.' అంటూనే ఒక్కక్షణంలో నా చేతుల్లోనే ప్రాణం విడిచాడు. ఇక దాచడాని కేముంది? గొల్లుమని తల్లిని పిలిచాను. ఆమే గొల్లుమని కూలింది కొడుకుమీద. తర్వాత ఏముంది ? ఏడ్పులు, పెడ బొబ్బలు ! వాడి కోరిక ప్రకారం బ్రతు కల్లరి చేయకుండా నలుగురినీ పిలిచి ప్రొద్దున్నే ఈ చేత్తోటే దుమ్ముచే సొచ్చాను." అని బావురు మని ఏడ్చాడు. మాట తొణకలేదు.

అప్రయత్నంగా జడ్జీగారి కంటి కొలకుల్లో నీటిబిందు వులు క్రమంగా చేరుకుని చెక్కిళ్ల మీదికి ప్రవహించాయి ఒక్క క్షణమాగి.

"రాయన్నా! అయితే నువ్వెందు కిలా వచ్చావు? ఈ కేసేమిటి?"

"అయ్యా, చేయవలసిన తంతంతా జరిపించాక ఇల్లు వల్లకాడుగా కనుపించింది. అనుక్షణం 'నువ్వే బాధ్యుడవు! ఊరంతా చక్కపెట్టేవు. కొడుకు బ్రతుకు దిద్దుకోలేక పోయావు.' అనే మాటలు హృదయానికి శూలాల్లా గ్రుచ్చుకొన్నాయి. అప్పటే ఆలోచిస్తే అందులో సత్య మున్నట్లు తోచింది. చిన్నప్పుడు గారాబంచేత, మధ్యకాలంలో తీరిక లేక, కొంచెం ముదురుపట్టాక అహంకారంతోకూడిన ప్రతిష్ఠ చేత వాడి బ్రతుకును గురించి పుచ్చుకోవలసిన జాగ్రత్త పుచ్చుకోలేదు. చేతులారా కొడుకుని చంపుకున్నాను; ప్రపంచం అంధకారమైంది. బ్రతుకుమీద సుతలాం ఇష్టం లేదు. నూతిలోనో, గోతిలోనో పడి ప్రాణం పోగొట్టుకోవ డానికి అహంకారం, ప్రతిష్ఠ అడ్డమొచ్చాయి. తరువాతి గాథ నే చెప్పనక్కరలేదు. నాకు బ్రతుకు ఒక్కక్షణం ఒక్క యుగంలా ఉంది. అపరాధిని.... నన్ను వదలకండి.... నా ఆవేదనను త్వరలో ముగించండి...." అని సాష్టాంగ నమస్కారం చేశాడు రాయన్న జడ్జీగారికి.

* * * *

పదకొండు గంటలకు సమావేశం కావలసిన కోర్టు నాలుగు గంటలకు వాయిదా వేయబడింది. ముద్దాయితో జడ్జీ ప్రైవేటురూములో మాట్లాడే అపూర్వ విషయాన్ని గురించి కోర్టు ఆవరణలో కొంత లావాదేవీలు జరిగాయి. నాలుగు గంటలకు జడ్జీ ముద్దాయిని నిర్దోషిగా నిర్ణయిస్తూ తీర్పుచెప్పేడు. జడ్జిమెంటులో రాయన్నగాథ యావత్తూ ఉదాహరించి తన అపూర్వవర్చస్సు సమర్థించుకున్నాడు. మామూలుగా విడుదలైన కూనీకేసు ముద్దాయిల్లాగ రాయన్న ఎగిరి గంతెయ్యలేదు. నిస్పృహ, ఆశాభంగం అతని ముఖంమీద తాండవించినాయి. గుడ్డివాడు తడుముకుంటూ నడచినట్లు బోనులోనుంచి బయటి కొచ్చాడు. వాకిలి లేనివాడు లాగ శూన్యప్రపంచంలో పడ్డాడు. కోర్టులో రకరకాల సంచలనం కలిగించి. గణపతిరావు నాయుడుమాత్రం బ్రతుకు జీవుడా అని తల విదుముకున్నాడు.

* * * *

రాయన్న ఎక్కడెక్కడ తిరిగి స్వగ్రామం ఎప్పు డెళ్లేడో ఎవరికీ తెలియదు. ఒక రోజు తెల్లవారేసరికి ఇల్లు తాళం వేసిఉంది. లచ్చమ్మకూడా అంతర్ధాన మైపోయింది. తన యావదాస్తికీ ట్రస్టు ఏర్పాటు చేసి, దానికి సర్వాధికారాలతో రిటైరుకానున్న జడ్జీ గిరిరావుపంతులును యజమానిగా చేసి, కొడుకు పేరిట 'శ్రీరామ శరణాలయం' అనేపేరుతో అనాథ బాలబాలికలకు శరణాలయాన్ని స్థాపించవలసినదిగా నిశ్చయించి, అందుకు తగిన కాగితాలను సక్రమంగా సృష్టించి వాటిని గిరిరావు పంతులుకు అప్పచెజేశాడు. అందులో వుత్తరోత్తరాకూడా తన పేరు ఎక్కడా రాకుండా నిషేధించుకున్నాడు.

* * * *

రాయన్న దంపతుల జాడ ఎవరికీ తెలియదు. కాని అత నేర్పాటు చేసిన శరణాలయం విశేషమైన ఆడంబరం లేకుండా ఆ ఊళ్లోనే అవిచ్ఛిన్నంగా సాగుతోంది.

# మరణభిక్ష



= శ్రీ సుందరాచారి =

గుసగుసలాడుకొంచు ననుఁగూరిచి వ్రేలిడి చూపి గేలిగా
ముసిముసినవ్వు నవ్వుకొని, మూలకుమూలకు మూగి, గుట్టుగా
కసి వెలిబెట్టుచున్న పలుగాకులనోళ్లకు నాగలేని యీ
యుసురు లివేమి తీపనుచు నూరటచెందనురా మనోహరా!

చుక్కల సౌరు రూపడరి సోలకమున్నగ; చందమామలో
చిక్కని పాలవెన్నెలల చెల్వము లారకమున్న; మంచెపై
కెక్కిన జంటకోరికలు నీడలప్రాపు తొలంగుమున్న; ఇం
కొక్కదినంబురాని తెరవుండిన చూపుము సంతసించెదన్.

పొదల మొషందలో మరులుపూనిన వేళల కాళసర్పముల్
కదలిన జాడలేదు; తొలికామము పూచిన కొండకోనలో
పదములు జారి దొర్లిపడు భాగ్యమునైనను నోచుకోను; నీ
సదమలప్రేమభావముల సంపదలోగల సారమేమియో!

కనగా, జీవములూడ్చుకోగలుగు నాకాలంబులో శేలలో
మనగా నిచ్చలుపుట్టు, నీవలపులో మాధుర్యముల్ తోచగా
నను నేచంపుకొనంగలేనికను నేనాడైన నీచేతనే
దనియంగావలె నాదు కోరికలు నాథా! దాని నీడేర్పవా? —



హంపీక్షేత్రములోని శ్రీ విరూపాక్షస్వామి ఆలయగోపురము

# రాశికుండలి యునర్థము

= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

కడచిననెల 'భారతి'లో బృహస్పతినిగూర్చి వ్రాసిన నా వ్యాసమును పరిశీలించిన పాఠకమహాశయులలో విద్యాధికులు కొందఱు బృహస్పతి లగ్నమందుండి గ్రహాంతరసమసప్తకవేధ గల జాతకములను కొన్నింటిని విమర్శనార్థ మని దయతో నాకుఁ బంపినారు. జాతకశాస్త్రమందు కనుపరచిన విశ్వాసమునకుమాత్రమేకాక విద్యార్థినగు నాయందు వారు చూపిన యీ యకారణవాత్సల్యమునకుఁగూడ వారి యెడల నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. వారి కివే నా నమోవాకములు.

ఈ సందర్భమున నా మనవి యొక్కటి. ఆ జాతకముల నన్నింటిని విమర్శించుటకు వలసినంత శక్తి, తగినంత యుత్సాహము, చాలినంత యవకాశము నాకు లేకుండుట నా లోపము. ఇంతమాత్రముకాక, వచ్చిన జాతకములలో కావలసినన్ని వివరములు లేవనుట మఱియొక గొప్ప చిక్కు. సర్వసామాన్యముగ నిపుడు వాడుకలో నున్న పద్ధతి ననుసరించి వ్రాయఁబడిన కేవలరాశికుండలు లవి.

వచ్చిన కొకటి యీక్రింద నుదాహరించెదను:- "౧౯౧౨-వ సంవత్సరము జూన్ మాసమున ౨౦-వ తేదీనాఁడు, ఉదయాది ౩౧ ఘడియలు ౮ విఘడియలకు జననము. జన్మకాలశుక్రదశాశేషము ౧౬ సంవత్సరములు, ౨ నెలలు, ౨౬ దినములుమాత్రము" ఇంతే సామగ్రి! ఆకుండలి యీక్రింద నున్నది.

ఇతరవిషయము లట్లుండ, ఇది పురుషజాతకమా, స్త్రీజాతకమా తెలియలేదు. ఆ కుండలినుండియే యీ యంశము తేల్చుట, నాదృష్టిలో, అసాధ్యమైన పని. లగ్నాధిపతి పురుషగ్రహమగు కుజుఁడు. లగ్నమందున్న బృహస్పతి పురుషగ్రహము. ఏడింటనుండి లగ్నమును చూచుచున్న నపుంసకుఁడు. అగుటచే, ఇది పురుషజాతక మని [illegible] ంచుట తప్పనరాదు. మఱియు, లగ్నము స్త్రీరాశి యగు వృశ్చికము.

| | | | |
|---|---|---|---|
| రా | | శ | బు శు ర |
| | రాశి కుండలి | | కు |
| | | | చ |
| | ల గు | | కే |

ముపై, లగ్నాధిపతియగు కుజునిపై నపుంసకగ్రహమగు శనిదృష్టి కలదు. లగ్నాధిపతి స్త్రీరాశిలో నున్నాఁడు. ఈ కారణములచే, ఇది స్త్రీజాతకముగా నుండు నన్నచో, కాదనలేము. మొత్తముమీఁద ఇది "మిడుతంభట్లశకునము" వంటిది.

గ్రహస్ఫుటభావస్ఫుటములు చేసినపుడుసైతము జన్మకుండలి లింగమును తెలుపఁజాలునా యనునది సందేహాస్పదమగు గొప్ప సమస్య. సూర్యోదయాదిగా ప్రతిముహూర్తము (అనఁగా, మూఁడుముక్కాలు గడియలు) నందలి మొత్తపు విఘడియలు ౨౨౫ టిని పంచమహాభూతములకు పంచిపెట్టి, పృథివి, తేజస్సు, ఆకాశము అను భూతత్రయమునకు జన్మకాలము సంబంధించెనేని పురుషులు జనింతు రనియు, జల, వాయుభూతములకు సంబంధించినకాలములో స్త్రీలు జనింతు రనియు నిర్ధరించు పద్ధతి యొకటి కొన్నిచోట్ల వాడుకలో నున్నది. పృథ్వికి ౧౫, జలమునకు

౩౦, తేజస్సునకు ౪౫, వాయువునకు ౬౦, ఆకాశమునకు ౭౫ విఘడియల వంతున ముహూర్తపు విఘడియలను విభజించుట యీ సంప్రదాయమందలి పద్ధతి యనుటచే, ప్రతిముహూర్తమందును పురుషశిశువులు జనింపఁగల కాలము ౧౩౫ విఘడియ లనియు, స్త్రీ శిశువు లుదయించు కాలము ౯౦ విఘడియలు మాత్రమనియు ఏర్పడుచున్నది. అనఁగా, స్త్రీలకంటె నూటికి ఏఁబదివంతులు పురుషు లధికముగా సృష్టి యగుటకే కాలపురుషుఁడు సౌకర్యము నొసఁగుచున్నాఁ డనుట! అనుభవములో నిది యెంతమాత్రముసమన్వయ మగుచున్నదో పాఠకమహాశయులే గమనించఁగలరు.

ఇట్టివే మఱికొన్ని పద్ధతులు కల వందురు. ఆధానకాల లగ్నమునుండియే లింగనిర్ణయ మగునని పాశ్చాత్య శాస్త్రజ్ఞుల మతము. మన ప్రాచీన గ్రంథములలో నిషేకకాలలక్షణములను తెలుపు సూత్రములు సయితే మీ పద్ధతినే సూచించుచున్న వనుకొందును. అది యట్లుండె.

ఒకటే రాశిలో లగ్నము, గురువు కల రన్న మాత్రముననే, లగ్నమందే గురువున్నాఁ డనుకొనుట మిక్కిలి ప్రమాదకరము. ప్రశంసలో నున్న జాతకమున వృషభములో నున్న శని సప్తమమం దున్నాఁ డనుకొనుటకూడ సాహసమేయగును. గ్రహస్ఫుటము చేసి, భావకుండలి సాధించనిదే, ఇది నిర్ధరించుట కానిపని. సాధారణముగా గ్రహస్ఫుటము చేసి భావములను సాధించు నభ్యాసమే మనకు వాడుకలో తప్పిపోవుచు వచ్చినది. జాతకములకుఁ గాని, ముహూర్తములకుఁ గాని మొట్టమొదట భావకుండలి సాధించి దానిలో రాసులను సూచించుట పాశ్చాత్యుల యలవాటు. మనవారివలె— అనఁగా ఇప్పటికాలపుమాట— భావములేని రాశికుండలిని వా రెప్పుడుకాని వేయరు. జాతకకర్మ పద్ధతిని తెలుపు మన ప్రాచీన గ్రంథములన్నియు ఫలాదేశవిషయమున భావసాధనమునకే ప్రాధాన్యము నిచ్చినవి. జాతకమునకు మాత్రమే కాదు, ఏకార్యమున కయినా, లగ్నము నిర్ధరించునపుడు భావములను సాధించనిదే ఫలము లేదని మన ప్రాచీనులు ఘంటాఘోషముగా చెప్పిరి.

" జన్మ, ప్రయాణ, వ్రతబంధ, చౌల,
నృపాభిషేకాది, కరగ్రహేషు,
ఏవం హి భావాః పరికల్పనీయాః,
తైరేవ భావోక్తఫలాని యస్మాత్." (శ్రీపతిపద్ధతి)

భావసాధనము చేయని వెలితిని కప్పిపుచ్చుటకా యన్నట్లు ద్రేక్కాణకుండలి, నవాంశకుండలి, ద్వాదశాంశకుండలి మున్నగా కొన్ని చక్రములు, బిందుశోధన మను పెద్ద పేరున మఱికొన్ని కుండలులు వేసి జాతకగ్రంథపు పుటల నింపు నాచారము కొన్నిచోట్ల కానవచ్చుచున్నది. భర్త లేని లోపము బండారు తీర్చునా? భావకుండలి లేని కొఱఁత నివి యేవియు తీర్పఁజాల వనుట నిస్సంశయము.

ఇచ్చిన కాలమునకే భావస్ఫుటము, గ్రహస్ఫుటము చేసెదమన్నచో, కొన్ని చిక్కు లున్నవి. ప్రశంసలో నున్న జాతకమున జన్మకాలము గడియలలో నీయఁబడినది కదా? గడియలలో కాలములను సాధించు ప్రాచీన ఘటీయంత్రసాధనములు మన దేశమున మృగ్యములై పెక్కు తరములు కడచినవి. ఆ కారణమున, పగలు పాదచ్ఛాయల వలననో, రాత్రి నక్షత్రోచ్చమునుండియో గడియలను లెక్కించు సంప్రదాయము మనతాతలనాఁటి కాలమున వాడుకలోనికి రావలసివచ్చెను. కాని, ఈ పద్ధతిచే ఇష్టకాలమును నికరముగా గడియలు విఘడియలలో సాధించుట సాధ్యము కాదు. అందాజులగ్నములకు పనికి వచ్చు పద్ధతులివి. ఇది యిట్లుండ, ప్రశంసలోని జాతకమస్తమానప్రాంతమున జనించుటచే, నీడయా కొలఁతకు దొరకదు. చుక్కలా కానరావు. ఆకారణమున పయిపద్ధతులు దీనికి తరముకానివి. ఏదోయొకవిధముగా అస్తమానకాలమును నిర్ధరించుకొని, అందాజుగా దాని కిన్ని విఘడియలు ముందో వెనుకయో జన్మకాలముండునని నిర్ధరించియుండవలయును. లేదా, గడియారపు గంటలనుండి జన్మకాలమును గుర్తువేసుకొని, నెమ్మదిగా, సంప్రదాయము పోఁగొట్టరాదని గడియలలోనికి దానిని మార్చియుండవలయును. ఇఁక, మన గడియారములా, ఏ రెండుకాని సమానకాలమును చూపవనుట దైనందినానుభవములోనిది. తంత్రీ వార్తా

కాలమునకో, రేడియోకాలమునకో గడియారములను సవరించుకొనుటకు సౌకర్య మెందఱకుఁ గలదు? అట్లు సవరించుకొన్నప్పుడైనా, మనకు లభించునది, ప్రభుత్వమువారిచే శాసనమువూలముగా హిందూదేశమున కంతా ఏకమూలికాప్రయోగముగా నిర్ణయించఁబడిన (I. S. T.) ఇండియన్ స్టాండర్డుకాలమే! జాతక ముహూర్తములకు దేనికిఁగాని ఈ స్టాండర్డుకాలమును ఉన్నది యున్నట్లే ఉపయోగించుకొనలేము. జన్మస్థానపు రేఖాంశల కాలముచే ఋణధనసంస్కారము చేసి, స్థానికమధ్యమకాలమును (L. M. T.) సాధించుటకుమాత్ర మిది పనికివచ్చును. అట్లు సంస్కరించిన తరువాత, స్థానికసూర్యోదయకాలమునుండి ఇష్టకాలమునకుఁ గల అంతరమును తెలుసుకొననిదే జన్మకాలమును గడియలలోనికి మార్చలేము. మన పంచాంగములందలి సూర్యోదయాస్తమానకాలములు పంచాంగములు గుణింపఁబడిన గ్రామములకో, మఱి యేనగరములకో సంబంధించిన వగుటచే, దేశాంతరసంస్కారము చేసిన యనంతరముకాని మన కవి యుపయోగించవు.

ఇట్టి పరిస్థితులలో గడియారపు కాలమునుండి జన్మకాలమును గడియలుగా మార్చుటలో, ఎన్ని చోట్ల నెన్ని పొరఁబాట్ల కవకాశ మున్నదో చదువరు లూహించుట సులభము. ఇవి గమనించకయే భావములను సాధించినచో, విఘ్నేశ్వరుని ప్రతిమను నిర్మించఁబోఁగా, అతని నాయనప్రతిమ తయారైన దన్న సామెతే యగునేమో?

ఈసంస్కారము లన్నియు సక్రమముగా జరిగి జన్మకాలము గడియలరూపముగా నికరముగా నిర్ణయించఁబడినదే యనుకొన్నను, జన్మస్థానపు అక్షాంశలు తెలియనిదే కార్యముసాగదు. అక్షాంశలు మారినచో, ఒకటేకాలమునకే లగ్నభాగలు మారుననుట సుప్రసిద్ధవిషయము. ఏకాలమున చెన్నపట్టణమున మేషరాశిలో వృశ్చికనవాంశ (నిరయనముగా) లగ్నమం దుదయించునో, అదే కాలమందే ఢిల్లీనగరమున వృషభరాశిలో మకరనవాంశ లగ్నమం దుండఁగలదు. ఇవన్నియు లేకయే సాధించిన భావకుండలిలో గుణ మభావమని వేరుగ చెప్పనవసర ముండదు.

అంతేకాదు. ఇవన్నియు నేదో యొకవిధముగ సమన్వయపరచుకోవచ్చు ననుకొందము. జన్మకాల మనఁగా శీర్షోదయకాలమా, భూపతనకాలమా, నాళచ్ఛేదనకాలమా, మఱియొకటియా అను విషయమున నైకాభిప్రాయము లున్నవి. ప్రకృతజాతకమున కిచ్చిన కాలము వీనిలో నేదో తెలియదు. ఒక్కొక్కయుగమున నొక్కటే యుపయోగింప నర్హమని కొందఱి మతము. ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమయిన ప్రాణవాయు సంచారము శిశువున కేక్షణమున నారంభమగునో, ఆక్షణమే జన్మకాలముగా పరిగణింపవలయు నని కొందఱు ప్రాచీనులు సమన్వయము చేయుదురు. ప్రాచీనసంప్రదాయానుసారము గణితాయుర్దాయము-పిండాయుర్దాయము, అంశాయుర్దాయము మొదలగునవి-సాధించు సందర్భములలో జాతకుని ఆయుఃపరిమాణము ఒక్కవిఘడియకు ఆరు అసువులవంతున ఇన్ని అసువులని నిర్ణయించి, వానిని దినములు, నెలలు, సంవత్సరములుగా మార్చుట శాస్త్రమర్యాద. అగుటంబట్టి పై సమన్వయము సయుక్తికముగా కన్పట్టును. పాశ్చాత్యహోరాతంత్రవేత్తల మతముసయిత మిదే. సర్వసాధారణముగా శిశువునకు నూతనవాతావరణసంబంధమువలన ప్రథమశ్వాసారంభ మేర్పడుటయు, ఆ యనుభవవిశేషపు ఫలమే రోదనమగుటయు సంభవించుటచే అట్టి ప్రథమరోదనక్షణమునే జన్మకాలముగా పరిగ్రహించుట యుక్త మని పాశ్చాత్యశాస్త్రవేత్తల సిద్ధాంతము. అనారోగ్యము కారణముగా కొన్ని సమయములలో శిశువునకు జన్మక్షణమందే శ్వాసారంభము కాకపోవచ్చును. కృత్రిమోపాయములతో శ్వాసమును తెప్పించు పద్ధతులు ప్రసూతితంత్రవేత్తల యనుభవములోనివి. అట్టి పరిస్థితులలో భూపతనానంతరము ప్రాణవాయు సంచారారంభమునకు కొంత వ్యవధి యుండకతప్పదు. కొందఱు శిశువులు భూపతనాత్పూర్వమే, అనఁగా అర్ధోదయమందే రోదన మారంభింతురఁట! ఊపిరి యారంభించినది మొదలు కట్టకడపటి శ్వాసము నిలచిపోవుదాఁక జరుగు కాలమే ఆయువుగను, అదియే జీవితముగను నిర్వచనము చేసినచో, పాశ్చాత్యుల యుక్తి సమంజసమని తోఁచకమానదు. గర్భస్థశిశువునకు ప్రాణము లేదా అందురేమో? దానికై

ఆధానకాలలగ్నము నాశ్రయించవలయునేకాని ప్రాణము వచ్చిన యెన్నినెలలకో వచ్చు నీజన్మకాలలగ్నమునకై దేవులాడనేల? ఊపిరియాడ నారంభమైన తరువాత కూడ స్తబ్ధతవలననో, మఱి యేకారణముననో రోదనము చేయని శిశువుల నరుదుగా వినుచున్నాము. అట్టివారివిషయమున జన్మకాలమును గుర్తించుట కష్టసాధ్యము. వారి యదృష్టరేఖ మంత్రసానుల చేతిలోనిది.

కాననే, ఎంత జాగరూకతతో గమనించి గ్రంథస్థము కావించిన జన్మకాలమైననేమి, శోధనపద్ధతులతో శుద్ధము గావించక తీరదని పాశ్చాత్యపరిశోధకులు తీర్మానించిరి. నానావిధములగు శోధనపద్ధతులను గూర్చిన గ్రంథములనే వారు వ్రాసియున్నారు. మనలోఁగూడ కార్తాంతికులు కొందఱు జన్మకాలమును సవరించుట చూచుచున్నాము. కాని, శుభగ్రహముల నిష్టస్థానములకుఁ దెచ్చుకొని రాజయోగములున్నవని చూపి బహుమతులు పడయుటకై అనేకులీప్రయత్నములు చేయుచుండుటమాత్రము శోచనీయము. తమ సంతానము గుణవంతమైన దను నమ్మకముచే, పంచమస్థానమునకు బృహస్పతిదృష్టి వచ్చునట్లుగా తమ జన్మలగ్నమును జరుపుకొని గర్వించు తండ్రులును, భార్యపాతివ్రత్యముపైఁ గల యపారవిశ్వాసమువలన సప్తమస్థానమునకు గురువును దెచ్చుకొని సంతసించు భర్తలును అందందు కానవచ్చుచున్నారు. లగ్నములను (అనఁగా, జన్మకాలమును) ఇట్టిదృష్టితో సవరించుట పరిహాసాస్పదము. శాస్త్రదృష్టితో నిర్దిష్టములగు శోధనపద్ధతులు మన ప్రాచీనులకుఁ దెలియవని నావాదము కాదు. వారు జ్యోతిషమున చేసినన్ని పరిశోధనముల నితరఖండములవారు చేసియుండలేదనుట కెన్నియో సూచన లున్నవి. 'ప్రాణపదము'నుండియో, గుళికునినుండియో, చంద్రునినుండియో శుద్ధముచేయని జన్మలగ్న మశుద్ధమని బృహత్పరాశర ర చాటుచున్నది.

"వినా ప్రాణపదా చ్ఛుద్ధో
గుళికాద్వా నిశాకరాత్
త దశుద్ధం విజానీయాత్"

నిషేకకాలమును జన్మకాలమునుండి సాధించి, దానినుండి గణితసాహాయ్యమున జన్మకాలమును శుద్ధము చేయుపద్ధతి యొకటి తాజికసంప్రదాయమునఁ గలదఁట!

"విజ్ఞాయతే జ్ఞానిభి రత్ర పుంసాం
శుభాశుభం జన్మఫలం విలగ్నాత్
తదుచ్యతే తాజికనాయకోక్తా
నిషేకకాలా దిహ జన్మశుద్ధిః" (మనుష్యజాతకమ్)

సరేకాని, ఆతరువాతి గ్రంథము సుబోధము కాదు. దానిక్రిందనున్న వ్యాఖ్యానము "టీకా టూకామపేక్షతే" అను రకములో నున్నది. జన్మకాలము నుండి నిషేకకాలమును సాధించు మార్గ మొకటి కలదని బృహత్పరాశరహోరయందలి యీక్రింది శ్లోక

"అథాత స్సంప్రవక్ష్యామి శృణుష్వ మునిపుంగవ
జన్మలగ్నంచ సంశోధ్య నిషేకం పరిశోధయేత్
తదహం సంప్రవక్ష్యామి మైత్రేయ త్వం విధారయ
జన్మలగ్నా త్పరిజ్ఞానం నిషేకం సర్వజంతు యత్
యస్మిన్ భాతే భానవిష్ఠ స్తస్స్య మాందేర్యదంతరం
లగ్నభాగ్యాంతరంయోజ్యంయచ్చరాశ్యాదిజాయతే
మాసాది స్తని కం జ్ఞేయం జన్మతః ప్రాఙ్నిషేకజ.
యద్య ద్భశ్యదళేంగేశ స్తదేందో ర్భుక్తభాగయుక్
తత్కాలే సాధయే ల్లగ్నం శోధయే త్పూర్వవత్తనుః"

ఈ సూత్రములలోఁ గొన్ని యర్థము కాని స్థితిలో నున్నవి. అనఁగా, మాబోటి సామాన్య విద్యార్థుల కన్నమాట. ప్రయోగసంప్రదాయరహస్యము బోధపడక, పండితు లనేకులకడ విన్నవించుకొంటిని. కాని, నాప్రయత్నము సఫలము కాలేదని చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది. వారికిసయితమిది అభేద్యమైయుండు ననుకొనుటకంటె,

"బోద్ధారో మత్సరగ్రస్తాః
ప్రభవ స్స్మయదూషితాః,
అబోధోపహతా శ్చాన్యే
జీర్ణ మంగే సుభాషితం."

అను భర్తృహరిసుభాషితములో సత్యమున్నదనుకొనుటే మేలని తలంచితిని. ప్రాచీనసంప్రదాయరహస్యములు పూర్తిగా నశింపకమున్నె 'వానిని

ప్రపంచహితార్థమై తద్జ్ఞులు సుబోధముగా ప్రకటింప వలసియున్నది. వారిచే నాపని చేయించు బాధ్యత ప్రవిశ్వాసము గల జనులది. అంతటి భాగ్య మెన్నటికో ?

జన్మకాలమునుండి ఆధానకాలమును సాధించి, దానికి లగ్నగ్రహస్ఫుటములు చేసి తత్కాలస్పష్టచంద్రుని యాధారమున మరల జన్మకాలపు భాగలిప్తలను గణితసాహాయ్యమున శుద్ధముగావించు సమగ్రముగు పద్ధతి యొకటి పాశ్చాత్యులలో వాడుకలో నున్నది.

"యథా చంద్ర స్తథా లగ్నం
యథా లగ్నం తథా శక్తి."

అను వాక్యమునందలి సత్యము సంపూర్ణముగా నీపద్ధతికే అన్వయించు ననుట తప్పుకాదు. ఇది యించుమించుగా తాజికసంప్రదాయము సూచించు పద్ధతి వంటిదే. అనేక సంవత్సరము లపారపరిశోధనముల సలిపి వారీపద్ధతిని సమగ్రము గావించినారు. దీని సాయమున లగ్నమును, తత్ఫలముగా జన్మకాలమును శుద్ధముచేసినచో, ఏకాంశవర్గ పద్ధతిచే చలనవశమున లగ్నదశమకేంద్రములకు కలుగు గ్రహదృష్టుల ఆనుకూల్యప్రాతికూల్యముల ననుసరించి, జీవితమున ప్రధాన పరిణామములు సంభవించు సంవత్సరములు, దైనిక జాతకమువలన ఆయాసంవత్సరములలో శుభాశుభఫలములు సంభవించగల దినములు - ఇవి నికరముగా సూచింపబడుననుట యీపద్ధతియందలి ఘనత. జీవితమున నతిముఖ్యవిషయములు నడచిన సంవత్సరములు మాత్రమేకాక, అట్టిదినములనుగూడ శుద్ధమైన లగ్నము చూపజాలదేని, ఆ లగ్న మశుద్ధమనియే భావించి పునస్సంస్కారము చేయదగియుండును. అగుటచే, జీవితమందలి ప్రధానపరిణామములు—మాతాపితృనిర్యాణము, వివాహము, కళత్రవియోగము, పునర్వివాహము మున్నగునవి—కలిగిన నికరమైన దినములు తెలియుట అత్యావశ్యకము. గురుదశలో శుక్రాంతరములో వివాహము, రవిదశలో రాహ్వంతరమున పితృనిర్యాణము జరిగిన దని సరిపుచ్చుకొనుట లగ్నమును శుద్ధముగా చేయు కార్యమున కెందుకైనను పనికిరాదు. సామాన్యముగా జాతకములు వ్రాయించువారు "గతముతో పనిలేదు. భవిష్యత్తు వ్రాసినచో చాలును" అందురు. భూతకాలమందలి పరిణామములను జన్మకాలము చూపగలిగినదా యని తృప్తికరమగు సాక్ష్యము రాకయే, భవిష్యత్ఫలములను వ్రాయించు పద్ధతి యెవరి మేలుకొఱకో ?

దశాశేష మున్నదికదా? దానినుండి భావిదశలు కట్టరాదా ?. ద్రావిడప్రాణాయామపు చిక్కులు గల యీ లగ్నశోధన మెందుకు ? అనువా రుందురేమో ? మన ప్రాంతమున సర్వసాధారణముగా వాడుకలో నున్న యీ వింశోత్తరీదశను—అనగా, ఉడుదశను—గూర్చి చర్చనీయాంశము లెన్నియో కలవు. కాని, వానిని తడవుట కిపు డవసరముకాదు. నాకు దోచి నంతలో, ఈదశాపద్ధతిలో నొక గొప్ప సుగుణమున్నది. ఇతరసౌకర్యముల మాట యెట్లున్నను సర్వసులభముగా వ్రేళ్లెంచి, ఇప్పు డీదశలో ఈ అంతర్దశ యని తటాలున చెప్పవచ్చుననుట! మన దేశమున గణితసాధ్యములగు ప్రాచీనసంప్రదాయము లన్నియు నడుగంటిన వగుటచే, ఈ దశాపద్ధతియందలి ప్రయోగసౌలభ్యమే దీనికి సార్వజనీనవ్యాప్తి వచ్చియుండుటకు ముఖ్యహేతువు. జన్మనక్షత్రము జ్ఞప్తిలోలేని పెద్దమనుష్యుడుసయితము తనకు శుక్రమహాదశ ఏవయస్సున రాగలదో చెప్పగలడు. ఈ దశాపద్ధతికి ఫలము లేదనుట ఆశయము కాదు. దీనికి చంద్రచార మాధారము. చంద్రగతికంటె లగ్నగతి రమారమి ఇరువది యేడంతలు వేగము గల దనుట సర్వసమ్మతమగు విషయముకదా? మానవు సూక్ష్మమగుకొలది సూక్ష్మవస్తుగ్రహణమునకు హెచ్చు సౌలభ్య మబ్బుననుట నిర్వివాదాంశము. కాన, చంద్రునిపై నాధారపడు పద్ధతులకన్న, స్పష్టలగ్నముపై నాధారపడు పద్ధతులకు హెచ్చు వెల యుండగలదనుట వ్యక్తమగును. కేవల రాశికుండలి కంటె భావస్ఫుటముచేసిన కుండలి ౧౨౦౦ రెట్లు సూక్ష్మమనుట వేరుగా చెప్పు పని యుండదు.

ఇన్ని చిక్కు లుండబట్టియే వాడుకలో భావసాధన మభావ మయినది. లగ్నశుద్ధిక్రమము నడుగు

వారే లేరు. శుద్ధమయిన స్పష్టలగ్నపు భాగలిప్తల యాధార మున్నపుడే పనికివచ్చు ప్రాచీనసంప్రదాయ విశేషములు పెక్కులు మాసిపోయినవి. పుణ్యాసహా మాది సూక్ష్మబిందువు లలభ్యము లయినవి. షడ్బల సాధనము సాధ్యము కాకపోయినది. గణితాయుర్దాయ ప్రయోగములు గంగపాలైనవి. వర్ష జాతకసంప్రదాయము వాడుకతప్పినది. ఆరూఢచక్రములో పదములను స్ఫుటముచేయు నాచార మరుదైనది. ఇట్టి నష్టము లెన్నియో చెప్పవచ్చును. జన్మకుండలిలోఁగాని, వివాహముహూర్తకుండలిలోఁగాని రాశిచక్రములో నేదోయొక రాశిలో 'ల' అని సూచించుటలో పర్యవసాన మగుచున్నది. ముహూర్తనిర్ణయవిషయమున వచ్చుచున్న వాడుక మఱింత ఘోరము! "ఉదయము ౧౦ గంటలకు పైఁగా వృషభలగ్నములో" అనియో, "పగలు ౯-౩౦ నుండి ౧౦-౩౦ వరకు లగ్నకాలము" అనియో పత్రికలలో నచ్చువేయించు నాచారము నానాఁట ప్రబలుచున్నది. ఇట్టి లగ్నములు శాస్త్ర సమ్మతములా, శుభఫలసంధాయకములా? భావసాధనమునకు వలయు సామగ్రి మన ప్రాచీనగ్రంథములలో లేదని కాదు. వాని వ్యాసంగమునకు తగినంత ప్రోద్బలము, వ్యాసంగముచేసినవారికి తగుమట్టు జీవనోపాయము, జనులలో శాస్త్రముపై చాలినంత ప్రామాణ్యజ్ఞానము ఇవి తగ్గిపోవుకొలఁది ప్రాచీనశాస్త్రీయసంప్రదాయములు మాసిపోవఁజొచ్చినవి. సంప్రదాయవేత్తలగు ప్రాచీనులు క్రమక్రమముగా నంతర్ధానమగుచున్నారు. ఏకొందఱో పూర్వాచారమును వదలలేక శాస్త్రార్థము జాతకములను వ్రాయించుట! ఆఁడుబిడ్డల జాతకముల కక్షతారోపణముతో ఫలశ్రుతి!

కావుననే, ఇప్పటి కాలమున జాతకములు వ్రాయువారిలో తమ బాధ్యతను గుర్తెరింగిన మహనీయులు కొందఱు తాము వ్రాసిన వ్యక్తిజాతకగ్రంథములకొనలలో ఈక్రింది శ్లోకములను చేర్చుట సంప్రదాయమైనది:—

"న మయా స్థాపిత శ్శంకుః
నక్షత్రం నావలోకితం
పరోపదిష్ట వేళాయాం
లిఖ్యతే జన్మపత్రికా."

ఏమహానుభావుఁడో మంచి పీఠిక వేసి ఇచ్చినాఁడు!

పోనిండు! ప్రశంసలో నున్న రాశికుండలిని చూచినచో, లగ్నమున గురువు, సప్తమమున శని కానవత్తురు. జాతకతత్త్వమందలి "జీవేంగే, మదేమందే పాతకీ "అను సూత్రము నన్వయించుటకు వీలున్నది. రవిబుధశుక్రులు మృత్యుస్థానములో కానవచ్చుచున్నారు. మఱి భావకుండలి ఏమనుచున్నదో పరీక్షింతము. ప్రశంసలోని జాతకమునకు సంబంధించిన కొన్ని వివరములను సంపాదింపఁగల్గితిని. వాని యాధారమున గుణింపఁబడిన గ్రహభావకుండలి పాఠకమహాశయుల కర్పించుచున్నాను. సాయనపద్ధతితో సాధింపఁబడిన కుండలి యిది. సాయననిరయనపద్ధతులకుఁగల ముఖ్యమగు భేదము రాసులకు సంబంధించినదే కాని భావములకు, దృష్టులకు, గ్రహపరస్పరాంతరములకు సంబంధించినది కాదు. కాన గ్రంథవిస్తరభీతిచే నిరయనకుండలి నిచట చూపలేదు. వలయువారు ౨౨ భాగలు, ౩౬ కలలు అయనాంశలుగా త్రోసివేసి, నిరయనస్పష్టలగ్నగ్రహాదులను సాధించుకొనవచ్చును. ఆ కుండలి యిది:—

IV ౨-౨౫
రా ౧౯-౨
శ ౨౯-౯
శు ౨౪-౩౨
VII
౨౫-౧౬
ర ౨౯-౪౭
వ ౨-౪౫
(వ)
బు ౨-౩౩
ఇ ౨౨-౩౪
(సాయనము)
కు ౧౩-౪౮
I ౨౫-౧౬
గు ౯-౧౨
(వ)
X ౨-౨౫
కే ౧౯-౨
చ ౧౧-౪౨

బృహస్పతి ప్రబలుఁడై స్వక్షేత్రమున వ్యయ భావములో నిలిచినాఁడు. కాని లగ్నములో లేఁడు. శనైశ్చరుఁడు భర్తృస్థానమగు సప్తమభావమునం దుండక షష్ఠభావములోనికిఁ బోయినాఁడు. గురువునుండి సమసప్తకస్థానమగు మిథునరాశిలోని ౭ భాగల ౧౨ లిప్తల ప్రదేశమునకు శని ౧౦ భాగల ౪ లిప్తల దూరమునం దుండుటచే, పాశ్చాత్యుల మతములో ఫలప్రదమగు దృష్టియే లేదు. అనఁగా, గురువునకు శనినుండి వేధ లేదనుట. శ్రీపతిసంప్రదాయానుసారముగను, పరాశరమతమునందును శనిదృష్టి కొంత బృహస్పతిపైఁ గలదనుట వాస్తవమే! కాని, శని ఆరవ భావమం దుండుటచే, పై జాతక తత్త్వసూత్రమునో, ఇట్టిదే మఱియొకటో అన్వయించి ఫలము చెప్పుట అశాస్త్రీయముమాత్రమే కాక అన్యాయ్యముకూడ.

మఱియు, రవిశుక్రబుధులు మృత్యుస్థానమునం దుండిన ట్లగుపడినవారు వస్తుస్థితిలో సప్తమభావములో నున్నారు. చెప్పమరచితిని. ఇది యొక స్త్రీజాతకమని తెలిసినది.

లగ్నమును పూర్ణదృష్టితో శుక్రుఁడు సప్తమభావమధ్యమునం దుండి చూచుచున్నాఁడు. సౌందర్యము, సౌజన్యము, కళాభిమానము, విలాసవైదుష్యము, రసపరతంత్రకోమలహృదయము మున్నగు మధురఫలముల నొసఁగుటకు బద్ధకంకణుఁడై, శుక్రుఁడు భర్తృస్థానమం దుండఁగా, వానిని మృత్యుభావమున పడఁద్రోసి, సౌందర్యద్వేషి, సుఖదూరుఁడు, కఠినహృదయుఁడు, లుబ్ధాగ్రేసరచక్రవర్తియు నగు శనైశ్చరుని నచట చూపుచున్న యీ రాశికుండలిపద్ధతి నేమనవలయునో తోఁచకున్నది. భర్తనుండి భాగ్యమభివృద్ధిచెందఁగలదని సూచించుచు సప్తమస్థానమందున్న రవిని రంధ్రస్థానములో పడఁద్రోయుట యేమినీతి? సప్తమభావమున రవి యున్నచో స్త్రీజాతకమున భర్తృవిరహమును దెలుపు ననుసూత్ర ముండుట వాస్తవమే. కాని, సప్తమాధిపతియగు బుధుఁడు సప్తమభావమందే యుండుటచే, రవివలన లోప మేదైనఁ గల్గెనేని అతఁడు చక్కదిద్దుకోఁజాలఁడా? ఇంతే కాదు. తానున్న రాశిని వదలుటకుపూర్వము ఇతర గ్రహములతో ఏవిధమగు దృష్టికాని స్త్రీజాతకమందలి రవికి రాదేని దాంపత్యమూలమున భాగ్యోదయసుఖానుభవములు జాతకురాలికి మధ్యవయస్సుననే సమృద్ధిగ రాఁగలవని పాశ్చాత్యుల మతము. అది యట్లుండె.

ఈ జాతకమున కిచట ఫలాఫలములు చెప్పఁబూనుట నా యుద్దేశము కాదు. భావఫలముల నిట్లు తారుమారుగావించు కేవల రాశిచక్రపద్ధతి అనేకానర్థములకు మూలమని విన్నవించుటకై యింతదూరము చెప్పవలసివచ్చినది. జన్మకాలమందలి గ్రహభావస్థితుల వలన సూచితములగు ఫలములు మంచివో, చెడ్డవో దైవదత్తములు. కుండలులలో గ్రహస్థానములను మార్చఁగలమే కాని ఆకాశరంగమున మార్చఁగలమా? లేని ఫలము లున్నవనుకొని, ఉన్న ఫలములు లేవనుకొని మిథ్యానందమో, మిథ్యావిషాదమో అనుభవించుటే యీపద్ధతికిఁ గల ఫలము.

ఆరింటనో, మూఁడింటనో కుజుఁ డుండు కన్యాజాతకములలో రాశికుండలియం దా గ్రహము సప్తమస్థానమందో, కుటుంబస్థానమందో కలదనుకొని భ్రమపాలయి, చక్కని జాతకానుకూల్యసంపత్తి గల సంబంధము లెన్నియో నిష్కారణముగ వదలుకొనుటయు, ఆరవరాశిలో కుజుఁడు రాశికుండలిలో కానవచ్చుటచే "శవ్యాయిదోషము లేదు" అనుకొని వాస్తవముగ సప్తమభావమున ప్రబలకుజదోషము గల కన్యనే కడకు స్వీకరించుటయు పెక్కుసందర్భములలో సంభవించుచున్నది. వివాహముహూర్తము నిర్ణయించినపుడు శుభప్రదుఁడై పంచమకోణములో నున్నాఁ డనుకొన్న శుక్రుఁడు షష్ఠభావమధ్యమునకే వచ్చుటచే, భృగుషట్క మను మహాదోషము గల లగ్నమున వివాహము జరుపుటయు కలదు. తరువాత, పరిణామములో దుష్ఫలము కానవచ్చెనేని, అప్పు డది యే శత్రుస్థానగతుఁడగు కుటుంబాధిపతికో, ఏ నీచగ్రహవీక్షణమునకో ముడిపెట్టి మనస్తృప్తి సంపాదించుకొనుట సయితము చూచుచున్నాము. లేదా, గ్రహయోగాదులు పాపికలికాలములో విపరీతఫలము లిచ్చు

వనియో, పార్వతియో, పరమేశ్వరుఁడో శాపమిచ్చు టచే జ్యోతిశ్శాస్త్రఫలములు "ఫవంతి, నఫవంతిచ" అను సందేహముపాలయిన వనియో! అనుకొని సెమ్మది పడుటయు కన్పట్టుచున్నది.

ఈ రాశిచక్రపద్ధతివలన ఇట్టి అనర్థము లెన్నో కలవు. ఈమార్గమున వ్రాయఁబడిన జాతకములను జూచియు, భావములకు ప్రాధాన్య మీయక రాశికుండలినుండియే ధర్మకర్మాధిపతియోగమని, చంద్రమంగళయోగమని, గజకేసరీయోగమని, నీచభంగరాజయోగమని, ఏమేమో యోగములను నిర్ధరించి ఫలాదేశము చేయు ఆధునికజ్యోతిష గ్రంథములను చదివియు, పాశ్చాత్యులు కొందఱు హైందవజ్యోతిష శాస్త్రమున గణితశాస్త్రమునకు వెలయే లేదని హేళనము చేయసాగినారు. చేయరా మఱి? పరాశరుఁడు, సత్యాచార్యుఁడు, వరాహమిహిరుఁడు మున్నగు హోరాశాస్త్ర పారంగతులగు మహానుభావులను కన్న భారతభూమి కిది సహింపరాని కళంకము. అవమానముకూడ.

ఈ రాశికుండలులను చూచినపుడు మా రామరాజభూషణ మహాకవి చెప్పిన పద్య మిది స్ఫురణకు వచ్చుచుండును:

"భావం బెక్కడ లేక, వృత్తనియమా
పాయంబు చింతింప, కెం
దే వర్తించి, పరార్థవంచనలచే
దీపించి, మూర్ఖాళి సం-
భావింపన్, కుకవిప్రణీతకృతి సా
మాన్యాకృతిం బోలి, పై
పై వన్నెల్ పచరింప, దాని తిలకిం
పంబోరు ధీరోత్తముల్." (వసుచరిత్ర)

భావ మనఁగా తన్వాదిభావము లనియు, వృత్తనియమము లనఁగా గ్రహసంచారకక్ష్యలకు సంబంధించిన ఖగోళగణితశాస్త్రపద్ధతు లనియు అర్థమును స్వీకరించినచో, పైపద్యము ప్రకృత సందర్భమున కెంతో రమ్యముగా అన్వయమగుచున్నదిగదా!

ఈ కేవల రాశికుండలి సంప్రదాయము మన దేశమున నెంత శీఘ్రముగా నంతరించిన మన కంత క్షేమము. దీనికి జాతకకర్తల యనుగ్రహము కావలసి యున్నది. గ్రహభావ స్ఫుటములతో కుండలుల నుపయోగించు పద్ధతినే గ్రంథకర్త లవలంబించవలసి యున్నది. జాతక శాస్త్రమును గూర్చి యిప్పుడు వెలువడుచున్న గ్రంథము లనేకములు విద్యార్థులకే కాక శాస్త్రమునకు నయితము గొప్ప యపకారమే చేయుచున్నవనుట తప్పుగాదు. సంస్కృత గ్రంథములకు తెనుఁగున వ్యాఖ్యానములు వ్రాయించు మహనీయులు "తాత్పర్యము సుగమము; అర్థము మృగ్యము" అని పుటల నించువారిచేకాక, తగిన ప్రాచీన పండితులచే వ్రాయించుట ముఖ్యము. లగ్న సాధనమునకు పనికివచ్చు పథకములు, గ్రహచారస్ఫుటమున కక్కఱపడు కోష్టకములు మున్నగునవి సులభసాధ్యమగురీతిగా ప్రకటించుటకై గణితశాస్త్రవేత్తలు ముందుకురావలయును. ఖండాంతరములవారి సంప్రదాయములను మన పద్ధతులతో సమన్వయముగావించుటకై పరిశోధనములు సలుపుటకు ప్రాజ్ఞులు పూనుకొనవలయును. కాని, ఇన్నింటికి మూలకారణము జనసామాన్యమునకు జాతకముహూర్తములపైఁ గల శ్రద్ధ! విద్యావంతులే వారికి త్రోవ చూపువారు. ఒకవేళ ఈసమస్యలో అన్యోన్యాశ్రయదోష మున్నదేమో? జ్యోతిషశాస్త్రపు గ్రహచార మెట్లున్నదో?

ప్రశంసలోని స్త్రీజాతకపు కుండలి నుదాహరణార్థ ముపయోగించితినే కాని, అందలి గుణదోషములను చర్చించుటకై కాదనియు, అవ్యాజాభిమానముతో నాకీ జాతక సామగ్రి ననుగ్రహించిన మహనీయులను తప్పుపట్టచూచుట త్రికరణశుద్ధిగా నా యుద్దేశము కాదనియు మున్ముందుగానే విన్నవించుచు వారి క్షమాపణ నర్థించుచున్నాను.

## శ్రేష్ఠమైన బ్రిలియంటైన్




## జాబ్‌కో బ్రిలియంటైన్



# డోంగ్రేగారి

## బాలామృతము

బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును



## శృంగారదేవత

యగు మదనుఁడు వసంతఋతువు గడచినవెనుక యువతీ జనుల తలవెండ్రుకలలో చిరస్థాయి యగునని మహాకవి కాళిదాసు పలికెను. దేవతలను సైతము ముగ్ధులనుచేసి యాకర్షించు నా కేశసంపదను కేశవర్ధిని నుపయోగించి సర్వకాలములయందు మనోజ్ఞముగ వృద్ధిచేసికొనరాదా!

కేశవర్ధిని మీకుంతలములకు ప్రకాశమును ప్రకాశమునకు తగిన అందము అందమునకు తగిన యౌవనము నిచ్చును. విశేషించి బాల్యమునుండియే కుదుళ్లను గట్టిపరిచి రాలనీయక కాపాడును.

కేశవర్ధిని తులలేని చక్కని పెన్నెరులను ఆనెరికురులు మీ కద్వితీయ సౌందర్యమునిచ్చును. 1

# కేశవర్ధిని

నేడే మీ కురులకు కేశవర్ధిని
వాడుడు. మీ తలవెండ్రుకలను
అందముగా పెంచి బలపరచును.

| | | |
|---|---|---|
| కేశవర్ధిని | అణాలు | 0-12-0 |
| కేశవర్ధిని షాంపూ | ,, | 0-12-0 |
| కేశవర్ధిని క్రీం | ,, | 1- 0-0 |

ప్యాకింగు పోస్టేజి అధికము.
వర్తకులందరివద్దను దొరకును లేక

## సౌత్ యిండియా కెమికల్సు,

158, తిరువెంకటస్వామి రోడ్డు,
ఆర్. యస్. పురము — కోయంబత్తూరు.

 గమనిక :— దీనినిపోలిన యితర యిమిటేషన్ నూనెలనుకొని మోసపోవద్దు. మీరు కొనుటకుముందు, దానిమీద, "కేశవర్ధిని" మరియు "సౌత్ యిండియా కెమికల్సు" అను పేర్లనుచూచి తీసికొనుడు.

# తెలుగు కథానిక*

= శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న =

కథలు మనకు క్రొత్త కాదు. ఏ సారస్వతంలోనూ కూడా కాదేమో. హితోపదేశపంచతంత్రాదులు, కాశీమజిలీలు, భట్టి-విక్రమార్క-కథలు మొదలయినవి అనాదినుంచి దేశంలో వెలిసేఉన్నాయి—ఆంగ్లంలో అరేబియన్ నైట్సూ, క్రిస్మస్ కెరోల్సులాగ. ఆ కథలు అనేకఉపకథాగర్భితాలుగా ఉండడంచేత వాటిని కథాగుచ్ఛంగా భావిస్తే బాగుంటుంది. స్థూలదృష్టిని చూస్తే వాటిలో యించుమించుగా నవలల్లో ఉన్నంత తంతూ యిమిడిఉంటుంది. ఇవి వర్ణనాశబలతనూ, వాక్చమత్కృతినీ, అద్భుతరసాన్నీ పాటించినట్టుగా కథాగమనికను పాటించవు. అంటే కథలో త్వరితం అగపడదు—కావలసినంత విరామానికి అవకాశం ఉండబట్టి. ఈ కారణంచేతనే ప్రధానకథకు సంబంధం లేని వివిధవిషయాలు వాటిలో దొర్లిపోతూ ఉంటాయి.1 ఈ కథలు ఆదిమసారస్వతరూపం నుంచి అప్పుడే విడిపోయి ముఖ్యందు వృద్ధికాబోయే ఒక శాఖయొక్క బీజాన్నిమాత్రం అస్పష్టంగా తెలుపుచేస్తాయి. మొత్తంమీద యివి "నిరుపహతి స్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడె మాత్మకింపయిన భోజన మూయ్యాలమంచము" వగైరా సౌఖ్యాలతో తులతూగుతూ ప్రజాహృదయం ఆందోళనరహితంగా ఉన్న కాలానికి సంబంధించినవిగా కనబడతాయి.

ప్రస్తుతకాలంలో శీఘ్రసంపూర్ణానికే ప్రాధాన్యం. ఎడ్లబళ్లని మోటుపరచిన మోటారుకార్లు, ధూమశకటాలను తలదన్నిన వాయువిమానాలు, చేవ్రాతను చెరచిన టైపురైటర్లు, వంటపొయ్యికి వంకర్లు చూపిన ఎలెక్ట్రిక్ కుంపట్లు ఉన్న యీకాలంలో అంతా తొందరే. జీవితవిధానమే మారిపోయింది. విస్తృతమయిన గ్రంథాలూ, పెద్దకథలు వ్రాసే—చూసే తీరిక లేదు. చిన్నకథలకే మన ఆత్రుత, అభిమానం, ఆదరణానూ2. నేటి ఈ చిన్నకథలకూ, పైని చెప్పిన పెద్దకథలకూ సారూప్యం లేదు. ఇవి అచ్చంగా ప్రస్తుతయుగంలో ఆంగ్లవాఙ్మయప్రాబల్యం వల్ల ఏర్పడిన ప్రత్యేకమయిన ఒక సారస్వతరూపం. ఈ ఆఖ్యాయికా ప్రాచుర్యానికి ముఖ్యమయిన దోహదాలు నేటి మాస - పక్ష పత్రికలు. పత్రికలు చిన్నవి అవడంచేత ఈ కథలకు ఒక పరిమితి ఏర్పడింది. ఈ కారణంచేతనే సంగ్రహంగా ఉండీ కూడా బిగువు చెడకుండా చిన్నకథలు సమగ్రంగానూ, పుష్టిగానూ ఉండవలసి వచ్చింది.

## ఉద్ధాకథానికలు

చిన్నకథలు నేడు ఎక్కువగా వ్యాప్తి చెంద

* Sh rt Story అన్న ఆంగ్లపదానికి "కథానిక", "చిన్నకథ", "ఆఖ్యాయిక" అన్న పదాలు వాడేను.

1. ఇలాగ అనడంలో, నిత్యాహ్లాదజనకంగానూ, వాటి పద్ధతిలో కథనాచమత్కృతీ రసావిర్భావమూ స్పష్టపరిచి, అతిమధురంగా ఉండే ఆ యీకథలను నిరసించడంలేదు. టెక్నికల్‌గా వీటికీ నేటి చిన్నకథలకూ ఉండే భేదాన్ని నివేదించడమే నా ఆశయం.

2. ఈసందర్భంలో సెప్టెంబరు నెలలోని భారతిలో "తెలుగునవల" అన్న నావ్యాసం చివరిభాగం చూడండి.

దానికి కారణం నేటి "మాగజీన్" లని పైన వ్రాసేను. "మఖ్ జాన్" అంటే ఉర్దూలో పత్రిక అన్నమాట. మేగజీన్ (Magazine) అనే యింగ్లీషుమాట యీ ఉర్దూపదంలోనుండే వచ్చిందన్నది గమనించ దగిన విషయం. 'మఖ్ జాన్' అనే పేరుతో ఒక పత్రికను ౧౮౯౫ లో సర్ అబ్దుల్ ఖాదర్ స్థాపించేడు. పరాసు, ఆంగ్లం మొదలయిన ఖండాంతర వాఙ్మయాల్లోనుంచి కథలను తర్జుమాచేసి వ్రాసేవా డీయన. ఉర్దూలో చిన్న కథలకు పునాదివేసింది ఈయనే. అంతకు ముందు ఈ భాషలో కథలు దాస్తాన్ గో యీ పద్ధతిలో ఉండేవి. అంటే మన కాశీమజిలీల ఫక్కీని అన్నమాట. ఈ పద్ధతిలో కథ చురుకుగా నడవదు; పదజాలం అపరిమితం; కథలో సంఘట్టన (Incident) కన్నా వర్ణనలు ఎక్కువ. ఈదాస్తాన్ గో యీ పద్ధతిలో, రాత్రిళ్లు భోజనం చేసుకుని, నిద్దర పట్టేదాకా కథలు చెప్పుకునేవారుట.

౧౯౦౦నుంచి సరియైన చిన్న కథలు ఉర్దూలో మొలకలెత్తేయి. కథావస్తువు కాల్పనికం (Romantic) గా ఉండేది. ఫతేపురి వాస్తవ్యులయిన నియాజ్, సాజద్ హైదరీ యీ తరగతికి చెందినవాళ్లు. వీరి కథల్లో ప్రకృతీ — మానవుల సౌందర్య పిపాసత్వమే ఎక్కువగా కనిపిస్తుంది. శైలి బహుప్రశంసాపాత్రం. ఆదిని చిన్న కథలు చక్కగా వ్రాసిన వారిలో లతీఫుద్దీన్ అహమ్మద్, గోరఖ్పూరువాసి మజ్నూకూడా స్మరణీయులు. ౧౯౩౦లో ఇంకోరకం రచయితలు బయలుదేరేరు. వీ రవలంబించినది వాస్తవికతా (Realistic) మార్గము. ఈ తరగతి రచనలకు మార్గదర్శి ప్రేమ్‌చంద్. ఇతని "ఖాకే పర్వానా" ౧౯౩౧ లో జరిగిన సంచలనా ఫలితం. "ప్రేమ్‌బత్తీస్" అని ముప్ఫయిరెండు కథలు ఈయన రెండు సంపుటాల్లో ప్రచురించేడు. ఉర్దూకథానికలలో మానసికతత్త్వ నిరూపణ, ఔత్సుక్యము (Psychological interest) సృష్టించింది ఈయనే. ఇతని కథలలో పాత్రలూ, వాతావరణం గ్రామ్యజీవనానికి సంబంధించి ఉంటాయి; కథనంలో నాటక ఫక్కీ కనుపిస్తుంది. చక్కని భావధ్వని; అంత్యాలు కరుణరసార్ద్రీభూతాలు; ఎప్పుడూ పాఠకుల మనస్సును కరిగించివేస్తాయి. ప్రేమ్‌చంద్ సుప్రసిద్ధ రచయిత కావడంవల్ల యితని రచనలు (కథలూ, నవలలూ కూడా) ఎన్నో హిందీలోకి, ఆంగ్లంలోకి తర్జుమా చేయబడ్డాయి. ఈయన ౧౯౩౬ లో దివంగతుడైనాడు. ఈయన్ని చాలా దగ్గరగా అనుసరించినవాడు బదరీనాద్ సుదర్శన్. అనుసృతి మరీ అంత మిక్కుటంగా కాక, రచనల్లో కాస్త స్వతంత్రత చూపిస్తే యీయన యింకా పేరు మోసేవా డని నా అభిప్రాయం. యేమయినా ద్వితీయ ప్రేమ్‌చంద్ అని వన్నె కెక్కేడు. ౧౯౩౬లో వర్ధిష్ణురచయితల కోలాహలం (Progressive writers' movement) వచ్చిపడింది. వీరి సమావేశం లక్నో లో జరిగినట్టు జ్ఞాపకం (౧౯౩౬) వీరిది అతివాస్తవికతా మార్గం. ముఖ్యంగా రష్యన్ రచయితల ప్రాబల్యం (Influence) వీరిలో కనుపిస్తుంది. క్రిషన్ చందర్, సజ్జాద్ జహీర్, ఉపేంద్రనాథ్ అష్క్, మంటో అహమ్మద్ ఆలీ నగైరాలు వీరిలో ముఖ్యులు. క్రిషన్ చందర్ రచనలలో కాల్పనిక వాస్తవికతామార్గాలు మిళితమయి ఉంటాయి. కథాప్రారంభం కాల్పనికంగా అవుపిస్తుంది; అంత్యానికి వచ్చేసరికిమాత్రం శుద్ధ వాస్తవిక వాతావరణమే కథారచనలో మిక్కిలి ప్రసిద్ధికన్న వా డీయన. శైలి లలితమయి మనోహరంగా ఉంటుంది. మంటోవి చాలావరకు రష్యన్ కథలకు తర్జుమాలు. ఈయన గణికజీవనాన్ని, వారి వృత్తినీ గురించి అనేకకథలు వ్రాసేడు. చాలావరకు ఆత్మానుభవాలే యితని కథావస్తువు. గర్హితమయిన వృత్తి నవలంబించినా వేశ్యాహృదయంలోకూడా ఒక లలిత భాగం ఉంటుందనీ, అది కేవలం అవ్యాజప్రేమ పూరితమనీ యీయన సూచిస్తాడు. ఈశ్రేణిలో పేరు మోసిన షాహిద్ ఇస్మత్ లతీఫ అనే స్త్రీరచయితను గూడా యిక్కడే చెప్పాలి. అతివాస్తవికతలో యీమెది ఆరితేరిన చెయ్యి. ఈమెకథలు సంఘం మీద ఎప్పుడూ ఒక విసురు విసురుతూనేఉంటాయి. నూటికి తొంభైపాళ్లు యీమె Sex – కళగురించి

వ్రాయడమే కాకుండా, యౌవనంలో కలిగే దురభ్యాసాల సమస్యావిష్కారం బయలుదేరదీసింది కూడాను. కథలలో యిటువంటి సమస్యావిష్కారం చెయ్యడంలో యీమెదే అగ్రతాంబూలం. అహమ్మద్ ఆలీకూడా ఈ ధోరణిలోనే వ్రాసేడు. (పంజాబు దేశంలో స్త్రీల సంఖ్య పురుషుల సంఖ్యకన్నా చాలా తక్కువనీ, అంచేత యువకులలో చాలావరకు అవినీతి కలదనీ యిచ్చట జ్ఞాపకం చెయ్యవలసివుంటుంది.) ఉర్దూ కథానికారచయితల్లో సర్వజనామోదంగా వ్రాసినవారు (ప్రేమ్‌చంద్ క్రిషన్ చందర్ వినా) ఫయ్యాజ్ మహమ్మద్, రజేందర్‌సింగ్ బేడీలు. ఆంగ్లరచయిత థామస్ హార్డీ (Thomas Hardy) లో లాగ మహమ్మద్‌లో స్థానికవాతావరణం (Punjabi Local colour) కనిపిస్తుంది ఉద్ధృతంగాను. కేవలం యీ ప్రత్యేకతకోసమనే తను ఉర్దూలో వ్రాస్తూన్నా యీయన పంజాబీలోకోక్తులు మిక్కుటంగా వాడుతాడు. మహమ్మదీయ సాంసారికజీవనం యీయనకథావస్తువ; తత్ప్రదర్శనం అతినిరాడంబరమయిన శైలితో, సంఘాచారాల్లో వున్న గుణదోషవిమర్శనలతో యింపుగా ఉంటుంది. రజేందర్‌నాథ్ బేడీకథలలో అమాయికత్వం (దివ్యత్వం) మూర్తీభవించింది. సారస్వతరచన ఒక లలితకళ అనీ, తదాశయం నిర్దుష్టమయిన సౌందర్యాన్ని, ఆనందాన్ని నివేదించడమేననీ అన్న నిర్వచనంప్రకారం అయితే యీయనకథలు ఆ నిర్వచనానికి లక్ష్యంగా వుంటాయి

కాని ఈరోజుల్లో ఉర్దూలో చిన్నకథలు వ్రాయడం అంటే మోజు చాలావరకు తగ్గినట్టు కనబడుతుంది. ప్రసిద్ధులయిన ఆఖ్యాయికా రచయితలు యిటీవల నవలా రచయితలుగా మారుతున్నారు. సమస్యా విష్కరణానికి నవలల్లో ఉన్నంత తావు చిన్నకథలలో లేకపోవడమే బహుశా యిందుకు కారణం అని నా అభిప్రాయం. కాగా, పైని చెప్పినవారంతా ఎన్నో చిన్నకథలు వ్రాసి ఆవిధంగా మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నారు. యిప్పుడు రచనాపద్ధతిలో ఒకమార్పు అవసరమని వారికి తోచిందేమో!

## తెలుగు చిన్నకథలు

గద్యకవిబ్రహ్మగారు తడిచిచూడని వాఙ్మయరూపం లేదు. కథలకుకూడా వారు పెట్టినదే వొరవడి. శైలీసారళ్యం వీరిచేతుల్లో పరిపక్వమయింది. చిన్నకథలు వ్రాసినవారిలో శ్రేష్ఠులు శ్రీ చింతా దీక్షితులుగారు. వీరి కథలలో ఆంధ్రత్వం ఉట్టిపడుతూ వుంటుంది. చిన్న పిల్లల అమాయిక మనస్తత్వాన్ని, హృదయ సౌకుమార్యాన్ని వీరు నివేదించినట్టుగా యింకెవ్వరూ నివేదించలేదనడంలో అతిశయోక్తి లేదు. ("సూరి - సీతి - వెంకి" అన్న కథ చూడండి) శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారివి ప్రౌఢరచనలు. భావగభీరత బాగా కనిపిస్తుంది. వీరి "వీరవల్లడు" యీ మధ్యనే నిసర్గ ఆంధ్ర తేజస్సుని సాక్షాత్కరింపజేసింది. గ్రామ్యజీవనం అంటే వీరికి మిక్కిలి అభిమానం. శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారిని గురించికూడా ఇక్కడే చెప్పాలి. వీరి రచనల్లో గల దర్జా, భావంలో ఉన్న ఉన్నతమయిన అంతస్తూ, భావనాపథనిర్దుష్టతా గురించి వేరే వ్రాయ నక్కరలేదు. శైలి మదగజం లాగు నడుస్తుంది. శ్రీమంతుల యింటి వ్యవహారాలూ, పసిపాపలంటే స్త్రీకి సహజమయిన అవ్యాజానురాగమూ, గొప్ప యింటి జమానుల ఔదార్యబుద్ధీ యెంతయినా చక్కగా చిత్రించేరు వీరు "బిందుగారబ్బాయి"లో. (చూడండి: సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు ౧౯౪౩ భారతి) తరువాత చెప్పవలసినవారు శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు, గుడిపాటి వెంకటాచలంగారు, "వెం. చా. శా." మొదలయినవారు.

మునిమాణిక్యంవారి కథలు ఆకర్షించని హృదయం ఉండదు. వీరి రచనల్లో "కాంతా"నికి ఒక ప్రత్యేకత అబ్బింది. కథావస్తువ మామూలుగా మన యిళ్లల్లో జరిగే గృహకృత్యాలే (storms in a tea cup)! వీరి పాత్రలు—అంటే తనూ, సతీమణిన్నీ— అచ్చంగా మధ్యతరగతికి చెందివుంటాయి. అలాగని వీరి ఏ కథా విసుగు పుట్టించదు; కాగా, మరొకటీ యింకొకటీ చదువుదా మనే వుంటుంది. "మేరీ ఔరత్" (౧౯౪౩ సెప్టెంబరు భారతి) చూడండి.

చీరను గురించిన చీలికయ్యాం ; యింట్లో మేస్త్రరుగారి మీద పెద్ద నేరారోపణ. చివరకి తన శిష్యుడే ఒకడు పగుపుమట్ట చీరతోసహా తెచ్చి వప్పచెప్తాడు. ఇల్లాలి ముఖం చేటంత అవుతుంది; ధోరణి మారిపోతుంది. కష్టాకాఫీతో సమాప్తం. కథ పూర్తిఅయ్యేసరికి తప్పనిసరిగా చిరున వ్వొస్తుంది. నిష్కళంకమయిన ఆనందం జనిస్తుంది. గృహస్థాశ్రమంలో వుండే మార్దవసౌందర్యాలు కళ్లకి కట్టినట్టుంటాయి. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు బహుళంగా కథానికలు వ్రాసేరు. వడ్లగింజలు, తల్లిప్రాణం, కలంపోటు—యివి వీరి ఉత్తమరచనల్లాగ కనిపిస్తాయి. "వడ్లగింజ"ల్లో కథావస్తువు చదరంగపు మోజు. తంగిరాల శంకరప్పనీ, చదరంగంలో అతనికి ఉన్న ఆసక్తీ, నిపుణతా మరిచిపోలేను. "కలంపోటు" పారిజాతాపహరణంలో ఉన్న "నను భవదీయదాసుని మనంబున నెయ్యపు గిన్క బూని తాచిన యది మన్ననయె" అన్న పద్యం, తద్ద్వారా రాయలవారి మనస్సులో జనానా విషయమయి కలిగిన దని చెప్పే పరివర్తనంమీద ఆధారపడి వుంది. ఈయనలో ఉన్న గొప్పవిశేషం ఏమిటీ అంటే, తను ఎలాంటి కథ వ్రాసినా దానికి అనుగుణమయిన చక్కని వాతావరణాన్ని కల్పిస్తాడు. అంచేతనే యీయనకథలలో ఫలానా దానికన్నా ఫలాని కథ ఎక్కువ బాగుంది అని ఎన్నికగా చెప్పడానికి తావు తక్కువ. అన్నీ బహుహృద్యంగా వుంటాయి. వడ్లగింజలూ, కలంపోటూకన్నా భిన్నాలయిన కథావస్తువ లుండవు. అయినా ఒకదాన్ని మించినది ఒకటిగా వున్నాయి. వీరి శైలి ప్రత్యేకించి అభినందనీయం; వర్ధిష్ణురచయితలకు మార్గదర్శికూడాను.

ఈపైని చేసిన విమర్శనము స్థాలీపులాకన్యాయమాత్రంగానే చేసేను.

## అసలు చిన్నకథ అంటే ఏమిటి?

ఉర్దూలో లాగ కాకుండా మన భాషలో యిప్పుడు చిన్నకథలంటేనే ఎక్కువ మోజుగా ఉంది. అసలు కథానిక నిర్వచనం ఏమిటో చూద్దాం. వచనంలో ఉండి, అరగంట మొదలు ఒకటి రెండు గంటలలో ముగిసే కథలు చిన్నకథ లన్నాడు ఎడ్గార్ అలన్ పో (Edgar Allen Poe). ఏకబిగిని (స్వల్పకాలంలో) ముగిసేవి చిన్నకథలని పైనిర్వచనానికి వ్యాఖ్యచేసేడు హడ్సన్ (Hudson). పై నిర్వచనంగాని, తద్వ్యాఖ్యగాని సమగ్రంగా లేకపోయినా కథానికల ముఖ్యగుణమయిన సంకుచితపరిమితిని తెలుపుడుచేస్తున్నాయి. నేటి సారస్వతసూత్రాలప్రకారం ఆఖ్యాయికారచనకు కొన్ని ప్రత్యేకనియమా లున్నాయి. అవి పాటిస్తే నేగాని వీనిలో శిల్పం ప్రపూర్ణతను పొందనేరదు. స్థూలదృష్టితో చూస్తే, నవలలూ-కథల పొలిమేరలు — శాస్త్రరీత్యా (technical గా) యివి యెంత భిన్నాలయినా—"మిన్ను లుపడ్డచోటు" లాగ కొంత కలిసేవున్నట్టు కనుపిస్తుంది. ఈ రెంటింటిలోనూ కథే ప్రధానం. ప్లాటు, పాత్రపోషణా, వస్తునివేదనాచమత్కృతీ, సరళశైలీ, స్వభావోక్తీ, ధ్వనీ, రసస్ఫూర్తీ మొదలయినవి యీ రెండు సారస్వత రూపాల్లోనూ ఉండవలసినవే. కాని చిన్నకథ కొద్దిపేజీలలో కుదించిన పెద్దకథ కాని, నవలగాని మాత్రం కాదు. నవలకూ చిన్నకథలకూ ఉన్న భేదాలు, ప్రస్తుతకాలంలో చిన్నకథల ప్రాముఖ్యతకు గల కారణాలు కొన్ని యిదివరలోనే వ్రాసేను (౧౯౪౪ సెప్టెంబరు భారతి చూడండి).

చిన్నకథయొక్క ముఖ్యలక్షణాన్ని సులువుగా చెప్పొచ్చు. కథావస్తువను సంకుచితపరిమితిలో పూర్ణంగానూ, ఆకర్షణీయంగానూ తీసుకురావాలి. ఈవిషయంలో కృతకృత్యత సిద్ధించిందా లేదా అన్న ప్రశ్నకు పాఠకహృదయంలో దీనివలన కలిగిన సంచలనమే సాక్షీభూతం అవుతుంది. కథావస్తువులోని పరిపోర్టు ఏది అయినప్పటికీ, కథ ముగిసేసరికి విషయంలో సమగ్రభావం స్ఫురించాలి. దీనికి మరికొన్ని అంశాలు చేదోడవుతాయి; అవి కథలోని గమనిక, ధ్వని, రసస్ఫూర్తి - వీటి ఐక్యత. కథలోని ప్రధానాంశం అన్నివిధాలా కేంద్రీకరింపబడాలి అన్న

మాట. ఈ సందర్భంలో నెథేనియల్ హాథార్న్ (Natheniel Hawthorne) పలుకులు స్మరించతగవి: "నిపుణుడయిన రచయిత ఒక ఆకర్షణీయమయిన భావాన్ని అతిపదిలంగా ఎన్నుకుని తదనుగుణమయిన వివరాలను సమకూర్చుకుంటాడు. వీటివల్ల నేతన భావం అన్నివిధాలా సంపూర్ణత్వాన్ని పొందుతుంది. ఎందుచేతా అంటే అనవసరవిషయాలకు యిక్కడ తావులేదుకనక; యిది నవలలో నెరవేరని పని. ఈ వివరాలను ఒక పద్ధతిలోకి తెచ్చి తన భావాన్ని సమగ్రంగా పాఠకహృదయానికి నివేదించలేకపోతే కథకుడు కృతకృత్యుడు కాలేదన్నమాట."

చిన్నకథల పరిమాణం బాగా పరిమితమవడం చేత మొదట్నుంచీ రచనలో చాలా శ్రద్ధ వహించాలి కథకుడు. (నవలలోకన్నా వీటిలో) అత్యవసరంగాని విషయాలు విసర్జించాలి.

ఇంక కథావస్తువు ఎలాటిదై ఉండాలి అన్న ప్రశ్న వస్తుంది. దీనినిగురించి ఇదమిత్థం అని మామూలుగా చెప్పడం కష్టం. పైని చెప్పిన అంశాలు జాగ్రత్తగా పాటిస్తే కథావస్తువ, తదాశయం ఏమయినా అయి ఉండవచ్చును. ఉదాహరణకు మనవిచేస్తాను. శ్రీ దీక్షితులుగారి కథలు కేవలం పిల్లల అమాయకత్వాన్ని, నిష్కళంకమయిన వారిహృదయాన్ని స్పష్టీకరిస్తాయి. మునిమాణిక్యంవారివి సాంసారిక సంబంధంగా వుండి, తరుణవయస్కుల జీవితంలో మార్దవాన్ని నివేదిస్తాయి. రష్యన్ చిన్నకథలలో ప్రధానవిషయం రాజకీయం, ఆకలి, ప్రజాందోళనాన్నూ. నేటి కథా వస్తువులో "యుద్ధం" కూడా కొంత ప్రధానపాత్ర వహిస్తోంది. శ్రీ"జమదగ్ని"గారువ్రాసిన"అమ్మన్న పెళ్లిప్రయత్నం" (భారతి, జూను ౪౪) లో యితరులకు నొప్పికలిగించకుండా ప్రవర్తిద్దామనే బుద్ధీ, దానివలన ఒక అమాయకుడు పడ్డ పాట్లూ బహు రసవంతంగా కొనితేబడ్డాయి. ఇలాగ్గానే శ్రీ చాగంటి సోమయాజులు గారి "ఎందుకు పారేస్తాను నాన్నా?" అన్న కథలో కుర్రవాడికి చదువంటే ఉన్న ఆసక్తీ, అతీక్ష్ణమైన ఆసక్తి తండ్రిమనస్సులో కలిగించిన పరివర్తనగూయిది కథావస్తువు. శ్రీ"రావు"గారి "ప్రతిజ్ఞ" (ఆంధ్ర వారపత్రిక ౧౫-౧౦-౪౪)లో సంఘటన (Incident)కు ప్రాధాన్యం. శ్రీ సి. సూర్యనారాయణగారి "పరలోకం"లో (ఆంధ్రవారపత్రిక ౨౨-౮-౪౪) చక్కని సమస్యావిష్కారం జరిగింది. కథావస్తువ ఏది అయినప్పటికీకూడా బహు మనోరంజకంగా వ్రాయవచ్చునని చెప్పడానికే ఆయాకథలు అక్కడక్కడ నుంచి ఏర్చేను.

ఈ పై సింహావలోకనంవల్ల తేలిన విషయాలు (i) రకరకాలయిన కథావస్తువుతో— కేవలం సాంఘికమయినవి, మనస్తత్వ నిరూపక మయినవి, జీవిత మాధుర్యాన్ని ఆస్వాదింపచేసేవి, ఒక్క సంఘటననేగాని, పాత్రనేగాని ప్రదర్శించేవి, వ్యంగ్యమయినవి, వర్ణనా రసబంధురమయినవి ఆంధ్రకథానికలు అనేకాలుగా వెలువడుతున్నాయి; (ii) నవలారచనకు అట్టే ప్రాధాన్యం లేకపోవడంవల్ల చిన్నకథ అప్రతిహతంగా సాగుతోంది; (iii) ఆంధ్రకథానికలలో శిల్పం పరిపూర్ణత పొంది విజృంభింపగల తరుణం యిది; (iv) కాని, రష్యన్ డచ్చి కథల ప్రాబల్యం ఎక్కువగా కనిపిస్తోంది. ఇందువల్ల సోషలిజం, ఆకలి, కరువు మొదలయిన విషయాలకు సంబంధించి ఉంటున్నాయి కథలు; రచయిత ఎంతో ఆరితేరినవాడయితేనేగాని యిటువంటి కథావస్తువు జుగుప్స కలిగిస్తుంది. ఈ విషయమై జాగ్రత్త అవసరం. ఇంతకన్నా అమెరికను కథానికలను అనువదిస్తే సారస్వత చరితార్థం బావుంటుందేమో! ఏది ఎలాగ ఉన్నా ఎరువు తెచ్చుకోవలసినంత కరువు కనపడదు. తెలుగుసీమల్లోని ప్రకృతి సౌందర్యం, ఆంధ్రజీవనం, తేజస్సులో కావలసినంత వస్తుసామగ్రి ఉంది ఉచితదృష్టితో పరిగ్రహించి నిపుణంగా పనిచేస్తే; (v) క్రొత్త రచయితలలో భావం, కథావస్తువ అభినందనీయంగా ఉన్నప్పటికీ శైలీపాటవం కొంత కొఱతిపడినట్లు తోస్తుంది. బిగి తక్కువ అనడం.

## కథానికలో శిల్పం

ఈ అంశం వ్యాసంలో వ్రాయడం సంగీతం వ్రాసి నేర్చుకున్నట్టుగానే ఉంటుంది. లలితమయిన భావాలు ప్రతీ మానవహృదయానికీ ఒకప్పుడైనా తట్టక మానవు. అటువంటివాటిని అనుభూతంగా ప్రదర్శించడమే రచనలో గల శిల్పం. సున్నితమయిన హాస్యం (Humour), ఒక పరిస్థితి, లేక సంఘటన (Situation or Incident), ప్రకృతి సౌందర్యం వీటిలో యేదివమయినా ప్రధానంగా తీసుకుని, దానికి ఉచితమయిన వాతావరణం కల్పించి, సత్యసౌందర్యాలు ఉట్టిపడేటట్టుగా చిత్రించడమే రచనలో గల శిల్పచాతుర్యం. బిగువు తప్పని శైలి విధిగా ఉండితీరాలి. కథలో సమగ్రభావం కనిపించాలి. అంటే కథ ముగించేసరికి "ఇంక దీనినిగురించి వ్రాయవలసింది అట్టే లేకపోయినా, ఊహించవలసినది ఏదీ వదలెయ్యలే"దనే తృప్తభావం పాఠకులకు కలగాలి. అప్పుడే కథ నిర్దుష్టమవుతుంది. మర్నాడు మెలకువవచ్చినతరవాతకూడా చెదిరిపోని తొలిరాత్రిసుస్వప్నమధురముద్రలాంటి భావం పాఠక హృదయానికి హత్తుకుపోవాలి చిన్నకథలు చదివితే.

## సారస్వతంలో చిన్నకథల స్థానం

కథానికలు నేటి సారస్వతంలో ఒక ప్రరూపం అని మనవిచేసేను. ఇంకా కొన్ని దశాబ్దాల దాకా ఆఖ్యాయికారచన అవిచ్ఛిన్నంగా సాగుతుందనడానికి సందేహం లేదు. ఒక సంఘటనకాని, పాత్ర గాని, అంశంగాని యిందులో కేంద్రీకరించినట్టుగా నవలేతిహాసుల్లో కేంద్రీకరించి ప్రదర్శించడానికి వీలు లేదు. దీని శిల్పమే వేరు ఇంకముందు ఎన్నిక్రొత్త రీతులలో వాఙ్మయరచన సాగినా, ప్రబంధాలలాగ దీని స్థానం ఎన్నటికీ చెడిపోదు. ఇది చిరస్థాయి!



# నీవు తినేదంతా బలమునిస్తుందా?






ప్రతి గృహిణి ఏ ఆహారపదార్థములు శక్తి నిచ్చునవో తెలిసికొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చు వేయబడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలిఉపయోగకరమైన విషయములు గలవు. 4 అణాల బిళ్లలు Dept. D110 P. O. Box 353, Bombay, పంపుడు.



ఔను — ఆహారము బలమునిచ్చును: గాని అన్ని ఆహార పదార్థములు ఒకే విధముగా పుష్టినివ్వవు. కొన్ని బాగా బలము నివ్వగలవు. కొన్ని చాల కొద్దిగా మాత్రమే యివ్వగలవని చెప్పాలి — ఈ కారణంచేతనే ఆరోగ్యంచెడటం సంభవిస్తుంది. సామాన్యముగా బాగా యిష్టమైన ఆహారములు యేమాత్రము బలము నివ్వలేకపోవుటచే వాటిమీద ఆధారపడే వారు పనిపాటలు చేయుటవలనగాని, ఆటలాడుటవలనగాని, అలసట చెందకుండా వుండలేక పోతున్నారు. ఐతే అన్ని ఆహారములు విటమిన్లతోనిండిన డాల్డాతోవండుటవలన మిక్కిలి బలము నివ్వగలవు. డాల్డా ప్రకృతిసిద్ధమైన ఆహారపదార్థములతో కూడినదై మంచి బలమును చేకూర్చి, బలమునివ్వలేని యితర ఆహారముల కొరతను తీర్చగలదు. దీనితో వండినయెడల అన్ని పదార్థములు ఎక్కువ బలము నివ్వగలవు.

**విటమిన్లతోనిండిన**




# నేషనల్ సేవింగ్స్ సర్టిఫికేటు

## ఆత్మ కథ

"* మీ ఆదాలను అత్యంత భద్రంగా జాగ్రత్తపరుస్తాను.

* 12 సంవత్సరాలలో నేను 10 రూపాయలనుంచి 15 రూపాయలవరకు పెరుగుతాను.

* నామీదవచ్చే వడ్డీకి ఇన్‌కమ్‌టాక్సు వెయ్యడానికి వీలు లేదు.

* గవర్నమెంటు నియమించిన ఆథరయిజ్డు ఏజంటులవద్దగాని, సేవింగ్సు బ్యూరోవద్దగాని, పోస్టాఫీసులోగాని మీరు నన్ను కొనుక్కోవచ్చు.

* నా అన్నగారులయిన 50 రూ., 100 రూ., 500 రూ., 1000 రూ.ల సర్టిఫికేట్లనుకూడా మీరు కొనుక్కోవచ్చు. వాళ్లుకూడా నాఅంత వేగంగానే పెరుగెత్తగలరు—అంటే 12 సంవత్సరాలలో 50 పెర్సంటు పెరగడం.

10 రూపాయలకంటె తక్కువ డబ్బు నకు కావాలన్నప్పటికీ నేను మీకు లభ్యం కాగలను. అంటే, రూపాయి, అర్ధరూపాయి, 4 అణాలు ఖరీదులో వున్న సేవింగ్సు స్టాంప్సుకొని క్రమంగా 10 రూ. చేసి నన్ను పొందవచ్చు.

* 3 సంవత్సరాల తరువాత నన్ను యెప్పుడయినా డబ్బు రూపంలోకి మార్చుకోగలరు — మీ మూలధనమును, దానిపై నేను మీకు సంపాదించియిచ్చే వడ్డీని మీరు తిరిగి పొందగలరు...

## —కాని నన్ను ఆవిధంగా వుండనిస్తే మీకే లాభం!"

వాటిని ప్రభుత్వం నియమించిన అధరయిజ్డు ఏజంటులవద్దగాని, సేవింగ్సు బ్యూరోలలోగాని, పోస్టాఫీసులలోగాని కొనుక్కోండి

# నాగ-లింగ ప్రతిమలు

## వాటి ఆరాధన



= శ్రీ దిగవల్లి వేంకటశివరావు =

జీవజంతువు లన్నింటిలోను సూక్ష్మబుద్ధి గలట్టిది, అతిత్వరగాను సొంపుగాను జరిగిపోవునట్టిది సర్పము. తక్కిన జంతువుల కుండే కాలుచేతులు దానికి లేవు. దానికి నడకపద్ధతియే లేదు. దాని శరీరము అతిలావణ్య మైనది; వన్నెచిన్నెలు గలట్టిది. కృష్ణసర్పముయొక్క యొయ్యారము అందరు చూచుచున్నదే. అది చిరంజీవి. చాలాకాలము ఆహారమే లేకుండా జీవించగలదు. వాయుభక్షు లంటే మనవారికి చాలా గౌరవం. సర్పం అలాంటి సంప్రదాయం లోనిది. అన్నిటికన్నను విశేషమైన లక్షణము తన విషముచేత ఇతరజంతువులను అవలీలగా చంపగల శక్తి. అమానుషములైన ఇన్ని శక్తులు గల సర్పము మనుష్యులచేత పూజింపబడుటలో ఆశ్చర్యం ఏమున్నది? ప్రపంచములో చాలా దేశాలలో సర్పము నొక దేవతగా ఆరాధిస్తున్నారు. ముఖ్యముగా జుడెయా, ఫొనీషియా, మెసపొటేమియా, గ్రీసు, ఇటలీ, స్కాండినేవియా, బ్రిటీషుదీవులు, ఆఫ్రికా, అమెరికా, పారశీక, కాశ్మీర, దేశాలన్నిటిలోనూ సర్పము నారాధించిన చిహ్నములు నేటికిని కనబడుచున్నవి.

భారతదేశమునకు ఆర్యులు వచ్చునాటికే దేశమంతటను నాగులను ఆరాధించే నాగరికప్రజ లుండినట్లు చరిత్రాధారము లున్నవి. ఆర్యుల సంపర్కము వలన నీదేశములోని పూర్వపు ప్రజల సాంఘిక మతాచారవ్యవహారములలో చిత్రవిచిత్రములైన మార్పులు కలిగిన నిదర్శనములు కనబడుచున్నవి. ఉత్తర హిందూస్థానములోను, దానికి తూర్పున బర్మా అనే బ్రహ్మదేశములోను, దానికి తూర్పున సయా మనే శ్యామదేశములోను, కాంబోడియా అనే కాంభోజ దేశములోను, దక్షిణ హిందూదేశములోను, సింహళ ద్వీపములోనుకూడా ఈ నిదర్శనములు కనబడుచున్నవి. బౌద్ధమతము స్థాపించబడునాటికి సింహళ ద్వీపములో నాగులను పూజించే జాతి ఉండేదని బౌద్ధగ్రంథమైన "మహావంశము" తెల్పుచున్నది.

బౌద్ధమతమునకును, జైనమతమునకును సంబంధించిన గాథలలో నాగపూజకు సంబంధించిన కథ లున్నవి. ఈ మతములవారు చెక్కించిన శిల్పములలో నాగములు కనబడుచున్నవి. మన గుంటూరుజిల్లాలో బౌద్ధమతానికి పట్టుకొమ్మగా నుండిన అమరావతిలో బుద్ధప్రతిమలతోపాటు నాగప్రతిమలుకూడా ఉన్నవి. చెన్నపట్నానికి ౪౦ మైళ్ల దూరములో నున్న మహాబలిపురములోకూడా బౌద్ధచిహ్నములతోపాటుగా నాగప్రతిమ లున్నవి. (**Manual of the Administration of Madras Presidency. C. D. Maclean, vol I, P. 72**).

క్రీస్తుకు మూడువేల సంవత్సరముల పూర్వము సింధునదీతీరమున వర్ధిల్లిన నాగరకచిహ్నములు త్రవ్వియెత్తబడిన మొహెంజోదరో, హరప్పలలో కూడా సర్పారాధనకు సంబంధించిన చిహ్నములు కనబడుతున్నవి. హరప్పలో ఒక ముద్రికపైన రెండు నాగములు పెనవేసికొనియుండగా వాటికి పైగా ఒక

పుష్పసుగన్నా, ఈ దృశ్యానికి రెండుప్రక్కలను రెండుసై పులకు తిరిగియున్న రెండు మేకలును గల ప్రతిమ యొకటి యున్నది. (Survivals of Harappa Culture—T. G. A. Aravamudan, P. 24.)

ఈ సర్పారాధన మనేది మంగోలియా తురేనియా జాతిప్రజల మతము. ఈ సర్పారాధనము హిమాలయపర్వతముల కావల నున్న 'టిబెట్టు' అనబడే త్రివిష్టపదేశము, బర్మా అనే బ్రహ్మదేశము, సయామనే శ్యామదేశము మొదలైన మంగోలియా తురేనియా జాతుల ప్రజలు గల దేశాలకు సంబంధించినదేగాని భరతఖండములోని ద్రావిడజాతికి సంబంధించినది కాదు. అయినప్పటికీ సర్పారాధన మన ప్రజాజీవనంలో బాగా అల్లుకొనియున్నది నాగులచవితి, సుబ్బారాయుడిషష్ఠి మొదలైన దినములలో నాగుల నిప్పటికీ ఆరాధిస్తున్నారు. సుబ్రహ్మణ్యం మొదలైన పుణ్యక్షేత్రములలో సర్పమునే దైవముగా ఆరాధిస్తున్నారు. అని కులాలలోను స్త్రీపురుషులకు నాగుల పేర్లు వ్యవహరిస్తున్నారు. నాగయ్య, నాగమ్మ, సుబ్బమ్మ, సుబ్బయ్య మొదలైన పేర్లు సర్వసామాన్యములైనవి.

ఈదేశములోని చిత్ర మేమనగా ఆర్యుల వైదికధర్మము తక్కిన ధర్మాలను తనలో లీనము చేసికొని దేశములోని ఆచారవ్యవహారములలో ఏవి సనాతనములో, ఏవి అధునాతనములో తెలిసికోవడానికి వీలు లేనంతటి మార్పులు కలిగించినది. భారతదేశములో ఎన్నివిధములైన మతాచారవ్యవహారములు కనబడుతున్నను, ఎన్ని సంప్రదాయములు కనబడుతున్నను భగవంతుని యెన్ని పేర్లతో పేర్కొన్నను సృష్టిస్థితిలయకారుడైన పరమేశ్వరు డొక్కడే యనే పరమార్థము మాత్రము అన్నిటిలోను కనబడుతున్నది. ఇది సనాతనధర్మముయొక్క ప్రభావము.

## పురాణగాథలు

సర్పజాతినిగురించిన పురాణగాథలవల్ల కొన్ని విశేషములు తెలియుచున్నవి. కశ్యపప్రజాపతి మరీచుని కుమారుడు; సూర్యుని మానసపుత్రుడు. ఇతడు పుత్రసంతానమును గోరి కళము (మద్యము)ను త్రాగగా దక్షు డితనిని శపించినాడు. ఇందుకు బ్రహ్మ కోపించి దక్షుని తన కొమార్తెలను కశ్యపుని కిమ్మని ఆజ్ఞాపించినాడు. కశ్యపుడు దక్షపుత్రికలైన అదితి, దితి, దనువు, పృథ, విశ్వ, వినత, కద్రువ మొదలైనవారిని పెండ్లాడి సృష్టిని పెంపొందించినాడు. దేవతలు, దానవులు, నరులు, మృగములు వృక్షములు కశ్యపుని సంతానమే యని భారతము చెప్పుచున్నది

కశ్యపప్రజాపతిభార్య కద్రువకడుపున వేయి సర్పములు పుట్టినవి. శేషుడు, వాసుకి, ఐరావతము, తక్షకుడు మొదలైనవా రీమెపుత్రులు. కద్రువసవతియైన వినతను కద్రువ వంచించి ఆమెను దాసిగా చేయగా వినతకొమారుడైన గరుత్మంతు డమృతము తెచ్చి ఆమెదాస్యవిముక్తి చేసినాడు. కద్రువ చేసిన అన్యాయమునకు శేషుడు అసహ్యపడి ఇలువెడలిపోయి బ్రహ్మనుగూర్చి తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమై 'నీవు భూభారమును వహింపు'మని శేషునికి చెప్పి యాశీర్వదించినా డని భారతము చెప్పుచున్నది.

శేషుడు స్వర్గములో మహావిష్ణువుద్వారమును కాచుచుండేవాడు. వాయువుతో పోరాడి ఓడినాడు. శేషుడు మేరుపర్వతముయొక్క కుమారుడైన వెంకటాద్రిని జుట్టుకొనియుండగా వాయు వాపర్వతమును దూరముగా విసిరివేసినాడు. శేషు డాపర్వతముపైననే యున్నందున అది శేషాద్రి యైనదని వెంకటాచల మాహాత్మ్యము. (అనిశేషు డనగా ఆద్యంతములు లేనివాడు.)

ఉలూచి యొక నాగకన్య. అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ ఒక కొలనులో స్నానము చేయుచుండగా ఉలూచి చూచి మోహించి యాతనివలన ఐరావంతు డను పుత్రుని బడసిన దని భారతము. ఆర్యులు నాగులతో సంబంధబాంధవ్యము చేయుటను, ఆర్య నాగరకత నాగులనాగరకతను తనలో లీనముచేసికొను

టను ఈకథ సూచిస్తున్నదని కొందరి యూహ. భూమికి, సూర్యచంద్రులకు సంబంధించిన సర్పగాథ గ్రహణములను కలిగించే రాహుకేతువుల పుట్టుకకథ. కద్రువ కుమారుడైన వాసుకి యనే మహాసర్పమును త్రాడుగా జేసి, మందరపర్వతమును కవ్వముగా జేసి, దేవదానవులు క్షీరసముద్రమును మథించగా అమృతము పుట్టినది. దానికొరకు దేవదానవులు పోరాడుతుండగా శ్రీ మహావిష్ణువు మోహినీరూపమును ధరించి దానిని పంచుతానని చెప్పి దేవతల నొక పంక్తిలోను, దానవుల నొక పంక్తిలోను కూర్చుండబెట్టి ముందుగా దేవ

దానిని పంచియిస్తూవుండగా రాహు వనే దానవుడు దేవతావేషము ధరించి వారి పంక్తిలో కూర్చున్నాడు. ఈసంగతి సూర్యచంద్రులు చెప్పగా విష్ణువు తన చక్రాయుధంతో రాహువుతల ఖండించాడు. అమృతం సోకినందువల్ల తల, మొండెము వేరైనను సజీవమై సర్పరూపంతో రాహువుకేతువులుగా నుండి గ్రహణములలో సూర్యచంద్రులను మ్రింగుతూవుంటాడు. ఇవి ఛాయలని జ్యోతిశ్శాస్త్రము.

## సర్పచిహ్నము

సర్పము భారతదేశములో బుధచిహ్నంగాను, ఈజిప్టు దేశంలో హెర్మీసుచిహ్నంగాను, గ్రీసు దేశంలో మెర్క్యురీచిహ్నంగాను ఉన్నది. బుధు డొక గ్రహము. బుధుడు చంద్రాంశమున జన్మించినవాడు. బుధుడు బృహస్పతి భార్యయైన తారయందు చంద్రునికి పుట్టిన కుమారుడు. చంద్రుని భార్య రోహిణి బుధుని పెంచినది.

వైవస్వతమనువు పుత్రసంతానము కోరి యజ్ఞము చేయగా 'ఇల' అనే కొమార్తె పుట్టినది. వసిష్ఠుడు ప్రార్థింపగా ఇల పురుషుడై సుద్యుమ్నుడని వ్యవహరింపబడినాడు. అతడు ఒక కొలనులో స్నానము చేయగా శాపమువలన మళ్లీ స్త్రీయై ఆమె 'ఇల' అని వ్యవహరింపబడినది. పైవిధముగా ఆమె వైవస్వత మనువు కూతురు. ఆమె చాలా రూపసి. బుధుడామెను చూసి యింటికి తీసికొనిపోయి భార్యగా స్వీకరించినాడు. వారికి పురూరవుడు జన్మించినాడు. బుధుడు తపస్సు చేసి గ్రహపథమందు నిలిచినాడని భాగవతము.

ఇలాదేవి మనువుకుమారుడైన ఇక్ష్వాకు కుమార్తెయనిన్ని, సర్పరూపమున నున్న బుధు డామెతో రమింపగా మనుష్యజాతి పుట్టినదనిన్ని ఇంకొక పురాణగాథ యున్నది.

పైన చెప్పిన విధముగా చంద్రాంశమున జన్మించిన బుధుడు మానవుల బుద్ధితత్వమునకు అధిదేవత యైనాడు. జీవజంతువులలో కెల్ల సూక్ష్మబుద్ధియైన సర్పమే అతని చిహ్నమైనది. 'సర్ప'మనే మాటకు కొల మనికూడా అర్థమున్నది.

మానవుని మనస్సు, శరీరముల బంధమును విడగొట్టి ఆత్మను పరమాత్మతో ఐక్యము జేయుట కేర్పడిన యోగసాధనలో నుత్తేజింపబడవలసిన కుండలినీ శక్తికికూడా సర్పమే చిహ్నముగా చేయబడినది.

## కుండలిని స్వరూపము

యోగసాధకులు సర్పాకారము గల కుండలినీ శక్తినిగురించి చెపుతారు. మనుష్యుని శరీరములో వీణాదండమునకు రెండు ప్రక్కలను ఇడ, పింగళ అను నాడులును, మధ్య సుషుమ్న పొరు సన్నని కాలువయున్నూ ఉన్నవి. ఈ సుషుమ్న కాలువకు క్రిందిభాగమునకు చివర యోగులు చెప్పే కుండలిని యున్నది. ఈ కుండలిని మూలాధార మనే చక్రమున ఉంటుంది. అందులో కుండలిని యనే మహాశక్తి సర్పములాగ చుట్ట చుట్టుకొని ఉంటుంది. దాని పడగ ముడుచుకొని ఆచుట్టక్రింద అణగివుంటుంది. యోగసాధనచేత ఈ శక్తిని మేలుకొలుపగా నది సుషుమ్న కాలువ ద్వారా క్రమేణ పైన గల చక్రము లన్నిటిని దాటి పైకిపోవుటకు దారి చేసుకొన ప్రయత్నిస్తుంది. ఇది ఊర్ధ్వాభిముఖియై పైకి పోవుకొలది మెల్లమెల్లగా సాధకుని మానసపుపొరలు వీడి పలువిధములైన దివ్యదృశ్యములును, అద్భుతశక్తులును కలుగుతవి. చివర కీశక్తి మెదడులో సహస్రార

చక్రమున జేరగానే సాధకుని శరీరమానసములతోడి బాంధవ్యమును త్రెంపి ఆత్మకు స్వేచ్ఛను చేకూర్చి పరమాత్మతో ఐక్యం చేస్తుంది. (చూ : వివేకానందుని రాజయోగము, పుట ౫౭.)

## సూర్యారాధనము – లింగప్రతిమలు

మన పూర్వ ఋషులు సూర్యదేవుని పెక్కు రూపములతో వర్ణించియున్నారు. అతడు సకల దేవతా తేజః పుంజరూప మైయున్నందువల్ల అలా వర్ణించియుండడంలో ఆశ్చర్యం లేదు. ఋగ్వేదము నందు దేవతా తత్త్వవేత్తలైన మేధావు లాదిత్యునే ఇంద్రునిగాను, మిత్రునిగాను, వరుణునిగాను, అగ్నిని గాను, దివ్యుడు సుపర్ణుడు నైన గరుత్మంతునిగాను, యమునిగాను, మాతరిశ్వునిగాను జెప్పుచున్నారు. పృథివీస్థానము, అంతరిక్షస్థానము, ద్యుస్థానమునను గల దేవతాత్మత్వ మాదిత్యుని కారోపింపబడినది. (చూ : శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి సంస్కృత వాఙ్మయచరిత్ర, ౧-వ భాగం పుట ౧౦.)

మన స్తవములందు సూర్యభగవాను డుదయమున బ్రహ్మస్వరూపుడును, మధ్యాహ్నము మహేశ్వర స్వరూపుడును, సాయంత్రము సదా విష్ణు స్వరూపుడు నని వర్ణింపబడినాడు. విష్ణు వనగా సర్వవ్యాపి.

సూర్యుడుకూడా అదితి కశ్యపుల కుమారుడేనని బ్రహ్మాండపురాణము చెపుతున్నది. బుధుని భార్యయైన ఇల సూర్యుని మనుమరాలు.

ఒక్క భారత దేశంలోనే కాదు, ప్రపంచములో క్రీస్తుకు పూర్వము రెండువేల సంవత్సరముల కిందట నాగరికతననుభవించిన సిరియా దేశంలోకూడా సూర్యుడు 'బాల్' అనే పేరుతో ఆరాధింపబడేవాడు. అక్కడను, మన దేశమున గంగాతీరమునకుగూడా సూర్యభగవానుని చిహ్నములుగా లింగాకారము గల శిలా స్తంభములు నెలకొల్పబడి దానికి సంబంధించిన ప్రతిమారాధనము, అర్చనలు, కార్యకలాపములు వర్ధిల్లినట్లు చరిత్రాధారములు కనబడుతున్నవి. ఋగ్వేదకాలము నాటి ఆదిత్యుడే రుద్రుడుగను, శివుడుగను ఆరాధింపబడినందువల్ల ఈ లింగాకార ప్రతిమలు శివుని బింబములుగా ఆరాధింపబడడంలో ఆశ్చర్యం ఏమున్నది?

## శివలింగము

ఋగ్వేదమునందు ఆదిత్యుడే యగ్నిగా నిరూపింపబడి ప్రచండస్వరూపమున రుద్రుడని పేర్కొనబడినాడు. శివుని పేరు కనబడదు గాని తరువాత శివునికి గల పేర్లు చాలా ఈ రుద్రశివునికి కనబడుతున్నవి. ఈశాను డని, యువను డని, ఉగ్రు డని వర్ణింపబడినాడు. యజుర్వేదములో త్రిపురాసురులను నిర్జించుట చెప్పబడినది. శతరుద్రీయములో నీవర్ణనము లన్నియు క్రోడీకరింపబడినవి. శ్వేతాశ్వతరోపనిషత్తులో శైవసిద్ధాంతము వివరింపబడినది. శివుడు తక్కిన దేవత లందరికంటె అధికు డనే భావము ఇతడు మహాదేవుడని, ఈశానుడని, గిరీశుడని వర్ణింపబడి శివభక్తి బోధింపబడినది. తరువాత రచించబడిన ఉపనిషత్తుల లోను, శైవపురాణములలోను శివునికథలు విపులీకరింపబడినవి.

ఇటీవల సింధునదీ తీరాన మొహెంజోదరో హరప్పలలో కనబడిన క్రీస్తుకు పూర్వము మూడువేల సంవత్సరములనాటి శిథిలములలో నొక ముద్రికమీద కుడిప్రక్క ఏనుగు, ఎడమప్రక్క ఖడ్గమృగమున్నూ ఎనుబోతున్నూ, మధ్య మూడు ముఖముల దిగంబరమూర్తిన్నీ చిత్రింపబడియుండుట చూచి సర్ జాన్‌మార్షల్ బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యంశములను సూచించు పశుపతీశ్వరుడైన శివుని విగ్రహమే యని చెప్పినారు. ఆచ్ఛాదనము లేని పురుషచిహ్నము నొక నిదర్శనముగా జూపినారు. కాని అంతమాత్రముచేత అది అలాగ నిర్ణయించడానికి వీలులేదు. అసలు శివలింగము పురుష చిహ్నమేనా అనేది ముఖ్యంగా ఆలోచించవలసిన విషయము. ప్రపంచములో కొన్నిచోట్ల స్త్రీపురుషచిహ్నము లర్చింపబడిన వను మాట నిజము. భారతదేశములోకూడా కొన్ని అనాగరక జాతుల వారిలో పురుషచిహ్నారాధన యున్నందుకు నిదర్శనములు కనపడుతున్నవి. శాక్తేయములోని కొన్ని

ఆచారములలో యోనిపూజ మొదలైనవి కనబడు తున్నవి. అందువల్ల శివలింగము పురుషచిహ్నమే యని పాశ్చాత్యవిద్వాంసులు ఊహించినారు. కాని ఈ శివలింగము విష్ణుచిహ్నమైన సాలగ్రామములాంటి రూపరహితమైన చిహ్నమే యైయుండవచ్చునని మన చరిత్రపరిశోధకుల యభిప్రాయము. నిజమునకు ఇతర దేశాలలోని పురుషచిహ్నములవలెగాక భారతదేశము లోని లింగములు చూడడానికే మాత్రము అసహ్యముగా నుండవని భారతదేశమతముల చరిత్రను వ్రాసిన బార్తు (Barth) వ్రాసినాడు. (A Historical Sketch of Saivism, K. A. Nilakanta Sastri, Cultural Heritage of India, Vol. II P. p [illegible]8-34). "స్థాణూ రుద్ర ఉమాపతి" యని శివునకు పేరనిన్ని, స్థాణు వనగా ఎండిపోయిన చెట్టుబోదె యనిన్ని శ్రీ వావిలికొలను సుబ్బారావు పంతులుగారు రామాయణమునకు వ్రాసిన మందర మనే వ్యాఖ్యానములో నుదాహరించియున్నారు. (చూ : బాలకాండ, పుట 33) స్థాణువనగా కొమ్మలు లేని చెట్టుమోడు అనిన్ని, స్థిరమైన దనిన్ని అర్థము.

## ప్రకృతిపురుషారాధనము

స్త్రీపురుషచిహ్నముల ఆరాధనలోకూడా అంత రార్థము లేకపోలేదు. అది ప్రకృతిపురుషారాధనమే యని చాలమంది పరిశోధకుల అభిప్రాయము. ప్రకృతి పురుషులను పరతత్త్వముగా నారాధించుటలో ప్రజలు ప్రకృతియొక్క సృష్టితత్త్వమునకు లింగమును చిహ్నముగా గ్రహించి పూజించుట ప్రారంభించిరి. బుద్ధిమంతులు కేవలసృష్టితత్త్వ మారాధించుటతో తృప్తి చెందక దానికి బుద్ధితత్త్వమును చేర్చి యారాధింపసాగిరి. ఆసందర్భములో సృష్టితత్త్వచిహ్నమైన లింగమునకు బుద్ధితత్త్వచిహ్నమైన సర్పమును జతపరచిరి. దీనికి తార్కాణముగా శివాలయములందు లింగమును జుట్టుకొనియున్న ఇత్తడిసర్పములు నెలకొల్పబడియున్నవి.

మనువుకుమారుడైన ఇక్ష్వాకుపుత్రికయైన ఇలతో సర్పరూపమున నున్న బుధుడు రమించగా మనుష్యులు పుట్టిరనను గాథకూడా దీనినే సూచించుచున్నది. దక్షిణహిందూదేశములో దిగంబరమైన యొక స్త్రీకి తొడకొక పాము చుట్టుకొనియున్నట్లుగా చెక్కబడిన పురాతనశిల్పములు చాలాచోట్ల కనబడుచున్నవి. ఈవిగ్రహము ప్రక్కనే భక్తితో నమస్కరిస్తూన్న ఇంకొక విగ్రహము చలికాలములో ధరించినట్లుగా ఒంటినిండా బట్టలు ధరించినదై యుండును. ఇలాంటి విగ్రహములు కృష్ణాజిల్లాలోకూడా కనబడినవి. ఇవి చాలా పురాతనమైన జైనశిల్పములుగా నెంచబడుచున్నవి. ఈశిల్పములు పైన చెప్పిన గాథలకు అనుగుణ్యములుగా నున్నవి.

ఇటలీదేశములో అగ్నిపర్వతమువలన నాశనమైన పురాతననగరము పాంపేలో 'ఇసిస్' అనే దేవతయొక్క దేవాలయమునుండి తెచ్చిన లింగప్రతిమ యొకటి 'పోర్టిసి' (Portici) లో నున్నది. ఈ లింగమును ఇత్తడిసర్పము చుట్టుకొనియున్నది. అక్కడి యిల్లు చపటామీద ఇలాంటి లింగములే చిత్రింపబడియున్నవి. ముఖ్యముగా పాంపేనగరములో నున్న చిన్న 'ఇసిస్' దేవాలయపు తలుపులమీద లింగములతోరణము, యోని (పానువట్టం) రూపమును ముఖ్యముగా గమనింపతగినవి. అక్కడనే ఇంకొక పైపున ఇలకు ప్రతిరూపమైన 'వీనస్' దేవతతో బుధుని ప్రతిరూపమైన మెర్క్యురీ రమించుచుండుట చిత్రింపబడినది. (Annals of Rajasthan — Tod Vol. I. P. 557).

## శ్రీకృష్ణుడు — బుధుడు

భారతదేశములో శ్రీకృష్ణు నొక యవతారముగా నెంచి పూజించడము ప్రారంభింపక పూర్వము బుధునికే ఆరాధించేవారు. శ్రీకృష్ణమూర్తికూడా బుధుణ్ణి ఆరాధించినట్లు కనబడుతూవున్నది. ద్వారకలో బుధుని దేవాలయం వుండేది. అది యుండిన చోటనే ఇప్పుడు శ్రీకృష్ణుని దేవాలయం నిర్మించబడింది. ఇప్పటికీ అక్కడ బుధత్రివిక్రముడి ఆలయం ఒకటి యున్నది. ద్వారక సౌరాష్ట్రద్వీపకల్పములో

'జగత్ యొక్క అంత' మని ప్రతీతి గల ఒకచోట నున్నది.

గయలో నొక సహాలో కనబడిన శాసనములో "బుధుడైన శ్రీహరి" యని శ్రీకృష్ణ బుధుల యభేదము సూచింపబడినది.

పురాతనములైన పాశ్చాత్య దేవాలయములలో కూడా శ్రీకృష్ణునిప్రతిరూపమైన అపాలో (Apollo) చిహ్నమున్నూ, బుధుని ప్రతిరూపమైన మెర్క్యురీ చిహ్నమున్నూ ఒకప్పు డొక్కటిగానే కనపడుతూ వున్నది.

బుధుడి దగ్గరనుంచి శ్రీ కృష్ణుడు వేదరహస్యములను సంగ్రహించినాడనే భారతీయ పురాణగాథ ఆయా దేశాలలోకూడా ప్రచారంలో నున్నది. శ్రీ కృష్ణుడు గరుడధ్వజుడు. కాళీయుడనే సర్పరాజు (కద్రువకుమారుడు)గరుడునికి వెరచి కాళిందిమడుగులో దాగి దానిని విషకలుషితముగ చేసినాడని శ్రీకృష్ణు డతనిని మర్దించి అతని భార్యలు వేడుకొనగా ప్రాణదానము చేసి పాతాళమున బ్రతుకమని విడిచినట్లు భాగవతమున చెప్పబడినది. శ్రీకృష్ణుడు యదువంశజుడు. ఇతడు భూమండలాధిపతియైన స్వాయంభువమనువు యొక్క మూడవకొమారుడయిన యయాతిసంతతివాడు. మనువుకొమార్తెయైన ఇల, అనగా భూదేవిని చంద్రతనూజుడైన బుధుడు వివాహమాడగా వారి సంతతివాడైన యదువంశజులు మొదలైనవా రందరూ చంద్రవంశమువారైనారు. ఇప్పటికీ ఈచంద్రవంశీయులందరూ బుధుణ్ని పిత్రేశ్వరుడైన దేవునిగా అర్చిస్తున్నారు.

జైనుల మతగ్రంథములవలన కొన్ని విశేషములు తెలుస్తున్నవి. జైనతీర్థంకరుడైన నేమినాథుడి అసలు పేరు అరిష్టనేమి. ఇతడు బుషభదేవుడి ప్రధానపురోహితుడు. ఇతడు శ్రీకృష్ణుని కాలంనాటివాడు. పైగా యదువంశజుడు. ఇద్దరి పేర్లలోను శ్యామలవర్ణము సూచింపబడుచున్నది. అరిష్ట మనే పదములో నీలవర్ణమున్నదని రాజస్థానకథావళిని రచించిన జేమ్సుటాడ్ గారు వ్రాసినారు. (మా : ౧-వ సంపుటం, ౨౦-వ ప్రకరణము.)

## సూర్యచంద్రవంశములు

చంద్రవంశమునకు మూలపురుషుడైన బుధుని భార్య ఇల సూర్యుని మనుమరాలు. అందువల్ల ఆర్యావర్తములోని రాజులందరూ చంద్రవంశజులుగానో, సూర్యవంశజులుగానో ఉండడంలో ఆశ్చర్యం ఏమున్నది? ఈ కారణమువల్లనే సూర్యచంద్రుల ఆరాధనముకూడా జరుగుటలోను ఆశ్చర్యం లేదు. ఈసూర్యచంద్రవంశములకు చెందిన రాజపుత్రులు ఉత్తరహిందూస్థానములో, ముఖ్యంగా రాజపుత్రస్థానంలో బలనాథు డనే సంజ్ఞతో సూర్యునిన్నీ, బుధుడనే సంజ్ఞతో చంద్రునిన్నీ ఆరాధిస్తూ వుండేవారు.

ఒక్క భారతదేశంలోనివారే కాక అరేబియా దేశంలోని దేశద్రిమ్మరులును, తార్తారీప్రాంతములలోని ప్రజలును సూర్యచంద్రుల నారాధించేవారు. ఇంకా ఆరాధిస్తున్నారు.

## శ్రీమహావిష్ణు అవతారమైన శ్రీకృష్ణుడు

ఋగ్వేదములో విష్ణు వొక ప్రత్యేకదేవుడు కాడు. సకలలోకస్రష్ట, కరక్షకుడుగా ధ్యానింపబడిన ఋగ్వేదవిష్ణువు సూర్యుడే. ఋగ్వేదములో భాగనారాయణులని పేర్కొనబడిన దేవతలుకూడా సూర్యుడే. తరువాత పౌరాణికయుగములో వైకుంఠవాసుడగు శ్రీ మహావిష్ణువును గూర్చిన భాగవతభక్తి ప్రబలినది. సాత్వతయాదవవంశీయుడు, వాసుదేవుడు, దేవకీసుతు డని వ్యవహరింపబడి శ్రీమహావిష్ణువు యొక్క అవతారముగా ఎంచబడిన కృష్ణమూర్తివలన నీభాగవతమత మభివృద్ధి గాంచినది. ఛాందోగ్యోపనిషత్తులో దేవకీసుతుడైన కృష్ణుడు ఘోరఆంగీరసుని శిష్యుడుగా పేర్కొనబడినాడు. అతడు భాగవతభక్తిని బోధించినాడు. కొద్దికాలములోనే కృష్ణుడే భగవదవతారముగా పూజింపబడినాడు.

ద్వాపరయుగాంతమున కృష్ణావతారము ప్రవర్తిల్లెనని పురాణములు చెప్పుచున్నవి. క్రీ. పూ.

౧౨౦౦ లో శ్రీకృష్ణు డుండినాడని కొందరి యూహ. ఏది ఎలాగ నున్నా శ్రీకృష్ణుడు చారిత్రపురుషుడే ననిన్నీ, తరువాత అవతారముగా ఆరాధింపబడినా డనిన్నీ కొంతమంది చరిత్రకారులు వ్రాసిన కొన్ని సందర్భములవల్ల కనబడుతున్నది.

మధురాపురము రాజధానిగా మాధురము, శూరసేనము లనే రాజ్యభాగముల నేలు శూరసేను డనే యదువిభుడు మధురకు చుట్టూ ౮౦ మైళ్ల విస్తీర్ణము గల దేశానికి అధిపతి. శూరసేనుని కుమారుడు వసుదేవుడు. అతడు దేవకుని కొమారెయైన దేవకిని పెండ్లియాడి నాడు. దేవకీ దేవికడుపున బుట్టిన ఎనిమిదవ శిశువువలన తనకు మరణము కలుగు నని విని కంసుడు దేవకీదేవిని, వసుదేవుని చెరసాలలో నుంచినాడు. శ్రీకృష్ణుడు కారాగారములోనే జన్మించగా వసుదేవు డాశిశువును మెల్లిగా బయటికి తీసుకొనిపెళ్లి నందునింట వదలగా నత డక్కడ పెరిగి పెద్దవాడై కంసుని వధించి రాజై అవతారపురుషుడైన కథ అందరికి తెలిసిన విషయమే.

శ్రీకృష్ణమూర్తికి వాసుదేవుడు, హరి, నారాయణుడు మొదలైన చాలా పేర్లున్నవి. ఆయన భారత దేశానికి ఏకచ్ఛత్రాధిపత్యము వహించి ౫౬ ఛప్పన్న రాజ్యాలను స్థాపించి అనేక అమానుష కార్యములను చేసి శ్రీమహావిష్ణువుయొక్క అవతారముగా పూజింపబడినాడు.

## వ్రజము

మధురా నగరమును కేంద్రముగా తీసుకొని దానికి ౮౦ మైళ్ల దూరము (వ్యాసార్థము) చుట్టూ గల ప్రాంతమంతా వ్రజము. ఈభూభాగము భారత దేశములోని కంతా సర్వవిధములా శ్రేష్ఠమైనది. అక్కడి భాష వ్రజభాష. ఇది భారతదేశములో కల్లా స్వచ్ఛమైన దేశభాష. తరువాత తులసీదాసు తన రామాయణమానస మనే ఉద్గ్రంథాన్ని ఈ భాషలోనే రచించాడు. శ్రీకృష్ణుని వంశమునకు మూలపురుషుడైన శూరసేనుని పేరునుండి శూరసేని యనే దేశము, భాష పుట్టినవి. ఈ దేశమే వ్రజము. ఈ దేశానికి రాజధాని సురపురి. ఇది మధురానగరానికి దక్షిణముగ యమునాతీరమున నుండేది. దీని శిథిలములను రాజస్థాన కథావళిని సవరించిన టాడ్ గారు కనుగొన్నారు. (చూ: ౧-వ సంపుటము పుట ౫౪౩) శూరసేనరాజ్యపు హద్దులు మనుస్మృతిలో వివరింపబడినవి. క్రీ. పూ. ౩౨౬లో భారతదేశానికి దండెత్తివచ్చిన గ్రీసుదేశపు మహావీరుడైన అలెగ్జాండరు ఆస్థానంలో చరిత్రకారులీ సురపురిని పేర్కొనియున్నారు.

## బృంద

కృష్ణభగవానుని అర్చించే దేవాలయాలు గల బృందావనము యమునానదితీరాన మధురానగరానికి కొన్ని మైళ్ల దూరములో నున్నది.

## యమున

యమునానదికి కాళియమున యనికూడా పేరు. ఆ నది నీరు నల్లగా ఉండేది. యమునానది సూర్యుని శ్యామలపుత్రిక యని జయదేవకవి వర్ణించాడు.

క్రీ.శ. ౧౬౫౮ లో ఢిల్లీ సింహాసనము నధిష్ఠించి ౧౭౦౭ లో దివంగతుడైన మొగలు చక్రవర్తి ఔరంగజేబుకు పూర్వం రెండువేల సంవత్సరాలనుంచి వ్రజములో కృష్ణదేవునారాధనలు మహావైభవంగా జరుగుతూ వున్నట్లు తెలుస్తున్నది.

## మొగలుచక్రవర్తుల కృష్ణభక్తి

మహమ్మదీయ దండయాత్రల కాలంలో శ్రీకృష్ణ భగవానుని ఆరాధన ఒకచోటినుండి ఇంకొకచోటికి జరిగి కాలక్షేపము చేయవలసివచ్చినది. మొగలాయి చక్రవర్తుల కాలంలో ఈ ఆరాధనకు ఇబ్బంది కలుగలేదు. పైగా కొందరు చక్రవర్తులు తమ మతముతో పాటు వైష్ణవమతమునుకూడా ప్రోత్సహించినట్లు చరిత్రాధారా లున్నవి. ౧౫౫౬ నుండి ౧౬౦౫ వరకు చక్రవర్తిగా నుండిన అక్బరుపాదుషాకు జయదేవుడి గీతగోవిందమంటే చాలా ప్రీతి. గీతగోవిందములో రాధాకృష్ణుల శృంగారమును భక్తిపరంగా చెప్పే అర్థం విని ఆనందించి తన్మయుడయ్యేవాడు. అక్బరు చక్రవర్తికి భార్యయైన

ఒక రాజపుత్రస్త్రీవలన జన్మించిన పుత్రుడు జహాంగీరు. ఇతడుకూడా శ్రీకృష్ణభక్తిని, ఆరాధనను ప్రోత్సహించేవాడు. ఇతనికి రాజపుత్రభార్యవలన జన్మించిన షాజహాను చక్రవర్తి సిద్ధహూప్ర వనే సన్యాసివల్ల వైరాగ్యాంతమును నుపదేశము పొందినాడు. శివభక్తులకు, విష్ణుభక్తులకు స్పర్ధలు, విరోధములు బయలుదేరినందువల్ల శ్రీకృష్ణుని ఆరాధన వ్రజదేశమునుండి దేశాంతరమునకు పోయి తలదాచుకొనవలసివచ్చినది. కాని ఉదయపుర రాజపుత్రియైన ఒక రాణియొక్క ప్రార్థనవలన మళ్లీ వైష్ణవమతము, శ్రీకృష్ణభక్తి వ్రజములో నెలకొల్పబడినది. ఇంతలో ౧౬౭౦ లో ఔరంగజేబు చక్రవర్తియై కృష్ణభగవానుని ఆరాధనలు వ్రజములో నెక్కడను జరుగకూడదని నిషేధించినాడు. అంతట మథురలోని కృష్ణదేవుని విగ్రహాన్ని రక్షించడానికి రణరాజసింగుగా రిచ్చిన లక్షరాజపుత్రుల సహాయముతో ఆకృష్ణవిగ్రహాన్ని తీసుకొని కోటరామపురముల మార్గంగా బైలుదేరి పోతూవుండగా 'నాథద్వారము' దగ్గర రథచక్రములు భూమిలోకి దిగి రథము కదలలేదు. అంతట అక్కడనే నాథజీస్వామిని ప్రతిష్ఠించారు. అప్పటినుంచీ అది మహాక్షేత్ర మైనది.

## "ఇందూస్థానము"

శ్రీకృష్ణుడు మురళీధరుడై సంగీతవేదమునకు అధినాథుడుగా నున్నాడు. ఆయన వేణువు వెదురుగొట్టము. ఇప్పు డుపయోగములో నున్న ఛత్తార (చితార్)కు పూర్వ మీ వేణువే వాడుకలో ఉండేది. 'చత్తార్' అనే పదంలోని తార అనేది తీగె అని అర్థం. దీనికి ఆరు తీగ లుంటాయి. 'షట్తార'లోనుంచే 'చత్తార్' వచ్చింది. ఇది ఐరోపాలో వ్యాపించినకథ. చాలా చిత్రమైనది.

గ్రీసుదేశపు సితెర (Cithera) అనే ఆరుతీగల వాద్యమును "అపాలో" అనే దేవుడే మొదట నిర్మించినా డని అంటారు. ఈ సితార భారతీయుల 'ఛత్తార'లోనించే వచ్చింది. దానినుండి ఇంగ్లీషు Cithera, స్పెయినుదేశపు Guitar పుట్టినది. ఈజిప్టుదేశీయులకు స్వరములు ఆరు. గ్రీసుదేశీయులకూ ఆరే. క్రీ. శ. ౧౩-వ శతాబ్దంలో ఒక ఇటలీదేశపు క్రైస్తవసన్యాసి ఏడవస్వరం చేర్చాడు. భారతీయుల సప్తగ్రహాలనుంచి సప్తస్వరాల నేర్పరచుకొన్నారు.

౧౮౧౪ మొదలు కొన్ని సంవత్సరములు రాజపుత్రస్థానములోనే యుండి రాజస్థానకథావళిని రచించిన జేమ్సుటాడ్ భారతదేశములోని వైదికధర్మములను, మతాచారవ్యవహారములను జాగ్రత్తగా పరిశీలించి పురాణగాథలను తరచి పాశ్చాత్యదేశాలలో వీటిని పోలినవన్నీ ఇక్కడనుంచి అక్కడికి వ్యాపించినవే అని నిర్ణయించినారు. హిందుస్థానమునేది నిజంగా "ఇందు"స్థానమే. చంద్రారాధనకు పుట్టినిల్లు గనుక నిది ఇందుస్థాన మైనది. "ఇందు", సిథియా అనేది పూర్వం గంగానదీతీరంనుంచి ఐరోపాదేశంలోని కాస్పియనుసముద్రతీరంవరకూ వ్యాపించియున్నట్లు దృష్టాంతాలు కనబడుతున్నవనిన్ని టాడ్ వ్రాసియున్నాడు

## ఐరోపాలో దేవతార్చన

'పీటర్ సైమన్ పల్లాస్' అనే జర్మనీదేశపు ప్రకృతిశాస్త్రజ్ఞుడు (Naturalist) ఐరోపాఖండములోని వివిధప్రాంతాలను తిరిగి చూసి అక్కడి విశేషాలనుగురించి వర్ణించాడు. ఇతడు బెర్లినునగరంలో ౧౭౪౧ లో జన్మించి ౧౮౧౧ లో దివంగతుడైనాడు. ౧౭౬౭ లో రష్యాదేశపు రాజధానియైన సెంట్ పీటర్సుబర్గులో శాస్త్రపరిశోధనపరిషత్తులో ఆచార్యుడైనాడు. సైబీరియాలోనుండి రష్యాదేశంలోని దక్షిణప్రాంతాలను దర్శించి ౧౭౯౩-౪ మధ్య క్రిమియాలో పర్యటనం చేశాడు. ఇతడు తాను చూసిన విశేషాలను గురించి అనేకవ్యాసాలను వ్రాసి ప్రకటించాడు. అతడు వ్రాసిన సంగతులను టాడ్‌గారు తమ రాజస్థానకథావళిలో ఉదాహరించారు. ఐరోపాఖండంలో వోల్గానది దక్షిణానికి ప్రవహించి కాస్పియన్‌సముద్రంలో సంగమం అయ్యేచోట ఆస్ట్రిఖాన్ అనే మహానగరం ఒకటి వున్నది. అక్కడ భారతీయవర్తకులు నెలకొని

యుండే మన దేవుళ్లను, ముఖ్యంగా శ్రీకృష్ణుని ఆరాధిస్తున్నారు. వారు సింధునదీతీరమునకు దగ్గరగా నున్న ముల్తానుపట్టణంనుంచి అక్కడికి వెళ్లినందువల్ల వారిని 'ముల్తానీ'లని అంటారు. ఈ దేవ రకులు సింధునదీతీరంనుంచి కాస్పియన్‌సముద్రంయొక్క మటితీరంవరకూ బాగా వ్యాపించియున్నారు. బొమ్మలని పల్లాస్‌గారు చిత్రించి ప్రకటించిన [illegible] లోని దుస్తులవల్లకాని, రూపములవల్లకాని వారి జాతీయత యేదైనదీ తెలియడంలేదు. కాని వారిదేవుళ్లు, దేవతలుమాత్రం గంగానదీతీరాన వున్న పుణ్యక్షేత్రాల లోనివానివంటివే. ఆస్ట్రిఖానులోని భారతీయులపేట (Indeskoi Dev:r) లో నున్న ముల్తానీల దేవతార్చనలో జగన్నాథస్వామి, రాములవారు, ఆయనతమ్ముల విగ్రహాలు వెనక నుండగా శ్రీకృష్ణ భగవానుని విగ్రహము ముందున్నది. మధ్య శివుడును, అష్టభుజములు గల దేవివిగ్రహము నున్నవి. ఈమధ్య వరుసలో కృష్ణుని మురళి యున్నట్లు పల్లాసువ్రాతవల్ల తెలుస్తున్నది. అయితే అతఁ డామురళి నొక దండ మన్నాడు. ఈ దేవతార్చనలోని ప్రధానవిగ్రహమును పల్లా సీవిధంగా వర్ణించాడు:

"మధ్య గుపలెడ్షి (Gupaledshi) అనే పేరు గల పెద్ద 'bonnet' 'కుల్లాయి' ధరించిన చిన్న విగ్రహ మున్నది. దాని కుడిప్రక్క ఒక నల్లని పెద్ద రాయి ఉన్నది. ఎడమప్రక్కను హిందువులు పవిత్ర మని ఎంచే గంగానదినుంచి తెచ్చిన అదేరంగు చిన్న రాళ్లు మరిరెం డున్నవి. ఇవి (సాలిగ్రామ) శంకరు లనే రకమువి"

[illegible] టాడ్‌గారి [illegible] గుపాలెడ్షి [illegible] అని వ్రాసి [illegible] గోపాలదేవ. ఈ విగ్రహము [illegible] ప్రతిగ్రహమే. విగ్రహంయొక్క [illegible] కుడివైపులో నృత్యము చేసే [illegible] [illegible] కృష్ణునికన్న [illegible] వున్నవి. ఆఖరికి చేతిలోని చక్కాయుధముకూడా కనిపిస్తున్నది. గోవర్ధనగిరికూడా కనబడుతున్నది. [illegible] పేరొక్కన్న నల్లనిరాళ్లు శివపురాణమందు [illegible] ప్రశంసితములైన సాలిగ్రామములే.

"పల్లాస్ వ్రాసినదానిలో 'నందిగణగోర' అనే పదా లున్నవి. మొదటిది సింహవాహనమనిన్ని, రెండవది ఒకపురుషదైవమనిన్ని అతడు పొరపాటుపడ్డాడు. ఇవి పరమశివుని నందివాహనమును, పరదేవతయైన గౌరివిగ్రహము నని మనము సులభముగా గ్రహించగల్గుచున్నాము. పల్లాసుగారిలాగనే ఇతరచరిత్రకారులును, గ్రంథకర్తలును తాము చూసిన విషయములను యథార్థంగా వివరిస్తే లోకాని కెంత ఉపకారం చేసినవా రయ్యేదరు!" అని టాడ్‌గారు సెలవిచ్చారు. ఆస్ట్రిఖానులో హిందువులతో కలసి మెలసియున్న ఒకపెద్దమనుష్యునితో టాడ్‌గారు మాట్లాడగా వారు భారతదేశము వదలి ఇంతదూరము వచ్చినా వారి రుజువర్తనములలో ఆవంతయైనా మార్పు రాలేదని అతడూ చెప్పినాడట. (**Annals of Rajastan by James Tod. Vol. I, pp. 549-550.**) ఇలాంటి సంగతు లనేకాలు టాడ్‌గారు తమ గ్రంథములో ఉదాహరించారు.

# నిర్వచనము



= శ్రీ మాధవపెద్ది సుందరరామశాస్త్రి =

ఏటివిధమ్మునన్ బరుగులెత్తెడి జీవిత మన్న దొక్క కో
నేటివలెన్ గుదుర్కొనియె నేఁ డిఁక నీఁదియునవ్వువెన్నెలన్
బోటిరో! చిన్ని నావ యయిపోవు మదిన్ విహరింతు నెప్పుడున్
గోటనె స్వర్గసీమలను గోట్లకుఁ గోట్లు సృజించివైచుచున్.

వలపయి పూలలోపలను వాచవియై మధువందు నీయెడన్
విలసనమైన దేదో యది విన్పడి బుల్బులుకంఠమందునన్
బిలుపుగఁ జేరవచ్చినది ప్రేయసి! యీమలయానిలమ్ములోఁ
జలువయు వేడి గాని యొక సౌఖ్యముగా మన సఖ్య మూనుచున్.

నీ కనుగ్రుడ్డునం దొక సునీలములో నెటుమూల మున్నదో
యీ కనుపట్టు వర్ణముల కెల్ల నెలే యొకఁ డాది యుండెడిన్
లోకసుఖానుభూతికిని లోపల నీ కటు గాంచిచో వృథా!
మోకలు వాకలున్ బువుల పొల్పులు బుల్బులుగాని పిల్పులున్.

మొలుచుకరాఁడు నీజపముమూలమునన్ హరియించిపోఁడు నీ
తలచనిమాత్ర దైవమును దైవమటం చన నేవిశేషమున్
గలుగమిఁ దృప్తియే మనకె గా దల దైవముకేని వాఁడు గా
వలసినయట్లె యీ మనకు వాని జగమ్మును గూడఁగావలెన్.

కోమలి! కాలమన్న నఱుకుం బెరుమా ళ్లిఁకఁ గష్టమందుమా
యేమియుఁ జెప్పరాదు సుఖమే నొకయింతయుఁ జెప్పిపోదు తా
నే మది మోసగించుకొను నెట్టి సరాగమొ పాఱఁజూచితే
భూమిజనమ్ము లీ బ్రదుకఁ బోయెడి ముచ్చట మూఁడునాళ్లకున్.

నీసపు ముక్కలా గురులు చెప్పిన ముక్కలు చేతులన్ బద
న్యాస మొనర్చి బిట్టలసినాఁడను నే మరుదేశయాత్రచే
నాసవపాత్రఁ దెమ్ము చరియన్ దెర లించుక పైకిఁ బొర్లు నే
దో సెలయేటిపొంగునయి యొక్క మొయిన్ బ్రవహింతు నెచ్చటో.

# వర్ణ - అభేద - సహపంక్తి

[ కథానిక ]

= శ్రీ కవికొండల వెంకటరావు =

సిరియాళరావు డిప్యూటీకలక్టర్ పని చేసి, రిటైర్ అయిన మర్నాడే ఫస్టుక్లాసు బెంచిమేజస్ట్రేటుగా నియమింపబడ్డాడు. నియమింపబడ్డ మర్నాడే కాస్మోపోలిటన్ క్లబ్బులో మెంబరైనాడు. ఆఫీసర్సు క్లబ్బులో కూడా అయ్యాడని చెప్పుకున్నారుగాని, అసలు ఆఫీసర్సుక్లబ్బు వుందా లేదా అనే సందేహంమీద ప్రజ లామాట విశ్వసించింది లేదు. సిరియాళరావు తాను పింఛన్ తీసికోవడం ప్రారంభించింది లగాయతు "ఏం చేస్తున్నారండీ తమ రిప్పుడు? తమ కిప్పుడంతా విశ్రాంతి అనే అనుకుంటాము" అంటే, జవాబుగా "సాంఘిక సేవ", "అఖండ భారత్ సేవ" అని సమాధానం చెప్తేస్తూ వుండేవాడు. మఱీ ఆంతరంగికుల్తో మందహాసంగా ఇలా వివరించేవాడు—"'సాంఘిక సేవ' అంటే 'పోకర్' 'రన్‌మార్' 'వెట్‌బ్రిడ్జి' ఆడ్డమేఅనుకోండి. ఎంచేతా అంటే, ఆసునుండి తివ్వీదాకా, మధ్యరాజులున్నా రాణీలున్నా, జాకీలున్నా జోకర్లున్నా ఏకమొత్తంగా గుచ్చెత్తి కలిపేసి, విభేదం పాటించకుండా అక్కడముక్క ఇక్కడకు వచ్చేలాగు, ఇక్కడ ముక్క అక్కడకు వెళ్లేలాగు 'రీషఫల్' చేసి 'డీల్' చేస్తాం. అంతకంటె వర్ణసాంకర్యం, సరిసమానప్పంపకం నాకు మఱెక్కడా కనిపించదు. అందుచేత ఇప్పుడు నేను సాయంకాలం మూడు మొదలు రాత్రి పదిన్నర దాకా పేకాటనిమగ్నుడనై యుంటూవున్నాను. నేనేకాదు, నాతోపాటు మఱీ ముగ్గుర్ని కూడా అమేషా అదే పనిలో మునిగి తేలేటట్లు చేస్తూవున్నాను. మా టేబిల్ వొక్కటేకాకుండా మమ్మల్ని మించి మఱీ ఆరు టేబిల్సు—వారికి కాలపరిమితి కూడా లేదు—క్లబ్బులో వర్కు చేస్తూవుంటాయి. వాళ్ల భోజనభాజనాదు లన్నీ క్లబ్బులోనే. ఇఖ అఖండభారతసేవను గురించి విన్నవించమంటారా?— ఈ అఖండభారత సేవ అనేది నేను క్రాస్‌వర్డు పజిల్సుద్వారా చేస్తూవున్నాను. బ్రాకెట్సుద్వారా గావిస్తూ వున్నాను. ఊరికే మీతో 'అఖండభారత సేవ' అని న్యూనోక్తిగా వచించేనేగాని నా ఆ సేవ న్యూయార్కు పట్నానకుకూడా తగిలి ప్రపంచసేవగా పరిగణింపబడితీరుతుంది. క్రాసువర్డు పజిల్సుసంగతి మీకూ కొంచెమో గొప్పో ఈపాటికి తెలియకుండా వుండదు. మన ఇంగ్లీషుభాష అభివృద్ధిపొం

దుతుంది. మన కంతో ఇంతో 'లక్' వుంటే కిట్టింపూ అవుతుంది.. మనకు కిట్టింపు కాక పోయినా మనం కట్టిన సొమ్ము ఒక లక్షమం దికైనా భూగోళంమీద వెదజల్లబడకమా నదు. మఱి బ్రాకెట్సు సంగతి అదో పెద్ద కిటుకు. ఇంతకూ నాకోరిక— తమ రోనాడు మాయింటికి డిన్నర్‌కు దయచేయాలి"-ఇదీ తంతు, సిరియాళరావుది— తాను డిప్యూటీ కలక్టరు హోదానుంచి విరమించినప్పట్నుం చీని. డిప్యూటీ కలక్టరుగా వున్న న్నా ళ్లూ రెండోవిస్తరి ఇంట్లో పడనిచ్చింది లేదు. ఎవరన్నా తనకు తేసీల్లు పోసి తనకు దం డలు వేయాలిసిందేకాని, తా నొక్కళ్లకు కప్పుకాఫీ ఇచ్చి ఒక్క వాడు గులాబీ రేకు చేతిలో పెట్టింది లేదు—ఏమనుకున్నారో!

యాత్రయెదు వెళ్లిన మర్నాట్నుంచీ ఎలా ఫిరాయించిందో అతగాని తత్వం పూర్తి గా ఫిరాయించింది. అయితే పెనిమిటికి తత్వం ఫిరాయించింది. కాని భార్యకో? ఆమెలో ఏమీ మార్పు కలగలేదు. ఆవిడఆచారా లేమిటో హరికథలేమిటో, ఉపోష్యా లేమిటో ఉప్పిడిపిండేమిటో, నోములేమిటో నొప్పులుపడ్డాలేమిటో—అదే గొడవ ఆవిడ కిప్పటికీని. భర్త రేత్రి పండ్రెండుగంటల కింటికి వచ్చినాగానీ ఆదాకా ఆలా పీట తలగడాగా వాల్చుకొని పడమటింట్లో పండుకొని వుండడమే! పల్లెత్తుమా టనదు! "ఇప్పటి కిల్లూ, నేనూ జ్ఞాపకం వచ్చామా" అని అడిగెరుగదు!!

ఇలా వుంటూవుండగా ఒకనాటి రేత్రి- అర్ధరేత్రి అని వేఱే వక్కాణించ నవసరం లేదు - వచ్చీవస్తూనే తన అర్ధాంగితో "రేపు రేత్రి మనింట్లో డిన్నర్ ఒకటి ఏర్పాటు చేశాను. మామోలుగా వచ్చేలా ఒకడూ అరా అనుకొనేవుగనుక - పండ్రెండుమందిని పిలిచాను. అందులో ఒకాయన సబుకలకటరు. అంటే తెలుసునా? నేను రిటైరయిన హోదా కంటె పైది ఆయనహోదా! ఆయనమూలం గానే నేను 'బల్లతగవరి' నైంది. తెలుసునా? ఏలా చేస్తావో పదార్థాలు?" అన్నాడు.

భార్య మఱి వోపిక పట్టలేక "ఉద్యోగం లోవున్నన్నాళ్లూ కమాను అని కచ్చేరీ అనీ వెలుపలే వుచ్చారు కాలం అంతా. ఉద్యోగం నుంచి విరమించి పిక్‌నిక్కులూ పేకాట్లూనా? ఇఖిప్పుడు బుద్ధి వచ్చేది మీాకు? కృష్ణా రామా అని అనుకొనే దేపూటా? నేను పొట్టువడియమైనా వేయించలేను. నేను వాళ్లందఱకూ ఉప్పురాయైనా వడ్డించలేను. మీారు ఎవరిచేతను వండింపించుకొని వడ్డిం పించుకుంటారో చేయించుకోండి. ఇంతకూ వాళ్లందఱూ బ్రాహ్మణేతరు లనుకుంటాను. అసలు మీాకు బ్రాహ్మణమిత్రులు పనికే రారుగా? అడగడ మెందుకు?" అని చదివింది.

సిరియాళరావు "సబుకలక్టర్ గారు బ్రాహ్మణులేగాని ఆయనకూడా నాలాగే అబ్రాహ్మణ సహపంక్తి అంటే మహాయిష్టం. ఆయన దాన్నే వర్ణ-అభేద-సహపంక్తి అని మఱోపేర విశదీకరిస్తాడు. ఈ వర్ణ - అభేద- సహపంక్తి అంటే ఆయనకు మహాయిష్టం. అంచేత పేకాటన్నేహితుల్ని మఱేసలుగుర్ని జతచేసి 'డిన్నర్'కు ఆహ్వానించాను. సి

వంటిల్లూ, నీపడమటిల్లూ, నీదేవుడరుగూ, దీపంజ్యోతీ మైలపడిపోతాయి అంటే చక్కగా డాబా సాపిట్లో విస్తళ్లు వేసి వడ్డించు." అన్నాడు చెక్కుచెదరకుండా.

"అదిగో అక్కడే వుంది మీరంటే నా కోపం! వడ్డించు అంటున్నారు మళ్లీని— ఎవరు వడ్డిస్తారు? అసలు ఎవరు వండుతారు వీళ్లందరికీని? ఉపకారవేతనం అయినప్పట్నుంచీ మాపిన్నినికూడా ఇంట్లో వుండియ్యకుండా వెళ్లగొట్టేశేరు!" అని వెక్కివెక్కి యేడ్వసాగింది ఇల్లాలు.

ఆయేడుపు వినకుండానే సిరియాళరావు "మీ పిన్నిముండ ఎక్కడకు వెడుతుంది? దానికీ ఈవూరి సినిమాలోకానికీ ఎడతెగని లంకె. ఇక్కడ్నే వుండివుంటుంది. కబురెట్టి కనుక్కో— రేపురాత్రి మాట దక్కిస్తుందేమో!" అన్నాడు.

భార్య కొంచెం తేటి అంది: "నే నామెను చూచింది మూణ్ణెల్లక్రితం. మీరు చూచారేమో ఈమధ్య. మీరే కబురెట్టండి! వస్తుంది: రాకేం చేస్తుంది? నాలుగురూపాయలు చేతిలో పెడితే మహాచక్కగా వస్తుంది."

సిరియాళరావు కబురుచేస్తేనే వచ్చిందో, లేక ఆమె స్వయంగా రావాలనే వచ్చిందో, పిన్ని అన్న ఆవిడ తిన్నగా సిరియాళరావుగారి యింటికి మర్నాటి మధ్యాహ్నానకు విచ్చేసింది. అప్పటికప్పుడే కావలసిన సామానంతా—జీలకర్రనుంచి సీంబాదంపప్పువఱకూ తట్టల్తోటీ తబేళాల్తోటీ వచ్చిపడివుంది ఇంట్లో.

సిరియాళరావుభార్యపేరు శ్యామలాంగి తన పిన్నిని చూస్తూనే "వచ్చావుటే పిన్నీ? మాఆయన కబురెట్టారా?" అని అడిగింది. అంటే పిన్ని "మీఆయనకూ లేదు సిగ్గు—నాకూ లేదు. ఒకడు కబురెట్టేదేమిటే మన యింటికి మనం రావడానికి? మీయింట్లో ఈరాత్రి 'డిన్నరు'టగా!" అంది. "అదే ఆలోచిస్తున్నాను. వండేవాళ్లు లేరు. వడ్డించేవాళ్లూ లేరు" అంటూ శ్యామలాంగి తన పిన్నియొక్క నుదురుకేసి చూస్తూ ముంగురులకు బదులు ముసుగు అగపిస్తే "ఇదేమిటే పిన్నీ! ఇదెప్పట్నుంచి చేయించావే?" అని అడుగుతూ కంట నీరెట్టుకుంది. పిన్నికూడా అంతో యింతో కన్నీరు విడిపికొని "ఇదేనమ్మా! ఆడదాని అప్రతిష్ఠా అగచాటూను. మొన్న పుష్కరాలకు తీయించేశానే. ఎన్నాళ్లీ జుత్తు" అని ముసుగు సర్దుకుంది.

శ్యామలాంగి:— వచ్చేవాళ్లు అందఱూ ఉద్యోగస్థులు. కూర్చునేది వర్ణ-అభేదసహపంక్తిఅన్నారు మావారు.

"అయితే ముసుగువేసుకు వడ్డిస్తే బ్రాహ్మణాచార మైపోతుం దంటావు!"

"ఉఁ".

"ముసుగు తీసేసికొని వడ్డిస్తేనో?" అని పిన్ని అభినయించింది. ఆ అభినయానకు ముందే "ముసుగు తీసుకువడ్డిస్తే బలే పసందుగా వుంటావు-లే" అని శ్యామలాంగి విఱగబడి నవ్వింది.

గడియారం ఆవల సాయంకాలం మూడు కొట్టింది. ఇద్దరూకూడా విన్నారు. "సీమర్యాదకు లోపంరాకుండానే వండి నే వడ్డిస్తే సరికదా. వెయ్యిమంది నానాకులాలవాళ్లూ వచ్చి కూర్చున్నా జగన్మోహినిలా వడ్డించగలను నేను. చూతుగాని ఈ రేత్రి నావేషం.—నీ మొగుడూ వాళ్లతోటి సరాసరి కూర్చుని భోంచేస్తాడే?" అని బుగ్గను వేలేసుకుంది పిన్ని.

"అందుకనేగా యీమొట్ట. వంటింట్లో అయినా, పడమటింట్లో అయినా అయితే నేనే వడ్డిస్తను. డాబాసావిట్లోట సహపంక్తి!"

"ఇంకా ఆచారం అన్నది యీకొంపలో సీమూలంగా నిలబడివుంటూవుంది అనుకో!"

అని పిన్ని చలచలా నూతిదగ్గఱకు వెళ్లి స్నానం చేసి, మడిగట్టుకు సాయంకాలం దీపాలవేళకల్లా వంట—సిరియాళరావు పురమాయించిన ప్రకారానికి ఉల్లిరేకూ్కడా తేడా రాకుండా తయారుచేసింది. చేసి "యిప్పుడే వస్తున్నా! చూస్తూవుండు: పదార్థాలు చల్లారిపోకుండా, పిల్లి ముట్టుకోకుండా మాఅమ్మా!"అని ఎక్కడికో చక్కాపోయింది.

మళ్లీ వడ్డనప్పుడే పిన్నిని మనం చూడ్డం. ఉడుతతోకకుచ్చువంటి జడచివళ్లు. జడ ఏమో నల్లత్రాచు! ముందుకు ముంగురులు. చెంపల కిందకిందకూ్కడా అదేమాదిరి. నున్నని దువ్వు, వెనుపీఠిని పువ్వు—ఇలాగ్గా భేషైన సువాసినీరూపం దాల్చింది. చేతుల్ని గాజు లెట్టుకుంది. మెళ్లోహారాలు వేసుకుంది. కాళ్లను ఘల్లుఘల్లుమనే గొలుసు లుంచుకుంది. వొయ్యారిపడుచంటే వొయ్యారిపడుచు అన్నట్టు నడుస్తూ వడ్డిస్తూవుంది.

భోజనానికి కూర్చున్నవాళ్లందఱికీ బలే ఆశ్చర్యంగా వుంది. పదార్థాలుచూస్తే తినాలనివుంది. తినకుండా ఆవిణ్ణే-ఆ వడ్డించేఆవిణ్ణే చూడాలనీవుంది. చివరకు ఆమె వచ్చి, నేతిగిన్నె చేతపట్టి'కూర్చోండి అయ్యల్లారా!' అని అనేదాకా ఒకళ్ల అరచెయ్యీ అన్నం మీద పడలేదు. ఒకప్పుడమూ ఏటిగలేదు. విందుకు వచ్చినవారిలో వొక్కరూ సిరియాళరావును "నీ కేమాతుందోయి ఈవిడ?" అని అడక్కుండానే ఎదో చూపులకు చూపులంపుకుంటూ భోజనం చేయసాగారు. సిరియాళరావుమాత్రం మధ్యమధ్య మొఖమోటం పడకుండా భోజనంచేయాలిసుమండీ! మీారు మొఖమోటపడ్డారా అంటే మీయింట్లో డిన్నరుకు నేనూ మొఖమోటపడనలసివస్తుంది" అనేవాడు. "ఇంతకూ పదార్థాల మద్రుచులు బాగావున్నాయి. వడ్డించేఆవిడ షోడశరుచుల్తో వడ్డిస్తూవుంది - మాకు కొదవేమిటి" అని ఏ అతిథిమట్టుకా అతిథే స్వగతంగా అనుకుంటూ పైకి "సిరియాళరావూ! ఇలాంటి డిన్నర్ మఱొకటి నీవే యివ్వాలోయి! ద్వితీయ విఘ్నం పనికిరాదుసుమా!" అని అభినందించారు. సిరియాళరావు "ఏడిన్నర్ ఆకలి ఆడిన్నరుదే—వేయించుకోండి మఱిరెండు ఒబ్బట్లు" అన్నాడు కొంచెం ఉబ్బి. క్రమేపీ సంతోష సంభాషణ 'మట్టన్'నుంచి మహిమ్పి

దధిదాకా భోజనంతోపాటు జరిగింది. దధిదగ్గఱకు వచ్చేసరికి, ధవళం దధి—మంచి కరడుపెరుగు వడ్డిస్తూవుంది పిన్ని! "ఇంటి గేదా?" అని పంక్తిలో మొదటివాడు అంటే సిరియాళరావు "గేదెల్లో ఇదివఱకు గవిడి గేదెనుగురించి విన్నాను గాని ఇంటిగేదెను గురించి వినలేదు." అంటూ తన అన్నం తాను కలుపుకుంటూవున్నాడు. సబుకలక్టరు హోదామాన్యుడు "అదికాదోయ్! గుమ్మం ముందు పితికిస్తున్నావా, పెరట్లో మేపిస్తున్నావా? గేదెను? రెండోరకానిది అయితే ఇంటిగేదె" అన్నాడు. సిరియాళరావు "మన రంగన్న అన్న పూర్వసువాసినీ వ్యాఖ్యానం లాగే వుంది ఇదీని" అన్నాడు. చంద్రన్న అనే పేకాటహీరో అదివఱలో ఆ వ్యాఖ్యానం తాను ధప్పళం కలుపుకోవడంలో వినకనో, లేక కేవలం ఆవిడమీదనే ధ్యానం వుంచుకునో, ఎఱక్క "ఏమిటి ఆ వ్యాఖ్యానం" అని అడిగాడు. మున్ను విన్న నాగోజీ ఇలా చెప్పేడు గొంతు కూర్చుని త్రేంచుకుంటూ— "ఆవడపూర్వసువాసినీరూపం గారి. భూలోకంలో ముందు సువాసిని అయి పసుపు పోయి స్త్రీ పూర్వసువాసిని అవుతుంది. ఈ భోజనలోకంలో ముందు పూర్వసువాసిని అయి గారి అనే పదార్థం తరువాత పసుపుకలిసిన మెంతి పెరుగు తగిలి-తగలడమేమిటి? మెంతిపెరుగులో బాగా తడిసి-తడియడమేమిటి నాని-సువాసిని అవుతూవుంది." అన్నాడు.

ఈవ్యాఖ్యానాల దోసందులో, ముక్తాయింపులో పంక్తిలోని కడవానివద్ద ఓ గమ్మత్తు జరిగింది: పిన్ని జడ ముందుకేసుకు వడ్డిస్తూవుంది! అసలు జడన్నది ఆడవాళ్ల వంటిమీద ఓచోటెప్పుడు నిలకడగా వున్నది కనక? ఓపర్యాయం పిరుదుల్ని పింపిల్లు కూస్తుంది. ఓపర్యాయం ఆబుజాన్ని పడి వెనక్కు మొలను చుట్టేస్తుంది. ఓపర్యాయం ఈబుజాన్నిపడి ముందు మడమలమధ్య పడుతుంది. అందులోనూ ఉడుతతోక కుచ్చుదేమో. వడ్డించే పెరుగుతో కలిసి విస్తట్లో పడింది చటాల్న. అతడు—ఆ విందులోనిద్వాదశార్కుడు "పెరుగులో పెండ్రుక లున్నట్టున్నాయి. ఇది నాన్ వెజిటేరియన్ పెరుగ్గా వుంది." అని ఆ కుచ్చులోని వో పెండ్రుక ఆలా తీసి పారేసినట్టు లాగిపారెయ్యబోయాడు.

దాంతో వడ్డించేఆవిడ 'విగ్' 'విగ్' ఊడి విస్తట్లో పడింది. ఆమె—మన పిన్ని సిగ్గుపడిపోతూ పెరుగుతప్పాలా అక్కడ జారేసి వంటింట్లోకి "వల్లకాటితిల్లు, వల్లకాటి లోకం" అనుకుంటూ తిరోహిత అయింది. సిరియాళరావూ, తక్కిన ఎలివెన్ నిర్ఘాంత పోసాగారు. పంద్రెండో ఆతడు "పెరుగులోకి పెండ్రుకే కాదు, విగ్ విగ్గే వచ్చిందోయ్" అంటూ ఆ విగ్గును సిరియాళరావు విస్తట్లోకి విసిరాడు. సిరియాళరావు "ఎక్స్ఛేంజు చెయ్యాలి" అన్నాడు. సబుకలక్టర్ హోదా ఆయన "It is a nice ending—మంచి ముగింపు" అన్నాడు.

ఎంత మంచి ముగింపు అని అన్నా సిరియాళరావు, ఆపూట ఆపంద్రెండుగురూ తానూ మూడుతెగలుగ ఆరేత్రి మూడుగంటల్దాకా ఆడిన పేకాటప్పుడు

కూడా, అంతో యింతో చిన్నబుచ్చుకోక తప్పిందికాదు.

శ్యామలాంగికీ, పిన్నికీ తొలికోడి కొక్కొరోకో అనేదాకా భోజనమే లేదు.

సిరియాళరావు స్నేహితులవద్ద సెలవు తీసుకు వీథితలుపు గెడవేసికొంటూ, వంటింట్లో ఇంకా చప్పుడౌతూవుంటే వెళ్ళి "చూడండి అత్తా! ఇప్పుడు ఉద్యోగస్థుల్లో నూటికి తొంభైమంది వర్ణ అభేదపు తంతుగాళ్లు. ఏం చెయ్యగలం? మనం?" అన్నాడు. శ్యామలాంగి, కిమన్నాస్తి, మాట్లాడలేకపోయింది గాని పిన్నిమాత్రం "విగ్ జాగ్రత్తచేశావా?" అని అడిగింది. అడుగుతూ ఇంకా నిర్వచించింది: "ఈరోజుల విగ్గుల్లో నూటికి తొంభై విగ్గులు వర్ణఅభేదానివే. ఎక్కడో కాని అంతా నల్లగా వున్న విగ్గే కానరాదు బజార్లో. పెరుగులో పడి తెలుపనిపించిందేమోకాని తిరిగి పరిశుభ్రం చేస్తే ఎలా ఉంటుందనుకున్నారు ఈవిగ్! బ్రహ్మాండంగా కాటుకపిట్టలా వుంటుంది." అని సిరియాళరావు చేతిలోంచి ఆ విగ్గున్నూ, విగ్గుతోకూడా ఓ వరహాలొఖ్ఖ మున్నూ అందుకుంటూ — "పిల్లా! వెళ్లొస్తా" నంటూ శ్యామలాంగికేసి చిరునవ్వు నవ్వుతూ, పిన్ని వీథిమూలమలుపు తిరిగింది. ఆకాశపు తూరుపు వారగునే అరుణకాంతులు ఆమెపెదవుల్ని ఎదుర్కొన్నాయి!



## శృంగేరిలోని శ్రీ విద్యాశంకర దేవాలయము



క్రీ. శ. 1338 లో వేదాగమసంప్రదాయోక్తప్రకారముగా నిర్మింపబడిన ఈ దేవాలయము మైసూరు రాష్ట్రమునందు ద్రావిడ హొయిసల శిల్పపద్ధతి సమంచితములైయున్న దేవాలయములలో కెల్ల బహుసుందర మైనదని చెప్పవచ్చును. శివపురాణములందలి అనేక కథలను, గాథలను చిత్రించునట్టి రమణీయతమ శిల్ప ప్రతిమలకు ఈ ఆలయము ఒక అపూర్వమైన ప్రదర్శన భాండాగారముగా నున్నది. ఈ ఆలయపు గర్భ గుడిలో, బహుకాలముక్రిందట ఇదే పవిత్రస్థలములో ఒకానొక గుహయందు ప్రవిష్టులై ఇహలోకయాత్ర చాలించి శివసాయుజ్యము నందిన శ్రీ విద్యాశంకరగురువర్యుల పవిత్రస్మృతి నిమిత్తమై ఒక మహాలింగము ప్రతిష్ఠచేయబడియున్నది. విజయనగర చక్రవర్తుల పరిపాలనలో సాచివ్యము నెరపిన మాధవాచార్యులవారు హరిహరరాయరాజేంద్రుల ఆజ్ఞానుసారముగా ఈ ఆలయమును నిర్మించినట్లు చరిత్ర తెలుపుచున్నది.

# కాకతిగణపతిదేవుఁడు - కులోత్తుంగరాజేంద్రచోళుఁడు



= డా. శ్రీ నేలటూరి వెంకటరమణయ్య —

)గ్ర హిస్టరీ అండ్ కల్చ'రను తమ త్రై
మాసికపత్రికయొక్క ప్రథమసంపుటపుఁ
ప్రథమసంచికయందు శ్రీ డాక్టరు మారేమండ రామ
రావుపంతులు ఎం. ఏ., పిహెచ్. డి. గారు తమచే
సంపాదితమైన కాకతిగణపతిదేవుని శిలాశాసనము
నొకదానిని ప్రకటించియున్నారు. ఇది గుంటూరు
జిల్లా బాపట్లతాలూకా నాయనిపల్లిగ్రామస్థిత చెన్న
కేశవాలయపు గోడయందలి యొక బండపైఁ జెక్కఁ
బడియున్నది. మదరాసు గౌరన్మెంటు శాసనపరిశో
ధకశాఖవారిశాసనమునకు ౧౯౨౨-వ సంవత్సరమునం
దొకపర్యాయమును, ౧౯౪౦-వ సంవత్సరమున నొక
పర్యాయమును ప్రతిబింబమును దీయించియున్నారు.[1]
ఈశాసనగ్రంథము నీక్రింద నుల్లేఖించుచున్నాఁడను.
ఇది డాక్టరు రామారావుగారిచే ప్రకటింపఁ
:నదే; కాని కొన్నియెడల శాసన పరిశోధనశాఖవారి
నకలు ననుసరించి యల్పముగసవరణలను గావించి
నాఁడను.

శస్తిసహిత[ం]......

౨ హామండలేశ్వర[రై][నకాకతిగణ*]
౩ పతిదేవమహారాజు[లు][ది*]
౪ గ్విజయము సేసిపర
౫ మండళములు సాధి
౬ ంచ్చిదక్షిణదిసుభాగము
౭ ననెల్లురుగాల్చి. తద్విరో[ధు]
౮ లైనపడిహారి[బ]య్యనతిక్క
౯ నలవెరసినశాత్రవశిరం
౧౦ బులంగం[దుక]క్రీడవి[నో]
౧౧ దముసలిపి [ద*] విళమం
౧౨ డళమున[కు] [లోత్తు*]ంగరాజే
౧౩ ంద్రచోడ[ని]చ్చికొనినెల్లు
౧౪ రిరాజుచేత[ఏ]నుంగులంగన్క
౧౫ గగొనివచ్చి...

ఇందువల్లఁ గాకతిగణపతిదేవుఁడు దక్షిణదిగ్విజ
యమునకు బయలువెడలి. నెల్లూరిం గాల్చి బయ్యన
తిక్కనలఁ గలసిన శత్రుల సంహరించి ద్రవిళమండల
మును ప్రవేశించి కులోత్తుంగరాజేంద్రచోడని బట్టి
కొని నెల్లూరిరాజుచే నేనుఁగుల గానికగొనివచ్చెనని
తెలియవచ్చుచున్నది. ఈశాసనముమధ్యయుగతీరాంధ్ర
దేశచరిత్రపునర్నిర్మాణమున కత్యంతోపయుక్తమైనది.
ఈశాసనగ్రంథమువల్ల నపరిచితవిషయములు పెక్కు
బయల్పడుచున్నవి. కొన్ని నూతనసమస్యలును తల
జూపుచున్నవి. దక్షిణదిగ్విజయమునకు వెడలిన గణ
పతిదేవుఁడు నెల్లూరిని గాల్చినాఁడనియు, తద్విరో

1. అడిగినవెంటనే తమచేఁ దీయఁబడిన ప్రతి
బింబమునకు నకలును వ్రాసిపంపి దానియందలి విషయ
మును నా ఈవ్యాసమున వినియోగించుకొనుట కను
మతి నొసఁగినందులకై దక్షిణమండల శాసనపరిశోధన
శాఖాధ్యక్షులకు నా కృతజ్ఞతా పూర్వకనమస్కార
ముల నర్పించుచున్నాను.

కులను పడిహారిబయ్యనతిక్కనలను నారిమిత్రులను
జంపినాఁ డనియు, ద్రవిళమండళమునఁగులోత్తుంగరాజేం
ద్రచోడుని బట్టుకొనినాఁ డనియు, దానికి ముదమంది
నెల్లూరిరాజు గణపతిదేవునికి నేనుఁగుల గానిక
యొసఁగెననియు శాసనమునఁ గలదుకదా. గణపతి
దేవుఁడు నెల్లూరి నేల కాల్చెను? నెల్లూరికి విరోధు
లైన పడిహారిబయ్యనతిక్కన లెవ్వరు? మఱియు
ద్రవిళమండలమున గణపతిచేఁ జిక్కిన కులోత్తుంగ
రాజేంద్రచోడఁ డెవ్వఁడు? ఏనుఁగుల కానికగ నొసఁ
గిన నెల్లూరు రాజెవ్వఁడు? అతఁ డట్లు కానికనిచ్చు
టకుఁ గారణ మేమి? ఈప్రశ్నలకుఁదగినసమాధానమును
గనుగొనుటయే ప్రస్తుతవ్యాసముయొక్క ప్రధానో
ద్దేశము.

మొదటి రెండు ప్రశ్నలకును, కడపటి రెండు
ప్రశ్నలకును సమాధానము నొసఁగు నైతిహ్య మొకటి
సిద్ధేశ్వరచరిత్రసోమదేవరాజీయము లను గ్రంథములందు
కానవచ్చుచున్నది. వీనియందు సిద్ధేశ్వరచరిత్ర
ప్రాచీనతరమైన ద్విపదకావ్యము. దీని రచయిత
కాసె సర్వప్ప యెప్పటివాఁడో నిశ్చయించిచెప్పఁ
దగిన యాధారము లెవ్వియు లభ్యపడకున్నను "ఇతఁడు
ప్రతాపరుద్రుని యనంతరము గొంతకాల మయినతరు
వాత నుండినవాఁడు" అని కీ. శే. కం. వీరేశలింగం
పంతులుగారు అభిప్రాయపడియున్నారు. ఇది సరియే
కావచ్చును. సిద్ధేశ్వరచరిత్రయందు గణపతిదేవుని
దక్షిణదిగ్విజయమునకుఁ గారణమును, నావిజయయాత్ర
యందు జరిగిన విశేషాంశములును నీక్రిందిరీతిని వర్ణింపఁ
బడియున్నవి:

"ఆరీతి గణపతి నటు చూచువేడ్క
తిక్కనసోమయాజ్యక్కడ కొకట
* * *
జక్కఁగ వినుచును నొక్కయందలము
నెక్కి తిక్కనసోముఁ డక్కడ కేతెంచె

సత్యసంధుండును సద్ధర్మవర్తనుఁడు
నగు సోమయాజి తా నారాజు కనియె
దగుమాట విను మొక్క ధర్మకార్యంబు
సూర్యవంశంబున సొబగొందునట్టి
యార్యపూజితవరుఁ డామనసిద్ధి
రాజు దా నెల్లూరు రమణతో నేలు
* * *
అక్కనబయ్యన లధికబలిష్ఠు
లక్కట! సిద్ధిరాయని బారదోలి
దక్కిన రాజ్యంబు తామె యేలుచును
నొక్కకొన్నైనను జక్కఁగ నీరు
వారల దండించి వారి నెల్లూరు
వారి కిప్పింపుమవారణప్రీతి
ననిన గణపతిరా జట్ల కాకనుచు
* * *
వెడలిగణపతియు విజయంబునకును
గుడియెడమల సేన కొలిచియే తేర
వెలనాడు చేరియు వీడెల్లఁ గాల్చి
వెలనాటి రాజును వెసగెల్చి వాని
యప్పనంబులు కొని యట చని రాజు
గుప్పున నెల్లూరుకూడ నేతెంచి
యక్కనబయ్యన నచట సాధించి
* * *
నెల్లూరిప్రజలకు నేర్పు వాటిల్లఁ
జెల్లించె మనుమసిద్ధిరాజునకు
నెల్లూరిపట్టంబు నేర్పుతోఁ గట్టి
సల్లలితాద్భుతిసమదుర్గములను
నఱువదెనిమిదియు నగు పట్టణముల
నరుదొంద సాధించి యామనుమసిద్ధి
రాజు కిచ్చియుఁ దన తేజంబు దిశలఁ
బూజకెక్కఁగ ఘనరాజితయశుఁడు
ఘనతటాకంబు దాఁ గట్టించి యచటఁ
గొనకొని నెల్లూరఁ గొన్నెలలుండి
మనుమసిద్ధికి రాజ్యమహిమలు దెల్పె"[2]

2. ఆంధ్రకవులచరిత్రము, ప్రథమ భాగము, పుటలు 33-34.

ఈ విషయమునే యర్వాచీనుఁడు కూచిమంచి జగ్గకవి తన సోమదేవరాజీయ మను పద్యప్రబంధమునఁ జెప్పియున్నాఁడు:

"గీ. చేయఁ దక్కినవైన దేవాయతనము
లపుడు పూర్తిగఁ గట్టించి యలరుచున్న
చోట నొకనాఁడు తిక్కన సోమయాజి
వచ్చె నెల్లూరినుండి భూవరునికడకు.

వ. అప్పుడు...గణపతిదేవరాజు సోమయాజుల పటువాక్యశక్తికి మెచ్చి...యతఁడు వచ్చిన కార్యం బడిగిన నా భూవరునకుఁ గవివరుం డిట్లనియె.

గీ. ఇనకులోద్భవుఁ డైనట్టి మనుమసిద్ధి
రాజు నెల్లూరు పాలించుచోఁ జెలంగి
యతని దాయాదు లతని నుక్కడఁగఁబట్టి
యునిచి రాజ్యంబుఁ దమ రేలుచున్నవారు.

క. కావున మీ రిపు డచటికి
వేవేగం దరలివచ్చి విజకుండఁగ నా
భూవరుఁ బునరభిషిక్తునిఁ
గావింపఁగవలయు ననిన గణపతివిభుఁడున్.

గీ. అట్లకాక యనుచు నాపని కొడఁబడి
యత్యుదారగుణసమగ్రుఁ డగుచుఁ
దవిలి యప్పు డొక్క నవలక్షధనమును
యజ్ఞకుండలములు నతని కిచ్చె.

* * *

సీ. గణపతిదేవుఁ డాఘనుననుమతి గాంచి
యతిసత్వరమునఁ బ్రయాణభేరి
వేయించి చతురంగపృతనాసమేతుఁడై
తరలి ము న్వెలనాటి ధరణిపతుల
గెలిచి వారలచేత లలి నప్పనము గొని
వారినందఱఁ దనవశమ్ము జేసి
కొని చని నెల్లూరు గొబ్బునఁ జొచ్చి య
క్కనయు బయ్యనయు నఖిలులఁ దునిమి
మనుమసిద్ధిరాజుఁ బునరభిషిక్తుఁ గా
వించి మించి రెండువేలునైదు
నూఱుగ్రామములు మనోవృత్తి కతనికి
నిచ్చి కడమఁ దాను బుచ్చుకొనియె.[3]

సిద్ధేశ్వరచరిత్రయందును, సోమదేవరాజీయము నందును దిక్కనసోమయాజిరాయభారమును, గణపతిదేవుని నెల్లూరియుద్ధయాత్రయు మొత్తముమీఁద నొక్క తీరున వర్ణింపఁబడియున్నను వానియందు భేదములు గమనింపఁదగినవి లేకపోలేదు. ఇట్టి భేదములలో ముఖ్యమైనవాని నిచ్చటఁ జేర్కొనియెదను.

౧. సిద్ధేశ్వరచరిత్రయందు—

"అక్కనబయ్యన లధికబలిష్ఠు
లక్కట! సిద్ధిరాయనిఁ బాఱఁదోలి
దక్కిన రాజ్యంబుఁ దామ యేలుచును
నొక్క కాసైనను జిక్కఁగ నీరు"

అని యుండఁగా, సోమదేవరాజీయమున—

"...మనుమసిద్ధి
రాజు నెల్లూరు పాలించుచోఁ జెలంగి
యతని దాయాదు లతని నుక్కడఁగఁబట్టి
యునిచి రాజ్యంబుఁ దమ రేలుచున్నవారు"

అని యున్నది. "పాఱఁదోలి" యనునది "పట్టి యునిచి" యనుదానికిఁ బ్రత్యక్షవిరుద్ధము. "దాయాదు" లనుమాట యుదాహృతసిద్ధేశ్వరచరిత్రగ్రంథభాగమునఁ గానరాదు. అన్యత్ర గానవచ్చునేమో.

౨. సిద్ధేశ్వరచరిత్రయందు—

"వెలనాడు చేరియు వీడెల్లఁ గాల్చి
వెలనాటి రాజును వెస గెల్చి వాని
యప్పనంబులు గొని......"

యని యుండఁగా సోమదేవరాజీయమున—

"........తరలి మున్వెలనాటి ధరణిపతుల
గెలిచి వారలచేత లలి నప్పనముఁ గొని

3. ఆంధ్రకవులచరిత్రము, ప్రథమభాగము, పుటలు 3౬–3౭.

వారి నందఱఁ దన వశము జేసి
కొని......"

యని యున్నది. సోమదేవరాజీయములోని 'వెలనాటి ధరణిపతులు' 'వారల' 'వారినందఱ' అను బహువచనప్రయోగము సిద్ధేశ్వరచరిత్రయందలి 'వెలనాటిరాజును' అను నేకవచనమునకు విరుద్ధము. సిద్ధేశ్వరచరిత్ర వెలనాటి ధరణీశ్వరుఁ 'డొక్కఁ డనియే తెలుపుచుండఁగా సోమదేవరాజీయము 'ధరణిపతులు' 'వారల' 'అందఱ' నని పెక్కురు వెలనాటిపైఁ ప్రభుత్వము సల్పుచుండినట్లు చెప్పుటకుఁ గారణము విశదముగాదు.

3. సిద్ధేశ్వరచరిత్రయందు—

"......మన్మనసిద్ధిరాజునకు
నెల్లూరిపట్టంబు నేర్పుతోఁ గట్టి
సల్లలితాద్భుత సముదుగ్రాములను
నఱువ దెనిమిదియు నగు పట్టణముల
నరుదంద సాధించి యామన్మసిద్ధి
రాజున కిచ్చియు......"

అని యుండఁగా సోమదేవరాజీయమున—

"మనుమసిద్ధిరాజుఁ బునరభిషిక్తుఁగా
వించి మించి రెండువేలునైదు
నూఱుగ్రామములు మనోవృత్తి కతనికి
నిచ్చి కడమఁ దాను బుచ్చుకొనియె."

అని యున్నది. వీని నాధారపఱచుకొని కీ. శే. కం. వీరేశలింగంపంతులుగా రిట్లు వ్రాసియున్నారు: "ప్రతాపచరిత్రను[సిద్ధేశ్వరచరిత్ర కిది నామాంతరము] బట్టి యఱువదెనిమిది గ్రామముల మాత్రమే యాతని కిచ్చినట్లు స్పష్టమగుచున్నది. దీనినిబట్టి చూడఁగా... మన్మసిద్ధిరా జొక్క చిన్న సంస్థానాధిపతియైనట్టుకూడఁ దేటపడుచున్నది" 4 కాని వీరి యభిప్రాయ మంగీకరించఁదగినది కాదు. నెల్లూరి రాజ్యమునకు లోనైన సమస్తదుర్గములను, నఱువది రెండు పట్టణములను శత్రులచే నొక్కదానినైన నుండనీయక సాధించి మనుమసిద్ధి కిచ్చినట్లు కొనె సర్వప్ప చెప్పెనేకాని వీరేశలింగంపంతులుగారన్నట్లు అఱువదిగ్రామముల నుండ నిచ్చి తక్కిన రాజ్యమును గణపతి యాక్రమించుకొనెనని చెప్పలేదు. రెండువేల నైదునూఱుగ్రామములను మాత్రము మనుమసిద్ధికి మనోవృత్తికై యొసంగి తక్కిన రాజ్యమును గణపతి పుచ్చుకొనె నను జగ్గకవిపలుకులకేమి యాధారమో తెలియదు. సిద్ధేశ్వరచరిత్ర సోమదేవ రాజీయముకంటెఁ బ్రాచీనతరము. కావున వివాదగ్రస్తములగు సందర్భములయందు దాని సాక్ష్యమే విశ్వాసపాత్రముగఁ గొనుట యుత్తమము.

పై మూఁడు అంశములయందుతప్ప తక్కిన తావుల నీరెండుగ్రంథములకును భేదము గానరాదు; తక్కిన విషయమంతయు రెంటికిని సామాన్యమే. వీని యందుక్తమైన విషయము సత్యమనియుఁ, జరిత్రాత్మక మనియు గణపతిదేవుఁడు వేయించిన నాయని పల్లి శిలాశాసనము ఋజువుసేయుచున్నది. శాసనము లోని బయ్యనతిక్కనలే సిద్ధేశ్వరచరిత్ర సోమదేవరాజీయములందుఁ బేర్కొనఁబడిన యక్కనబయ్యనలు. తిక్కనకు బదు లక్కన యని పేరు ప్రమాదవశమున గ్రంథస్థమైనది. బయ్యన తిక్కన లను శాసననామక్రమము గ్రంథములందు అ(తి)క్కనబయ్యన లని తారుమారైనది. ఇవి యంతగ పాటింపఁదగిన యంశములు గావు. మిగిలిన విషయములు గ్రంథములయందుండునవియే శాసనమునందును గానవచ్చుచున్నవి.

సిద్ధేశ్వరచరిత్ర సోమదేవరాజీయములయందు వర్ణింపఁబడిన గణపతి నెల్లూరివిజయవృత్తాంతము సత్యమనియుఁ, జరిత్రాత్మకమనియు నాయనపల్లి శిలాశాసనము ఋజువుసేయుచున్నదని పైనఁ జెప్పఁబడియెనే-అది యెట్లు సాధ్యమగును ? సిద్ధేశ్వరచరిత్రయందును, సోమదేవరాజీయమునందును గణపతిదేవుఁడు నెల్లూరునకుఁ బోవు మార్గమున మొదట వెలనాటిపై దండు

4. ఆంధ్రకవుల చరిత్ర, ప్రథమ భాగము, పుట 32.

పెట్టి యా వెలనాటి రాజు (అథవా రాజుల)చే నప్పన గొనినట్లు చెప్పియున్నది; నాయనిపల్లి శాసనమందన్ననో వెలనాటి మాటయే లేదు. మఱియు నాయనిపల్లి శాసనమునందు గణపతి ద్రవిళమండలమునఁ గులోత్తుంగరాజేంద్రచోడని బట్టికొనినట్లు చెప్పియున్నది. పైఁ బేర్కొనఁబడిన కులోత్తుంగరాజేంద్రచోడఁడే క్రీ. శ. ౧౨౪౫-వ సంవత్సరము మొదల్కొని చోళ సామ్రాజ్యమును బరిపాలించిన ముమ్మడిరాజేంద్ర చోళచక్రవర్తి యని శ్రీ డాక్టరు మారేమండ రామరావుపంతులు గారు గుర్తించియున్నారు.[5] సిద్ధేశ్వర చరిత్ర సోమదేవరాజీయములయందు కులోత్తుంగ రాజేంద్రచోళుని ప్రస్తావము గానరాదు. విషయ మిట్లుండఁగా నూరక నాయనిపల్లి శాసనము సిద్ధేశ్వరచరిత్రసోమదేవరాజీయములలోని గాథ సత్యమనియుఁ, జరిత్రాత్మకమనియుఁ జెప్పినఁ జెల్లునా? అని యాక్షేపమొకటి బయలుదేరవచ్చును. కాని ఈ యాక్షేప మంత ప్రబలమైనది కాదు. ఇది మన యజ్ఞానముపై నాధారపడియున్నది. వాస్తవమైన చరిత్రాంశములను గనుగొంటిమేని యీ యజ్ఞానాంధకారము తనంతట విరిసిపోవును; అంతట సత్యమైన చరిత్ర బోధకాఁగలదు.

మొట్టమొదట తెలిసికొనఁదగిన విషయమిది. శ్రీ మారేమండ రామారావుపంతులుగారు చేసిన వ్యక్తినిర్ణయము సరియైనదికాదు. నాయనిపల్లి శాసనమునఁ బేర్కొనఁబడిన కులోత్తుంగరాజేంద్రచోళుఁడు రామారావుగారు చెప్పినట్లు చోళచక్రవర్తియైన ముమ్మడి రాజేంద్ర చోళుఁడుగాఁడు; అతనికి సమకాలికుఁడైన మఱియొక భిన్నపురుషుఁడు. ముమ్మడి రాజేంద్రచోళచక్రవర్తి శాసనము లెన్నో చోళసామ్రాజ్యమునందు - ద్రావిడ దేశమునను,దక్షిణాంధ్రమునందును- గానవచ్చుచున్నవి. వానియం దెచ్చటను నతనికి కులోత్తుంగుఁ డను పేరుండినట్లు చెప్పియుండలేదు; అట్టిపే రతనికిఁగలదని తెల్పు నన్యాధారములును గానరావు. నాయనిపల్లి శాసనమునఁ బేర్కొనఁబడిన కులోత్తుంగరాజేంద్రుఁ డతఁడే యనుట సమంజసము కాదు. నాయనిపల్లి శాసనమునఁ బేర్కొనఁబడినాతఁడు వెలనాటిగొంక రాజుల వంశీయుఁడు. ఇట్లని చెప్పుట కాధారము గణపతిదేవుని శాసనములే.[6] క్రీ. శ. ౧౨౩౮-వ సంవత్సరమునాఁటి యొక ద్రాక్షారామశాసనములోఁ గాకతి గణపతిదేవుని నాయకులయం దొక్కఁడగు మల్యాల వే(హే?)మాద్రిరడ్డి తాను 'కులోత్తుంగరాయ రాజేంద్రచోడగొంకదిశాపట్టఁడ'నని చెప్పుకొని యున్నాఁడు.[7] క్రీ. శ. ౧౨౪౯-వ సంవత్సరమునాఁటి త్రిపురాంతకశాసనములలో నొకదానియందు చోడె బోయఁ డనునొకఁడు దాను రాజేంద్రచోడని భృత్యుఁడ నని చెప్పుకొనియున్నాఁడు.[8] మఱియు క్రీ. శ. ౧౨౫౪-వ సంవత్సరమునాఁటి యినుమెళ్ల శాసనమునఁ గాకతిగణపతిదేవుని యనుచరుఁడగు క్షాలప నాయకుఁడు దాను "వెలందికులోత్తుంగరాజేంద్ర చోడనిస్తారకుఁడ"నని చెప్పుకొనియున్నాఁడు.[9] ఇందు 'వెలనాంటి' అనుదానికి బదులు శాసన

---

5. Transactions of the Indian History Congress, Fifth Session, Hyderabad, P. 567.

6. ఇవి రెండు. నా విచారణమీఁద వెలనాటి రాజుల శాసనములను శోధించి మా డిపార్టుమెంటులో వెలనాటిరాజుల చరిత్రను పరిశీలించి గ్రంథము వ్రాయుచున్న విద్యార్థిపరిశోధకుఁడు శ్రీ మామిడిపూడి వెంకటేశ్వరులు ఎం.ఏ. గారు వీని నెత్తి నాకు చూపిరి. వారియెడ నేను కృతజ్ఞుఁడను.

7. AR No. 411 of 1893, SII. IV No. 1333.

8. AR No. 249 of 1905.

"రాజేంద్రచోడనృపకార్యధురావిధావతంద్రః
శ్రీబోయచోడిరతి వైభవనిర్జితేంద్రః"

ఈశాసనప్రతిబింబమును నాకుఁ జదువనిచ్చిన (ముందటి) గౌరన్మెంటు ఎపిగ్రాఫిస్టుగారైన రావు బహదూరు సి. ఆర్. కె. చార్లుగారికి నా చేమోడ్పులు.

9. AR No. 160 of 1899, SII VI No. 602.

లేఖకుఁడు 'వెలంది'యని తప్పు చెక్కినాఁడు. ఈ శాసనములనుబట్టి చూడఁగా క్రీ. శ. ౧౩-వ శతాబ్ద ద్వితీయపాదమునఁ గులోత్తుంగరాజేంద్రచోడగొంక, లేక కులోత్తుంగరాజేంద్రచోడఁ డను రాజొకఁడు వెలనాడుప్రాంతదేశము నేలుచుండె ననియు, నతఁడు మొదట కాకతిగణపతిచే నోడింపఁబడి యటుతరువాత నతనిచే సంరక్షింపఁబడెననియు తెలియుచున్నది. నాయనిపల్లిశాసనమునఁ జెప్పినట్లు కాకతిగణపతిదేవుని చేఁబట్టువడినకులోత్తుంగరాజేంద్రచోడుఁడితఁడేకావున సిద్ధేశ్వరచరిత్ర సోమదేవరాజీయములందుఁ జెప్పిన రీతిని కాకతిగణపతి వెలనాటిని జయించి వెలనాటిరాజుకడ నప్పనలుగొనుట వాస్తవమని నాయనిపల్లిశాసనము సాక్ష్యముబలుకుచున్నది.

## 3

సరే. గణపతిదేవుఁడు కులోత్తుంగరాజేంద్రచోడని ద్రవిళమండలమునఁ బట్టుకొనినట్లు నాయనిపల్లి శాసనమునఁ జెప్పియున్నదికదా. వాస్తవముగ నితఁడు వెలనాటి రాజే యైనచో గణపతిదేవునికి ద్రవిళమండలమునఁ బట్టువడుట యెట్లు సంభవించెను? ద్రవిళమండలముపై వెలనాటి రాజుల ప్రభుత్వము సాగలేదుగదా. కులోత్తుంగరాజేంద్రచోడనికి ద్రవిళమండలముపై నధికారము లేదు; అతఁడు ద్రవిళమండలమునకుఁ బోవుటకుఁ గారణము పాకనాటి తెలుఁగుచోళ రాజులతో నతనికిఁగల వైరము. ఈవిషయము జక్కఁగఁ దెలిసికొనవలయుననినఁ దత్పూర్వయుగ తీరాంధ్రదేశచరిత్రను గొంత స్మరణకుఁ దెచ్చుకొనవలసి యున్నది. దానార్ణవుని పుత్రులు చోళరాజకుటుంబముతో సంబంధముజేసికొని చోళచక్రవర్తియగు రాజరాజు సహాయముచే వెంగిదేశమునకు మరలివచ్చినప్పటి నుండియుఁ దీరాంధ్రదేశముపైఁ దమ సార్వభౌమతను నెలకొల్పుటకై చోళులకును, కల్యాణిచాళుక్యరాజులకును నిరంతరము పోరాటము నడచుచుండెను. కాదాచిత్కముగ కల్యాణిచాళుక్యులు విజయులై వెంగిని, దత్ప్రాంతభూములను స్వాధీనపఱచుకొనుచు వచ్చినను మొత్తముమీఁద చోళులదే పైచేయగుటచేత వారి యధికారమే సాగుచువచ్చెను. క్రీ. శ. ౧౦౭౦ సంవత్సరము నుండియు వెంగిచాళుక్యరాజరాజు కుమారుఁడు మొదటి కులోత్తుంగచోళదేవుఁడు దన మాతామహుని దగు చోళసామ్రాజ్యమునకుఁగూడ దానే యధిపతియై చోళదేశమునందే స్థిరముగ నివసించుటచేత వెంగి సంపూర్ణముగ చోళసామ్రాజ్యాంతర్గత మండలమై మారిపోయెను. మొదటి కులోత్తుంగచక్రవర్తి మరణకాలమువఱకు వెంగి యతని స్వాధీనముననే యుండెను; కొంతకాల మతఁడు దన పుత్రులను వెంగికిఁ బ్రతినిధులుగఁ బంపుచువచ్చినను క్రమక్రమముగ దానిపై శూద్రకులజులైన వెలనాటిరాజుల కారులుగ నియమించెను. క్రీ. శ. ౧౧౧౮-వ సంవత్సరమునఁ గులోత్తుంగచక్రవర్తి మరణానంతరము కల్యాణిచాళుక్యచక్రవర్తి యగు త్రిభువనమల్ల బిరుదాంకితుఁడగు నాఱవ విక్రమాదిత్యుఁడువెంగిపై దండువెట్టి చోళుల నుచ్చాటనజేసి కంచిపర్యంతము గల యావత్తీరదేశమును స్వాధీనపఱచుకొని,[10] యట్లు స్వాధీనమైన దేశమును దన సామంతులకును,దండనాయకులకును వృత్తులుగఁ బంచియిచ్చెను. తీరాంధ్రదేశమున కల్యాణి చాళుక్య చక్రవర్తుల యధికారము క్రీ. శ. ౧౧౩౫-౬ వఱకును నడచినది; తరువాత వెలనాటిరాజులు వారిని దఱుమఁగొట్టి వెంగిదేశమును మరల స్వాధీనముగావించుకొనిరి. కల్యాణి చాళుక్యరాజ్యము తూర్పు తీరమున నింతటితో సంపూర్ణముగ నమసిపోయినను, వారికడ వృత్తులు గొని దేశమును పాలించుచుండిన సామంతుల గొంద అచ్చటనే స్థిరముగ నిలిచిపోయిరి. వీరియందు

---

10. గుంటూరుజిల్లా తెనాలితాలూకాలోని కొల్లూరుగ్రామమునందుఁ గానవచ్చు నొక శిలాశాసన మీవిషయమును వ్యక్తపఱచుచున్నది. SII IX—i. No. 220.

"...వెంగియనుప్పినకట్టైయమంచిసుట్టో [మ్మ]డువ ...యంజి కంచివరెగంబిఱు తోడిసెగత్తైగెట్టుదో దవళిదిరఞ చోళికనదాజేయవెప్పే వెసాహసంగళిం."

ముఖ్యముగఁ బేర్కొనఁదగినవారు నెల్లూరు తెలుఁగు చోళరాజులు. వీరిని సిద్ధిరాజులని చెప్పుటయుఁ గలదు.

నెల్లూరునందు తెనుఁగుచోడరాజుల యధికారము క్రీ. శ. ౧౧౫౦ సంవత్సరమునకు పూర్వము ప్రారంభము కాలేదు. నన్నెచోడకవిరాజు తన కుమారసంభవ పీఠికయందు- [11]

" అరినరపాలమాళి దళి
తాంఘ్రియుగుం డయి పాకనాటియం
దిరువదియొక్క వేయిటి క
ధీశుఁడు నాఁజను చోడబల్లి కిం
జిరతరకీర్తి కగ్రమహి
షీ తిలకంబన హైహయాన్వయాం
బరశశిరేఖయైన గుణ
భాసిని శ్రీసతికిన్ దనూజుఁడన్."

అని వ్రాసియున్నాఁడు. కాని నన్నెచోడఁడు గాని, యాతని తండ్రియగు చోడబల్లి గాని పాకనాటియందు[12] రాజ్యము చేసినట్లు రుజువుసేయఁగల శాసనము లెవ్వియు నింకను లభ్యపడలేదు. క్రీ. శ. ౯౩౦-౭౦ ప్రాంతమున పాకనాటిలోని పొత్తపియందు బల్లియచోళ నామాంకితుఁ డగు తెలుఁగు చోళరాజొక్కఁడు రాజ్యము సేయుచుండినట్లొక ప్రాచీన తామ్రశాసనమువల్లఁ దెలియవచ్చుచున్నది.[13] ఇతఁడు నన్నెచోడని తండ్రి కావచ్చును. ఈయూహ సరియై నప్పటికిని వెలిగొండలకు తూర్పున నతని యధికారము చెల్లుచుండెననుట కవకాశము లేదు. మఱియు నితనికి నెల్లూరు శాఖవారితో సంబంధ మున్నట్లు తోఁచదు.

నెల్లూరు తెనుఁగు చోళకుటుంబము పొత్తపి కుటుంబమునుండి చీలిన యొక యుపశాఖ. క్రీ. శ. దశమశతాబ్ద పూర్వార్ధమున తమిళదేశమున కంతటికి నధిపతియై ప్రభుత్వము సల్పుచుండిన పరాంతకుని సామంతులలో నొక్కఁడు, మధురాంతకుఁ డనునతఁడు దక్షిణాంధ్రమునం దిప్ప కడపజిల్లాయం దాగ్నేయమున పొత్తపి యను నగరము నిర్మించుకొని రాజ్యము సేయుచుండెను. ఈ కారణముచే నతనికి మధురాంతక పొత్తపి చోళుఁ డను నామము కలిగెను. ఈ మధురాంతకపొత్తపి చోళుని సంతతి తామరతంపరగఁ బెరిగి పరమండలములకుఁ బ్రాఁకినది. ఇం దనేకులు ఆద్యము రాష్ట్రకూట చక్రవర్తులకును, వారి యనంతరము కల్యాణి చాళుక్య చక్రవర్తులకును సామంతులై పశ్చిమాంధ్రమునను, కర్ణాటకమునను జిన్నచిన్న సంస్థానము లేర్పఱచుకొని రాజ్యము సేయుచుండిరి. ఇట్లు పొత్తపి నుండి బయలువెడలి యన్యస్థలము లునికిపట్టులుగ నేర్పఱచుకొనిన తెనుఁగు చోళకుటుంబములలో నెల్లూరు తెనుఁగు చోళ కుటుంబ మొక్కటి. దీనికి మూలపురుషుఁడు తెలుంగు బిజ్జన. ఇతఁడు క్రీ.శ. ౧౦౧౮ మొదలు ౧౦౫౪ వఱకును చోళసామ్రాజ్యమును బాలించిన మొదటి రాజాధిరాజ చోళచక్రవర్తితోఁ బ్రతిఘటించి యుద్ధము సల్పిన చాళుక్య చక్రవర్తియగు నాహవమల్ల త్రైలోక్యమల్ల బిరుదాంకితుఁ డగు ప్రథమ సోమేశ్వరుని పక్షమున నిప్పటి గద్వాలు సంస్థానమునకుఁ జెందిన పూండూరను గ్రామముకడ క్రీ. శ. ౧౦౪౮-వ సంవత్సరమున యుద్ధము చేసిన ట్లప్పటి చోళశాసనము వల్లఁ దెలియవచ్చుచున్నది.[14] మఱియు క్రీ. శ. ౧౦౭౯-౮౦ సంవత్సరమున నితఁడు త్రిభువనమల్ల బిరుదాంకితుఁ డైన యాఱవ విక్రమాదిత్యుని సామంతుఁడుగ కన్నెమున్నూఱు, పెడకల్లేనూఱు, నెఱవాడియేనూఱు దేశములను పాలించుచుండెను.[15] ఇతని రాజధాని ఇప్పటి

---

11. కుమారసంభవము ౧-౫౩.

12. గుండ్లకమ్మకు దక్షిణమున వెలిగొండలు మొదలు సముద్రతీరమువఱకుఁ గల దేశమునకు పూర్వము పాకనాడని పేరుచెల్లుచుండెను. కొంచెమించుమించుగ నిప్పటి నెల్లూరు మండలమును, కడప మండలములోని తూర్పుభాగమును గలసిన నప్పటి పాకనాటికి సరిపోవును.

13. C. P. No. 6 of 1935-36.

14. SII. IV. No. 329.

15. SII. ix. i. No. 149.

హైదరాబాదు సంస్థానమునకుఁ జెందిన గుల్బర్గ జిల్లాలోని యాతగిరి. ఆతఁడు విక్రమాదిత్య చక్రవర్తి తూర్పుసముద్రతీర దేశమును జయించినప్పుడు తెలుఁగుబిజ్జన సంతతివారికి పాకనాటిలోఁ బూర్వభాగమును, గంచివఱకును గల ద్రవిడదేశమును లభించెను. ఇదిమొదలు బిజ్జనసంతతివారు నెల్లూరు రాజధానిగఁ బాకనాటిని, ద్రవిళదేశమునందుఁ గొంతభాగము నేల నారంభించిరి. ద్రవిళదేశమునకు ముఖ్యపట్టణ మైన కాంచీపురము వారికి రెండవ రాజధాని యాయెను. నెల్లూరు తెలుఁగు చోడకుటుంబమునకుఁ జెందిన రాజులలో మనకుఁ దెలిసినంతవఱకును ప్రాచీనతముఁడు సిద్ధిబేతఁడు. శకాబ్దము ౧౦౫౮ నకు సరియైన క్రీ. శ. ౧౧౩౭ నాఁటి యొక్క శిలాశాసనమున నితఁడు వెలనాటి మొదటి రాజేంద్రచోడునిచే నోడింపఁబడినట్లు చెప్పియున్నది. 15a ఇతనితరువాతఁ బేర్కొనవలసినవాడు మొదటి నల్లసిద్ధి. ఇతని శాసన మొకటి క్రీ.శ. ౧౧౬౦ నాఁటిది కడపజిల్లాలో పెన్నగట్టున దొంగలసాని కనుమయం దున్నది. ఇం దితఁడు కాంచీపురాధీశ్వరుఁ డనియు, నెల్లూ రితని రాజధాని యనియుఁ జెప్పియున్నది.16 అప్పటికప్పుడే ఇతఁడు బలవంతుఁడై పొత్తపి రాజ్యముపై దండెత్తిపోయి యచ్చట రాజ్యము సేయుచుండిన తెలుఁగుచోడరాజును సంహరించి సిద్ధవటమువఱకుఁ గల దేశమును స్వాధీనము జేసుకొని నిజరాష్ట్రమునఁ గలుపుకొనియెను. ఈ విజయమువల్ల నెల్లూరు తెలుఁగు చోళరాజ్యము ప్రబలి శత్రుభీకరమాయెను. కల్యాణి చాళుక్యచక్రవర్తులను తీరాంధ్రమునుండి వెడలనడచి యథాపూర్వము చోళచక్రవర్తుల పేర రాజ్యము సేయఁ గడంగిన వెలనాటి గొంకరాజు ఆంధ్రదేశాంతర్గతమైన చోళసామ్రాజ్యమున కంతటికిని దానే యధికారి నని తలఁచి పాకనాటిని సైతమాక్రమించుకొనుటకుఁ దలపెట్టెను. నెల్లూరు తెనుఁగు చోళులు వీరిని సరకుగొనక ప్రతిఘటించి నిలచిరి. ఈరెండింట్ల సందును కలహము గలుగుట కిదియే కారణము.

రెండవ గొంకరాజు కడపటిదినములలో నతఁడు పాకనాటిమీఁద దండు వెడలి యాదేశము నాక్రమించుకొనినట్లు శాసనములందు సూచనలు గానవచ్చుచున్నవి. బాపట్ల భావనారాయణస్వామి యాలయములో శకాబ్దము ౧౦౮౨ నకు సరియైన క్రీ. శ. ౧౧౬౦-౬౧ నాఁటి యొక్క శిలాశాసనమున నీ రెండవ గొంకరాజు ధనదుపురము రాజధానిగ నకరము (ముఖలింగము) నెల్లూరులకు మధ్య నుండు తీరదేశమును బాలించె నని చెప్పియున్నది.

"రమణీయధనదపురవర
మమరగ నిజరాజధానియై యుండఁ గనక
రము నెల్లూరును లోపుగ
గ్రమమొనరఁగ నేలె బాహుగర్వము వెలయన్."17

ఈవిషయమును మంచనయుఁదనకేయూరబాహుచరిత్రమునందు నుడివియున్నాఁడు.

"అరుదందన్ వెలనాటి చోడనను జేం
ద్రాజ్ఞాపనం బూని దు

15 a. ARE. 1916, Part II. para 48.

16. పూర్వము మా డిపార్టుమెంటులో రిసర్చి స్టూడెంటుగా నుండిన శ్రీ. ముట్నూరు వెంకటరామయ్య ఎం.ఏ.గారు దీని ప్రతిబింబము తీసి మాకచేరీయందు భద్రపఱచియున్నారు. ఎపిగ్రాఫియా ఇండికాలో వీరుచక్కఁగ దీనిని బరిష్కరించి ప్రకటింపఁ బోవుచున్నారు.

17. భారతి సంపు. ౭, సం. ౧౦ పుట ౧౧౯. ఈశాసనము అఱకొఱగా సర్కారుశాసనపరిశోధకశాఖవారిచేఁ (చూ: దక్షిణ ఇండియాశాసనములు సం. ౬ నెం. ౧౧౭) బ్రకటింపఁబడెను. ఇందు శాసనోక్తదానకాలమును దెల్పు భాగము లేదు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు దీనిని "వెలనాటి చోళవంశావళి - కేయూరబాహుచరిత్రము" అను వ్యాసమున సంపూర్ణముగఁ బ్రకటించిరి. వారి వ్యాసమునుండి ఈపద్యమును గ్రహించినాఁడను.

త్తరశ త్తిఁ జని యేకవింశతిసహ
స్రగ్రామ సంఖ్యాకమై
ధరణిఁ బేర్చిన పాకనాఁడు నిజదో
ర్దండైక లగ్నంబుగా
ధర బాలించె నమాత్యకొమ్మనజగ
త్ప్రఖ్యాతచారిత్రుఁడై." 18

ఇట్లు వెలనాటి రెండవ గొంకరాజు నెల్లూరు పర్యంతము గల దేశము నేలె ననియు, వెలనాటి చోడని యాజ్ఞప్రకారము అతని మంత్రియగు కొమ్మన పాకనా డేకవింశతిసహస్రగ్రామములను జయించె ననియు పై నుదాహృతములైన శాసనాదికములవలనఁ దెలియవచ్చుచున్నను, ఒంగోలునకు దక్షిణము వెలనాటి వారి యధికారము వ్యాపించెనని తెలుపు సూచన లెవ్వియుఁ గానరావు. వెలనాటివారి శాసనము లొక్కటియైనను, దరిశిప్రాంతములయందుఁదప్ప మఱియెచ్చటను గానరాకపోవుట పరిశీలించఁదగిన విషయము. పాకనా డెంత కాలము వెలనాటి రాజులకు లోఁబడియుండెనో నిశ్చయించిచెప్పుటకు వీలులేదు. వీరి శాసనము లెవ్వియుఁ గాన్పించకపోవుట చూడఁగా వీరి యధికార మచట సాగినది యల్పకాలమనియే తోఁచుచున్నది.

ఈపట్టున పరామర్శించఁదగిన విషయ మొకటి కలదు. గుంటూరుజిల్లా తెనాలితాలూకాకుఁ జెందిన మొప్పఱ్ఱు అను గ్రామమున నుండు శకాబ్దము ౧౦౬౨, అనఁగా క్రీ. శ. ౧౧౪౦ నాఁటి యొక శిలాశాసనమున (రెండవ)కులోత్తుంగరాజేంద్రచోడయరాజుల పడవాలు గొంకయ తాను ౩౦ వేలకర్ణాటాశ్వబలము దాకకు లొంగనీయక క్రొచ్చెఱువును సంరక్షించినట్లు చెప్పుకొనియున్నాఁడు.[19] మంచనయుఁ గేయూరబాహుచరిత్రయందీ యుద్ధమునువర్ణించియున్నాఁడు. పైఁ జెప్పినకులోత్తుంగ రాజేంద్రచోడని మంత్రియుఁ, బాకనాటి పాలకుఁడు నైన కొమ్మన ఈయుద్ధమునఁ బాల్గొని శత్రుసంహారము గావించి తన ప్రభువునకు జయము చేకూర్చెనని ప్రశంసించియున్నాఁడు.

"చలము మెయిఁ గటకసామం
తులు గరిహయబహుళసేనతో నేతేరఁ
దలపడియెఁ గొమ్మసచివుఁడు
బలియుండై క్రొత్తచర్ల పరిసరభూమిన్.

సెలకట్టెవాటున జెలఁగి రెంటెని మూఁటెఁ
గూడ గుఱ్ఱంబుల గుదులగ్రుచ్చుఁ
బ్రతిమొగంబగు నరపతుల కత్తెశమున
గడిమిమై వీఁపులు వెడలఁబొడుచు,
బందంపు గొఱియల పగిది నేనుంగుల
ధార శుద్ధి నసిధార నునుము
జిదియించుఁ బిగిలించుఁ జేతులతీఁటవో
వడిఁ గాండమేసి మావతుల తలలు
తల పుడికి వేసి మావంతుతలలు శత్రు
రాజశిరములు ద్రొక్కించు రాఁగఁదిరుగు
వాగె నుబ్బెడు దన వారువంబుచేత
మహితశౌర్యుండు కొమ్మనామాత్యవరుఁడు"[20]

మొప్పఱ్ఱుశాసనమునందలి క్రొచ్చెఱువే కేయూరబాహుచరిత్రలోని క్రొత్తచర్ల. అందలి కర్ణాటకులే ఇందలి కటకసామంతులు. కటకము, అనఁగా కల్యాణ కటక మా కాలమందు కర్ణాటకసామ్రాజ్యమునకు రాజధాని; కాలచుర్యు లపు డచట సామ్రాజ్యపదము నాక్రమించుకొని రాజ్యము సేయుచుండిరి; కావున క్రీ.శ. ౧౦౪౦ కి పూర్వము కల్యాణి నేలుచుండిన కర్ణాటక చక్రవర్తులలో నెవ్వరో వెలనాటి రాజ్యముపై నెత్తి వచ్చిరనియు, వారిని క్రొచ్చెఱువు, లేక క్రొత్తచర్లరణ క్షేత్రమున వెలనాటికులోత్తుంగరాజేంద్రచోళుని భృత్యులు గొంకయయుఁ, గొమ్మనయు యుద్ధమున నోడించి పాఱఁదోలిరనియుఁ దెలియవచ్చుచున్నది.

క్రొత్తచెర్లకడ వెలనాటి సైన్యములచేఁ బరాజితులైన కర్ణాటకు లెవ్వరో విచారించవలసియున్నది. వీరిని ఆనవాలుపట్టుటయందు పరిశోధకులు గొంత యభిప్రాయభేదమును గనపఱచియున్నారు. సర్కారుశాసన

18. కేయూరబాహుచరిత్ర, ౧-౨౬.

19. ARE 1921. Part II Para 64.

20. కేయూరబాహుచరిత్రము, ౧: ౨౪-౮.

పరిశోధకశాఖవారి కర్ణాటకులు బిజ్జలుని పక్షమువా రనిరి. "కల్యాణచాళుక్యుల కది క్షీణకాలము. మూఁడవ తైలుఁడు క్రీ. శ. ౧౧౬౩లో మృతినందెను; అతనికి తరువాతివాఁడగు నాల్గవ సోమేశ్వరుఁ డశక్తుఁడు; అధికారమంతయు బిజ్జలునిచేత నుండినది. క్రొచ్చెఱువుకడ జరిగిన యుద్ధమున బహుశః అప్పుడే పాశ్చాత్యచాళుక్యుల యధికారమును దొలఁగించఁ బ్రయత్నములు సల్పుచుండిన యనుమకొండ కాకతీయుల సహాయమునుపొంది బిజ్జలునితో (వీరు) పోరియుండవచ్చును."[21] ఇది సరికాదని మారేమండ రామరావుగారు నిరసించిరి. వెలనాటి చోళులకును, కాకతీయులకును నిరంతరవైరమేకాని చెలిమి యెన్నఁడును లేదు. కావున వెలనాటి రాజులు కాకతీయుల సహాయమును బొంది క్రొచ్చెఱువుకడఁ గర్ణాటకుల నోడించిరనుట సమంజసము కాదని వీరు చెప్పిరి. వీరి యాక్షేపణ యొప్పఁదగినదే కాని క్రొచ్చెఱువుకడ నోటువడిన కర్ణాటకులు కల్యాణకటక చక్రవర్తి సర్వజ్ఞసోమేశ్వరునిపక్షమున క్రీ.శ. ౧౧౭౬-వ సంవత్సరప్రాంతమున వేంగిని పాలించుచుండిన లక్ష్మణ దండనాయకగోవిందదండనాయకు లనియు, నీక్రొచ్చెఱువుయుద్ధము రెండవగొంకరాజుచే వీరు పరాజయము నందిన గోదావరీసంగరమునకుఁ బూర్వమే నడచెననియు వీరు చెప్పు మాటలు పాటించఁదగినవి కావు.[22] గోదావరీసంగరము నడచినది క్రీ. శ. ౧౧౩౫ ప్రాంతమునందు; క్రొచ్చెఱువు యుద్ధమునఁ బోరాడినవారు క్రీ. శ. ౧౧౬౩ న రాజ్యాధిపత్యము వహించిన (రెండవ) కులోత్తుంగరాజేంద్రచోడని భృత్యులు; వీరు గోదావరీసంగరకాలమున నుండిరని సూచించు నాధారము లెవ్వియులేవు. కావున క్రొచ్చెఱువు యుద్ధము రెండవ కులోత్తుంగరాజేంద్రచోడని రాజ్యకాలముననే జరిగెనని తలఁచుట యుక్తము. క్రొత్తచర్లయుద్ధమున నోటువడిన కర్ణాటకు లెవ్వరో కనుగొనుటకు మైసూరుసంస్థానాంతర్గతమైన శిమొగజిల్లా హొన్నాళితాలూకా బెళగుత్తిగ్రామమందలి శకాబ్దము ౧౧౦౨, అనఁగా క్రీ. శ. ౧౧౮౦ నాఁటి శిలాశాసనము కొంత తోడ్పడుచున్నది. ఇందు కాలచుర్యబిజ్జలుని కుమారుఁడగు సంకమదేవుని సేనాధిపతియైన కావణయ్యదండనాయకుఁడు వెల్నాటిచోళియ రాజ్యనిర్మూలనుఁడని చెప్పియున్నది.[23] మఱియొక శాసనమందుఁగూడ నీ కావణయ్యదండనాయకుఁడు 'వెలునాడచోళియనిర్మూళన'యనియు, నతని డాకఁ గాఁగలేక నావెలునాడుచోళియ యళికె ననియుఁ జెప్పియున్నది.[24] మొప్పఱ్ఱుశాసనమునను, కేయూరబాహుచరిత్రయందును జెప్పఁబడిన కర్ణాటకులును, గటకసామంతులును నీకావణదండనాయకుఁడును, నతని యనుచరులునునగుదురా యనునది ప్రస్తుతము తీర్మానించవలసిన విషయము. ఒకదృష్టితోఁ జూచిన కావణయ్యదండనాయని, నతని యనుచరులనే వెలనాటిచోడయ యొక్క పడవాలగు గొంకయయు మంత్రి యగుకొమ్మనయు క్రొత్తచర్లయుద్ధమున నోడించిన దని తోఁచుచున్నది. క్రీ. శ. ౧౧౭౦,౧౧౮౦ ల యెడ మంతగ పరిగణింపఁదగినది కాదు. క్రీ. శ. ౧౧౮౦ నాఁటి శాసనములలోఁ గావణయ్యదండనాయకుఁడు దన వెలనాటి దండయాత్రను ప్రస్తావించియున్నను నాదండయాత్ర క్రీ. శ. ౧౧౭౦-వ సంవత్సరముననో, దాని కించుక పూర్వముననో జరిగియుండవచ్చును. ఇందసాధారణ మేమియు లేదు. కాని, యన్యథా చింతించిచూచిన క్రొత్తచర్లయుద్ధమునకును, కావణ దండనాయకుని వెలనాటి దండయాత్రకును సంబంధము లేనట్లు తోఁచుచున్నది. మొప్పఱ్ఱుశాసనమునను, కేయూరబాహుచరిత్రయందును వెలనాటి రాజేంద్ర చోడుని భృత్యులు క్రొత్తచర్లయుద్ధమున కర్ణాట కటకసామంతుల నోడించి పాఱఁదోలినట్లున్నది; దీనికి విరుద్ధముగ కావణదండనాయకుఁడు వెలనాటిచోళియ రాజ్యమును నిర్మూలించినట్లు అతని శాసనములందు

21. **ARE 1921, Part II, Para 64.**

22. **JAHRS. V. pp 69-70.**

23. **EC. VII. Hl. 50.**

24. **Ibid. XI. Dg.44.** "భరది నళ్కిద నా వెలునాడచోళియం" "వెలునాడచోళియనిర్మూళన"

చెప్పియున్నది. మఱియు నీకావణదండనాయకుఁడు క్రీ. శ. ౧౧౭౬ న రాజ్యపాలనము సేయ నారంభించిన కాలచుర్యసంకమదేవుని శాసనములందు తప్ప మఱి యెచ్చటను బేర్కొనఁబడియుండలేదు. తత్పూర్వము కాలచుర్యరాజులపక్షముననఁగాని, యన్యులపక్షముననఁ గాని యతఁడు యుద్ధము జేసెనని చెప్పుట కెట్టి యాధారమును గానరాదు. క్రొత్తచర్లయుద్ధమునకును, కావణయ్యదండనాయకుని దండయాత్రకును సంబంధము లేదని తలఁచుటకుఁ గారణము ప్రబలమైనది మఱియొకటి కలదు. పై నుదాహృతమైన బెళగుత్తిశాసనమునఁ గావణయ్యదండనాయకుఁడు వెలునాడచోళయరాజ్యనిర్మూలనుఁ డనియు, హరిహర శాసనమున వెలునాడచోళయనిర్మూలనుఁడనియుఁ జెప్పియున్నదికదా. దీనికి సరిగ పై శాసనములకాలముననే వెలనాటియందు రాజ్యవిప్లవమొకటి సంభవించినది. క్రీ. శ. ౧౧౭౦ తో వెలనాటి రెండవ కులోత్తుంగరాజేంద్రచోళుని యేలుబడి తుదముట్టినది. తరువాత క్రీ.శ.౧౧౭౬ వఱకును వెలనాటి నెవ్వరేలుచుండినది తెలియదు. ౧౧౭౬ మొదలు పై రెండవ కులోత్తుంగరాజేంద్రచోళుని మనుమఁడు పృథ్వీశ్వరుఁడు రాజ్యముసేయ నారంభించెను; కాని ఇతని శాసనములొక్కటియైనను వెలనాటియందుఁగాని, వేంగియందుఁగాని కానరావు; అవి గోదావరికి తూర్పున ఇప్పటి తూర్పుగోదావరి విశాఖపట్టణమండలములయందే కానవచ్చుచున్నవి. వెలనాటిరాజుల వంశావళిని బరిశీలించుసందర్భమున శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారీవిషయముపై నిట్లు వ్రాసియున్నారు:

"రెండవచోడరాజుశాసనాలు క్రీ. శ. ౧౧౭౧ (?) వరకే కనుపిస్తున్నవి. రెండవచోడరాజుతరువాత శాసనాలు కనుపించిన వెలనాటిభూవరుని పేరు పృథివీశభూపతి. ఇతని శాసనాలు క్రీ. శ. ౧౧౭౬ మొదలు ౧౨౦౬ వరకు కనబడుతున్నవి. అవి ఇతనికి పూర్వపు రాజుల శాసనాలవలె ఈ వంశమువారికి రాజధాని అయిన 'ధనదుప్రోలు' (ఇప్పటి చంటవోలు, రేపల్లి తాలూకా) ప్రాంతమునగాక విశాఖపట్టణమండలమునను, ఆప్రాంతములను గనబడుటచేత పృథివీశ్వరదేవమహారాజుల కాలమున గాని, ఆతనికి పూర్వుని కాలమునగాని పరరాజాక్రమణమువల్ల వీరికి వెలనాటిరాజ్యము దక్షిణమున సంపూర్తిగా గాకపోయినను కొంతవఱకైన పోయియుండు ననిన్నీ, అందువల్లనే ఈ వంశమువారి శాసనాలు గోదావరి కెగువ దేశమున గనబడడము తటస్థించెనని న్నీ ఊహించవలసి ఉంటుంది"[25]

శ్రీ సోమశేఖరశర్మగా రూహించినట్లే మల్లికార్జున పండితారాధ్యుని శాపమువలన వెలనాటి చోడునికి చరమదశయందు ప్రకృతులతో విరోధము పొసగినదనియు, మరణానంతర మంతఃకలహములవల్ల నతని వంశజులకు రాజ్యనష్టమును, కులక్షయమును గలిగెననియుఁ బాల్కురికి సోముఁడు దన పండితారాధ్యచరిత్రయందు నుడివియున్నాఁడు.

"మనుజేసనకు నంత మంత్రివిరోధ
మును బ్రధానవిరోధమును నాప్తభటవి
రోధంబు బుత్రవిరోధంబు నిరప
రాధంబుఁ బుట్టె"

* * *

"అనుచు నంతకు పురి కరిగెఁ జోడండు
నంత రాజ్యార్థమై యని బోరి యతని
సంతాన మెల్ల నిస్సంతాన మయ్యెఁ
బాడయ్యె తద్భూమి పండితవిభుని
యీడితశాపమహిమ్మతఁ జేసి." [26]

పాల్కురికి సోమన ప్రాచీనుఁడు; వెలనాటి చోడనికిఁ దరువాత దాదాపు నూఱేండ్లలో నుండినవాఁడు; వెలనాటి రాజ్యపతనమును గురించి యతఁడు దన కాలమున వాడుకయం దుండిన కథను గ్రంథస్థము జేసినాఁడు. ఈకథయం దుక్తమైన విషయములన్నియు విశ్వాసపాత్రములు గాకపోవచ్చును. కాని దాని నాధారపఱచుకొని వెలనాటిరాజుల యేలుబడి సమాప్తమైన నూఱేండ్లతరువాత వారి రాజ్యము రెండవ చోడరాజు మరణానంతరము రాజకుటుంబము

25. భారతి సంపు. ౪ సం. ౧౦. పుట ౧౨౧.

26. పండి. (ఆంధ్ర.ప్రతి) భాగ. ౨, మహిమ ప్ర. పుటలు ౬౦,౬౭-౬౯.

లోని యంతఃకలహముల మూలమున నుత్పన్నమాయె నను నమ్మకము జనసామాన్యమునందు వాడుకయం దుండెనని మనము నిశ్చయముగఁ జెప్పవచ్చును. కావున కావణదండనాయకుఁడు క్రీ. శ. ౧౧౫౦-వ సంవత్సరమున వెలనాటిపై నెత్తివచ్చి పై రెండవ (కులోత్తుంగరాజేంద్ర)చోడని సైన్యమును నాశనము గావించి, దేశమున క్షోభ కావించెననియు, నాయుద్ధమునందో, తరువాత అచిరకాలముననో అతఁడు మృతి నందఁగా, రాజదౌర్బల్యము దమ పన్నాగములకు సహకారి కాఁగా రాజకుటుంబములోనివా రెవ్వరి మట్టుకు వారే స్వతంత్రులై సింహాసనమునకై పోరి రాజ్యక్షయమునకుఁ గారకులైరనియుఁదలఁచుట కవకాశము కలదు. ఈ తలం పసమంజసము గానిపక్షమున కర్ణాటకులు వెలనాటిపై (క్రీ. శ. ౧౧౪౦ సంవత్సరమున నొక పర్యాయమును, ౧౧౫౦ సంవత్సరమున మఱియొకపర్యాయమును) రెండుమారులు ఎత్తివచ్చిరనియును, మొదట వెలనాటి చోడరాజు వారి నోడించి తఱుమఁగొట్టినను దరువాత వారిచేఁ బరాజితుఁ డాయెననియుఁ జెప్పవలసియున్నది.

ఇంతవఱకు వెలనాటిపై నెత్తివచ్చిన కర్ణాటక కటకసామంతు లెవ్వరో కనుగొంటిమి. ఇఁక వారి నోడించిన రణక్షేత్రము క్రొచ్చెఱువు, లేక క్రొత్త చర్ల యెచ్చటిదో విచారించవలసియున్నది. ఇది నెల్లూరుమండలములోని దర్శితివిపనకుఁ జెందిన కొచ్చెర్లకోటగాని యన్యము గాదు. ఇది ప్రాచీన ముఖ్యస్థలము. క్రీ.శ. ౧౨, ౧౩-వ శతాబ్దముల శాసనములయం దీ యూరి పేరు "క్రొత్తచెఱువు" అని చెప్పియున్నది.27 క్రొత్తచెఱువునకు సంగ్రహరూపమే క్రొచ్చెఱువు. ఇదియే వ్యవహారభాషయందు కొచ్చెర్లగ మారినది. ఇచట నోరుగంటి ప్రతాపరుద్రుఁ డొక కోటఁ గట్టుటచేత కొచ్చెర్లకోటయైనది.

క్రొత్తచర్ల పాకనాటి పశ్చిమోత్తరమున నుండెడి గడిదుర్గము. ఇచ్చట వెలనాటివారికిఁ గర్ణాటకులతో యుద్ధమగుటయు, నీయుద్ధమున వెలనాటిచోడని పక్షమునఁ బాకనాటిని బాలించుచుండిన యాతని మంత్రి కొమ్మనామాత్యుఁడు బాల్గొనుటయు గమనింపఁదగిన చరిత్రాంశములు. వీనినిబట్టి చూడఁగా కర్ణాటకులు అప్పుడు వెలనాటివారి యధీనమునం దుండిన పాకనాటిపై నెత్తివచ్చినట్లు తోఁచుచున్నది. ఈ దండయాత్రకుఁ గారణమును నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. కాని వారు వెలనాటివారి కోడి వారికిఁ దమ రాజ్యమును గోలుపోయిన నెల్లూరు తెలుఁగుచోళులకు సహాయముసేయుటకై పాకనాటిపై నెత్తివచ్చియుండవచ్చును. ఇం దసంగతమేమియు లేదు. నెల్లూరుతెలుఁగు చోళులు కల్యాణి చాళుక్యచక్రవర్తులకు సామంతులై యుండి వారి ప్రసాదమువల్ల పాకనాటి రాజ్యమును సంపాదించిరి. వెలనాటి రాజులు తెమ్మోడించి పాకనాటి నాక్రమించుకొనఁగా వారిని దఱుమఁగొట్టి నష్టమైపోయిన తమ దొరతనమును మరల సంపాదించుకొనుటకు చాళుక్యుల స్థానమున చక్రవర్తి పదము నధిష్ఠించియుండిన కాలచుర్యుల సాయమును గోరియుండ వచ్చును. తమ యధికారమును స్థాపించుటకై రాయమురారిసోవిదేవుఁడును, నటుతరువాత నతని తమ్ముఁడగు సంకముఁడును పాకనాటిపై దండెత్తియుండవచ్చును.

ఇందలి వాస్తవ మెట్లున్నను వెలనాటి రెండవ కులోత్తుంగచోళరాజేంద్రుని యేలుబడి ముగియునంత వఱకును నెల్లూరు తెలుఁగుచోడుల శాసనము లెచ్చటను గానరావు. అతఁడు గతించిన వెంటనే వీరు పాకనాటి నేలుచుండినట్లు శాసనములవల్లఁ దెలియుచున్నది. క్రీ. శ. ౧౧౬౦ సంవత్సరమున నెల్లూరుకాంచీపురములయం దేలుచుండిన మొదటి నల్లసిద్ధికిఁ దరువాత నచట నేలిన మొదటి తెలుఁగుచోళరాజు రెండవ నల్లసిద్ధి; క్రీ. శ. ౧౧౯౪ నాఁటి దొకానొక నెల్లూరు శాసనమున నితఁడు నెల్లూరు రాజధానిగ రాజ్యము సేయుచుండినట్లు చెప్పియున్నది. 28 కావున, నెల్లూరు తెలుఁగుచోళరాజ్యపునరుజ్జీవనకును, వెలనాటి రాజ్యవిప్లవమునకును కార్యకారణసంబంధ ముండినట్లు తోఁచుచున్నది." (సశేషము)

27. నెల్లూరుమండల శాసనములు. సం. ౧. దర్శి ౩౫, ౩౯, ౪౦.

28. నెల్లూరుమండలశాసనములు, సం. నెల్లూరు నెం. ౭౫.

# ప్ర తి రహస్య విచ్ఛేదము

= శ్రీ వసంతరావు వేంకటరావు =

ప్రకృతిని మనం రెండుభాగాలు చేయవచ్చును. మనకు సన్నిహితంగా నుండె మన భూలోకానికి సంబంధించినది ఒకటి; మన లోకానికి సంబంధించనప్పటికి మనలను ప్రచోదిస్తూన్న బాహ్యప్రకృతి రెండవది. బాహ్యప్రకృతిగురించి ముందు విచారిద్దాము.

యావద్విశ్వానికి భూలోకమే కేంద్ర మనిన్ని, స్థిరంగానున్న భూమిచుట్టూ సూర్యనక్షత్రాదులు ప్రదక్షిణాలు చేస్తున్నా యనిన్ని ఆదిని మానవుడు భావించేవాడు. జట్టుకట్టుకొని కూటాలుగా పోతూన్న నక్షత్రరాసులకు పేర్లుపెట్టి వాటి గమనవిధానాన్ని చాలావరకు కనిపెట్టినవారిలో మన ప్రాచీనఋషిపుంగవులు పేర్కొనదగినవారు. ఖగోళవిజ్ఞానం చాలావరకు హిందూ మతగ్రంథాలలో గుప్తమైయుంది. కాని, మానవాహంకారం మూలంగా విశ్వంలో ప్రధానమైనది భూమియే యన్న భావం చాలాకాలంవరకు మానవుని విడువలేదు. ౧౬-వ శతాబ్దంలో భూమి నొక గ్రహంగా గ్రహించి, సూర్యునిచుట్టు గ్రహాలు తిరుగుచున్నాయని కొపెర్నికసు ప్రతిపాదించేడు. ౧౭-వ శతాబ్దారంభంలో గెలీలియో దూరదర్శినిని (Telescope) నిర్మించి, దానితో ఆకాశాన్ని పరిశీలించేడు. చంద్రగోళంకూడ మన భూమివలె కలుకు పర్వతాలతో నిండిన దని కనిపెట్టేడు. దృగ్గోచరం గాని అనేకనక్షత్రాలను చూచేడు. ౧౮-వ శతాబ్దంలో హెర్షలను విజ్ఞాని అతినిపుణంగా దూరదర్శినిని తయారుచేసి, ఆకాశాన్ని శాంతంగా శోధించి, నెబ్యులాలను కనుగొన్నాడు. ఒప్పులకుప్పలాడుచున్న జంట చుక్కలను గుర్తించేడు. యంత్రసౌకర్యంమూలంగా ఆకాశంయొక్క వ్యాప్తి, అందులో కనిపించే నక్షత్రాల సంఖ్య ఎక్కువకాజొచ్చేయి. తరువాత స్పెక్ట్రొస్కోపు (Spectroscope) అనే యంత్రం నిర్మింపబడింది. దానితో నక్షత్రాల దూరం, బరువు, ఘనపరిమాణం మొదలైనవి గణించడానికి అవకాశం కలిగింది. సూర్యు డొక సామాన్యనక్షత్రమని విశదమయింది. బరువులో నక్షత్రాలు సూర్యునిలో ౧౦-వ వంతునుండి సూర్యునికి ౧౦ రెట్లవరకు గల పరిమితిలోనే ఉన్నాయి. ఘనపరిమాణంలోమాత్రం అత్యధికవ్యత్యాస ముంది. సూర్యునిలో ౩౦-వ వంతు ఉరవ కలిగి ౬౦౦౦౦ రెట్లు సాంద్రత గల శ్వేత వామనతార లున్నాయి. గాలిలో నూరవవంతు సాంద్రత, సూర్యునికి ౩౩౦ రెట్లు ఉరవ గల మహాబృహత్తార లున్నాయి.

ఈవిషయాల నాధారంగా జేసికొని జగన్నిర్మాణంగురించి ఒక సిద్ధాంతాన్ని పురస్కరించేరు. ఆదిని ద్రవ్యమంతా జగత్తులో మహావిరళంగా నుండేది. గురుత్వాకర్షణం (Gravitation) వల్ల అది మేఘమండలాలలోనికి విభజింపబడింది. అట్టి మేఘమండలాన్ని గెలాక్సీ (Galaxy) అంటారు. మేఘమండలాల అన్యోన్యాకర్షణంవలన అవి అంతర్భ్రమణం చేయ, మొదలుపెట్టేయి. అవి కృశించేయి; కృశించడంతో భ్రమణవేగం ఎక్కువయింది. ప్రతిమేఘమండలం అప్పంవలె చరిచినట్లయింది. దాని కొనలనుండి ద్రవ్యం విక్షిప్తమయింది; విక్షిప్తద్రవ్యమే నక్షత్రాలుగా సాంద్రీకరించింది. గెలాక్సీలో కోటాను కోట్ల నక్షత్రా లున్నాయి. ఒక నక్షత్రమైన సూర్యుని నుండి గ్రహా లుద్భవించి సూర్యునికి ప్రదక్షిణాలు చేస్తున్నాయి. అట్టి గ్రహాలలో మన భూమి ఒకటి. భూమిలో గణనాతీతంగా నున్న వివిధజంతుజాతులలో ఒకటి మానవజాతి. ఈవిధంగా, జగత్తులో భూమి కెట్టి ప్రాధాన్యం లేదని, దానిలోనున్న జీవాని కెట్టి ప్రాముఖ్యం లేదని, కొన్ని భౌతికావస్థల అను

కాల్యంవల్ల జనించిన జీవం ఆ అవస్థలు మారగానే నశిస్తుందని సూచించిన ఖగోళవిజ్ఞానం మానవాహంకారాని కొక దెబ్బ కొట్టింది.

ఇక మనల నావరించిన ప్రకృతివిషయం. భూమిచుట్టూ కొన్నివందలమైళ్ళ ఎత్తున వాతావరణ ముంది. అందులో వాయువులు భూతలంపై ఒత్తిడి (Pressure) కలిగిస్తున్నాయి. ప్రతిచదరపుటంగుళము ౧౫ పౌన్ల భారాన్ని మోస్తుంది. మనకు తెలియకుండా మనం మోస్తూన్న బరువుకు మన మెరిగినట్లైతే నిజంగా కంపిస్తామేమో! అరంగుళం దళసరిగల వెండిరేకులు ౭౫ జోడించి కప్పుకొంటే ఎంత బరువుంటుందో అంత బరువు కలిగిస్తూంది వాతావరణం. వాతావరణపీడనవిషయమై టారిసెల్లి అను విజ్ఞాని మొదట కనిపెట్టేడు. భారమితి (Barometer) లో 30 అంగుళాల ఎత్తున నిలుచున్న పాదరసాన్ని నిలబెట్టగలిగింది గాలియొక్క బరువేనని గ్రహించేడు. దానిని ప్రాయోగికంగా ౧౬౪౩ లో ఋజువుచేసేడు. మనం కొండపై కెక్కినకొద్దీ కొంత వాయువుని క్రింద విడిచిపోతున్నామని, దాని బరువుకి సమానమైన పాదరసం భారమితిలో తగ్గిపోతుందని, ఒక భారమితిని కొండపైకి తీసికొనిపోయి, దాని పొడవు తగ్గడం పేస్కల్ అన్న విజ్ఞాని చూపించేడు. ఇట్లు ఒక గాజుగొట్టంతోను, పాదరసంతోను మహత్తరమైన వాతావరణపీడనాన్ని గుర్తించేరు.

మనచుట్టూ అనేకవస్తువులున్నాయి. వాటిలో వైలక్షణ్యమేగాని సారూప్యం లేదు. ఈ బహుళత్వంలో ఏకత్వం కనుగొందామన్న కాంక్ష ఆదినుండి మానవునికి తీవ్రంగా ఉంది. ఆధ్యాత్మికచింతనాపరులైన యోగులు ఈ జగత్తు మిథ్య అన్నారు; జీవితం స్వప్నప్రాయ మన్నారు; ప్రతివస్తువులో ఒక అంశ ఉన్న దన్నారు. అట్టి ఏకత్వాన్వేషణకాంక్షచేతనే భౌతికవిజ్ఞానికూడా ప్రచోదింపబడ్డాడు. నానానేక రూపాలు ధరించిన ద్రవ్యానికి మూలమైన ౯౨ తత్వాలు (Elements) లున్నాయని కనుగొన్నారు. ఆ మూలతత్వాలలోనివి కొన్ని రాగి, వెండి, బంగారము, పాదరసము, ప్రాణవాయువు. వీటి వివిధసమ్మేళనంతోనే ఊహింపదగు ప్రతివస్తువు ఏర్పడుతూంది. మన భూమిలోనేగాదు, ఏ నక్షత్రాన్ని శోధించినా దానిలో మన మెరిగిన మూలతత్వాలకన్న వేరొకటి కనిపించదు. యావద్విశ్వము ౯౨ తత్వాలతో నిర్మింపబడింది.

అంతటితో మానవుని జిజ్ఞాస సమాప్తికాలేదు. ఒక మూలతత్వాన్ని సూక్ష్మఖండాలు చేస్తే ఏమౌతుందో కనుగొందామని కుతూహలం జనించింది. ఒక సూక్ష్మఖండాన్ని ఖండఖండాలు చేయగా చేయగా తుదకు ఆ తత్వంయొక్క లక్షణాలు గల సూక్ష్మాతిసూక్ష్మఖండం వస్తుందని, దానికి "పరమాణు" వని నామకరణం చేసేరు. ఒక తత్వంలో నున్న పరమాణువులన్నీ సాకార, సరూప, సలక్షణాలు గలవైయుంటాయి. పరమాణు వొక కఠినగోళ మని, అది అవిభాజ్య మని, దానిని ముక్కలుచేయలేమని చాలా కాలం భావించేరు. కాని, పరమాణువునకు అద్భుత నిర్మాణ ముందని తెలిసింది. పరమాణువును భిన్నం చేసినప్పుడు దానినుండి విద్యుచ్ఛక్తిఖండాలు బయల్వెడలుతాయి. వాటికి "ఎలక్ట్రాను" లని పేరు. అవి ఋణవిద్యుత్ఖండాలు. అదే విద్యుదావేశం కలిగిన ధనవిద్యుత్ఖండాలను "ప్రోటాను" లని, ప్రోటానులంత బరువుండి విద్యుదావేశం లేనివాటిని "న్యూట్రాను" లని అంటారు.

అనేక సూక్ష్మప్రయోగాలు చేసి పరమాణు నిర్మాణం సౌరమండలసన్నిభంగా నున్న దన్న నిర్ధారణకు వచ్చేరు. సౌరమండలసూర్యునివలె పరమాణువులో కేంద్రాన్ని ఒకే కేంద్రకం (Nucleus) ఉంది. అది ప్రోటాను న్యూట్రానులతో ఏర్పడింది. పరమాణువులో గల ప్రోటాను న్యూట్రాను లన్నీ కేంద్రకంలోనే ఉన్నాయి. పరమాణువు వైద్యుతీయంగా తటస్థమైనది కాబట్టి, అనగా అది విద్యుదావేశం లేని ద్రవ్యఖండం కాబట్టి, దానిలో ఎన్ని ప్రోటాను లున్నాయో అన్ని ఎలక్ట్రానులుకూడ ఉండాలి. కాబట్టి, కేంద్రకంలో ఎన్ని ప్రోటానులు గలవో

అన్ని ఎలక్ట్రాన్లు కేంద్రకంచుట్టూ వివిధ కక్షులలో తిరుగుచున్నాయి. ఈ చిత్రంవల్ల పరమాణువుయొక్క లక్షణాలు తెలుస్తాయి. పరమాణువులోనున్న న్యూట్రాను ప్రోటానుల సంఖ్యను "పరమాణు భారము" (Atomic weight) అన్నారు. ఉదజని పరమాణు భారం ౧, బంగారు పరమాణుభారం ౧౯౭ అంటే, బంగారుపరమాణువు ఉదజనిపరమాణువునకు ౧౯౭ రెట్లుందని ఊహించుకొనగలము. కక్షులలో తిరుగుచున్న ఎలక్ట్రానులపై ఆ మూలతత్వంయొక్క లక్షణాలు ఆధారపడి ఉన్నాయి. ఆ సంఖ్యను "పరమాణుక్రమాంకం" (Atomic number) అన్నారు. ఈవిధంగా పరమాణు నిర్మాణము, వివిధ పరమాణువులకు గల భేదాలు కనుగొన్నారు.

కొన్ని ప్రయోగాలలో ఎలక్ట్రానులు కఠిన ఖండాలవలె ప్రవర్తించాయి. ఎలక్ట్రాను ప్రవాహం ముందు పెట్టిన చులకని చక్రాన్ని అది ముందుకి త్రోసికొనిపోయింది. కాని, ౧౯౨౭లో జి. పి. థామ్సను అను విజ్ఞాని ఎలక్ట్రాను ప్రవాహాని కడ్డంగా అతిపలుచని లోహపురేకులు పెట్టగా, ఎలక్ట్రానులు కాంతితరంగాలవలె ప్రవర్తించాయి. అప్పుడది ఒక శక్తిఖండమని విశదమయింది. అంటే వాటిని పరిశీలించిన పరిస్థితులనుబట్టి ఎలక్ట్రాను లొకప్పుడు కఠిన ఖండాలవలెను, ఒకప్పుడు శక్తికోశాలవలెను ప్రవర్తిస్తా యని విజ్ఞానులు గ్రహించేరు. అట్లే ప్రోటానువిషయంలో కూడ. అంటే, ద్రవ్యపరమాణువులు విద్యుచ్ఛక్తి ఖండాలతో నిర్మింపబడ్డాయి. ఆ ఖండాలు తరంగసమూహాలని ప్రయోగాలు ఋజువు చేసేయి. కాగా, కఠిన ద్రవ్యం శక్తికోశాలతో ఏర్పడింది. రూపరహితమైన శక్తి ఖండాల వివిధ సమ్మేళనంతో దృఢమై, రూపాకారాలు గల ద్రవ్యం ఏర్పడుతూన్న దను సత్యం విజ్ఞానుల భావవాహినిలో కొంత కల్లోలం కలిగించింది. యీ ద్విశ్వము శక్తితో నిర్మింపబడిన దంటే విశ్వం శక్తిప్రధాన మని తెలియవచ్చింది.

అట్టి శక్తి అనేకవిధాలుగా ఉంది. వేడి, వెలుతురు, విద్యుత్తు, అయస్కాంతత్వము, ధ్వని- ఇవన్నీ శక్తియొక్క రూపాలే. మనకు దృగ్గోచర మయిన శక్తిని కాంతి అని, వెలుగు రని అంటారు. కాంతియొక్క స్వభావ మేమిటో, అ దెలా ప్రసరింపబడుతూందో అన్న విషయాలపై ౧౭-వ శతాబ్దంవరకు విజ్ఞానులకు నిశ్చితాభిప్రాయం లేదు. సూర్యరశ్మిగాని, ఒకదీపంనుండి వెలువడు కాంతిగాని సూక్ష్మకణ పరంపరగా బహిర్గమిస్తూం దని న్యూటను ప్రతిపాదించేడు. తెల్లగా నున్న సూర్యరశ్మిలో రంగుల కాంతి గలదని ఒక చిన్న ప్రయోగంవల్ల ఋజువు చేసేడు. చిన్న రంధ్రంద్వారా వస్తూన్న సూర్యకాంతి కడ్డంగా ఒక గాజుపట్టకాన్ని (Prism) పెట్టగా పట్టకంలోనుండి వెలువడిన కాంతి రంగురంగులవర్ణపటాన్ని (Spectrum) కలిగించింది. ఆ రంగులే ఆకాశంలో అప్పుడప్పుడు కనిపించు హరివిల్లులోని రంగులైన నీలలోహితము, నీలి, నీలము, ఆకుపచ్చ, పసుపుపచ్చ, నారింజవర్ణం, ఎరుపు. ఈ రంగుకిరణాలు సూర్యకాంతిలో నున్నాయని, వాటిని పట్టకం విభజించినదని, మరొక పట్టకాన్ని తలక్రిందుగా పెట్టి రంగుకిరణాలు తిరిగి తెల్లవెలుతురుగా మేళవిస్తాయని ప్రయోగపూర్వకంగా చూపించేడు.

కాని, కాంతి కణపరంపరగా బహిర్గమిస్తూన్నదన్న ప్రతిపాదన కొన్ని దృగ్విషయాలను సమర్థించలేకపోయింది. అందుచేత యంగు, ఫ్రెనెలు అన్న విజ్ఞానులు తరంగసిద్ధాంతాన్ని ప్రతిపాదించేరు. తరంగరూపంలో కాంతి ప్రసరింపబడుతూందని, అట్టి తరంగాల పొడవులో గల భేదంచేత వివిధరంగులు గోచరిస్తున్నాయని ఊహించేరు. ఆ వాదంకూడ కేవలం సత్యమైనది కాదు. ఒక జ్యోతినుండి వెలువడు కిరణ ప్రసారాన్ని పరీక్షించి, వివిధకిరణాల తీక్ష్ణతను కొలిచి ౧౯౦౧ లో మాక్సుప్లాంకు కాంతి సూక్ష్మకణాలుగాగాని, తరంగకోశాలుగాగాని వెలువడుచున్న దని నిర్ణయించేడు. కొన్ని లోహాలమీద పడిన కాంతి ఆ లోహపరమాణువులలోని ఎలక్ట్రానులను పైకెగురగొట్టుతుంది. ఈదృగ్విషయంకూడా కాంతికణవాదానికే దోహదమిచ్చింది. ఇట్లు, ఒకప్పుడు కాంతి

కణములలోను, సంగోకప్పుడు తరంగమట్లును వ్యక్తమవు తూంది.

దృగ్గోచరకాంతికన్న అగోచరంగా నున్న శక్తు లధికంగా ఉన్నాయని తెలియవచ్చింది. కాంతి కిరణాలకన్న ఎక్కువ తరంగదైర్ఘ్యం గల ఉష్ణ తరంగాలను ౧౮౦౦ సంవత్సరంలో హెర్షలు కనిపెట్టేడు. అంతకన్న తక్కువ తరంగదైర్ఘ్యం గల అతినీలలోహితకిరణా లున్నాయని మరికొండేండ్లకు తెలిసింది. ౧౮౯౫ లో X-కిరణాలని రాంట్జన్ కనుగొన్నాడు. మరికొండేండ్లకు రేడియోధార్మికపదార్థాలను క్యూరీదంపతులు కనిపెట్టేరు. రేడియోధార్మిక పదార్థాలనుండి మూడు విధములైన కిరణాలు యాదృచ్ఛికంగా బహిర్గమిస్తున్నాయని విజ్ఞానవేత్తలైన రూథర్‌ఫర్డుసాడీలు రేడియోధార్మికయాదృచ్ఛికవిచ్ఛిన్నవాదాన్ని పురస్కరించేరు. ఆ పదార్థాలనుండి ఆల్ఫా, బీటా, గామాకిరణాలు బహిర్గమిస్తున్నాయి. ఆల్ఫాకిరణాలు ద్రవ్యకణసముదాయాలు; బీటాకిరణాలు ఎలక్ట్రాను పరంపరలు; గామాకిరణాలు అగోచరశక్తి తరంగాలు. అవి కాంతిలక్షణాలు గలవే. కాంతితరంగాలకన్న లక్షరెట్లు తరంగదైర్ఘ్యం గల విద్యుదయస్కాంతతరంగాలను ౧౮౮౮ లో విజ్ఞాని హెర్ట్జు కనిపెట్టేడు. అవే రేడియో బ్రాడ్‌కాస్టింగులో ఉపయోగపడుతున్నాయి. ఇవిగాక అత్యంతసూక్ష్మతరంగదైర్ఘ్యంగల కాస్మిక్‌కిరణాలను కాంప్టన్‌మిల్లికాన్ ప్రభృతులు సూక్ష్మయంత్రసాహాయ్యంచే గుర్తించేరు. అవి నక్షత్రాంతరాకాశాలలోనుండి ప్రసరింపబడుచున్నట్లుంది. మహానిశితమైన కాస్మిక్‌కిరణాలు మన శరీరంలో నున్న పరమాణువులను సెకనుకు వందలకొలది భిన్నంచేస్తున్నాయి. ఈ కాస్మికు, గామా, X, అతినీలలోహిత, దృగ్గోచరకాంతి, అతిశోణ, హెర్ట్జు కిరణా లన్నీ విద్యుదయస్కాంతతరంగాలే. ఈశక్తులు విశ్వంలో మూలమూలలకు వ్యాపిస్తున్నాయి.

ద్రవ్యనిర్మాణంలో ముఖ్యంగా ప్రోటానులూ న్నవి విద్యుత్ఖండా లన్న సత్యం ద్రవ్యాంతరకరణము-అంటే, ఒకపదార్థాన్ని మరొక పదార్థంలోనికి మార్చవచ్చును అన్న భావానికి కొంత అవలంబమిచ్చింది. ఆధ్యాత్మికశక్తితో సామాన్యపదార్థాలను బంగారులోనికి ఋషీశ్వరులు మార్చేవారని ప్రతీతి. మధ్యయుగంలో కొందరు పాశ్చాత్యవిజ్ఞానులు "ఆల్కెమీ" అను ఈ విద్యను సాధించడానికి అహోరాత్రాలు శ్రమించి తుదకు జీవం ధారపోసేరు. కాని, ద్రవ్యలక్షణాలు విశదమై, పరమాణునిర్మాణం పూర్తిగా అవగాహన ఐనపిమ్మట ఒక పరమాణువును మరొక పరమాణువులోనికి మార్చడం సాధ్యంగా కనిపించింది. నాలుగు హీలియంపరమాణువులను అనుకూలంగా బంధించగలిగినట్లైతే ప్రాణవాయుపరమాణువు సిద్ధిస్తుందని సిద్ధాంతం సూచించింది. లారెన్సు అను అమెరికనువిజ్ఞాని సైక్లోట్రాను అను యంత్రంతో ద్రవ్యాంతరకరణాన్ని సాధించేడు. ఒక పదార్థాన్ని లక్ష్యంగా పెట్టి, సూక్ష్మకణాలైన న్యూట్రానులను ఆల్ఫాకణాలను ఆ యంత్రంలో సర్పిలమార్గాన్న త్రిప్పిత్రిప్పి, వాటికి శక్తి నిచ్చి, మహావేగంతో లక్ష్యాన్ని ఢీకొనేటట్లు యంత్రం నిర్మింపబడింది. అట్లు ఢీకొన్నప్పుడు పరమాణువులు భిన్నమై, వాటి నిర్మాణంలో మార్పు వాటిల్లి ఒక తత్వం మరొక తత్త్వంలోనికి మారుతుంది. ఈవిధంగా రేడియోసోడియ మను క్రొత్త పదార్థం లభించింది. ఇట్లు మూలతత్వాలలో గల వ్యక్తిత్వం నశించింది.

ఈ శతాబ్దంలో బయల్పడిన భౌతికవిజ్ఞాన సత్యాలవల్ల విజ్ఞానుల దృక్పథంలోను, భావప్రగతిలోను అపూర్వమైన మార్పు కలిగింది. గతశతాబ్దం వరకు జగత్తును ఒక యంత్రంగా భావించిన విజ్ఞానులు అనాత్మవాదానికి (**Materialism**) ప్రాముఖ్య మిచ్చేరు. మనస్సుకు స్వతంత్రవ్యాపారసామర్థ్యం లేదని, ఇచ్ఛాస్వాతంత్ర్యం మిథ్య యని అన్నారు. కాని గత ౫౦ ఏండ్లలో బయల్పడిన విషయపరంపర మూలంగా ద్రవ్యంలో ద్రవ్యత్వమే హరించిపోయింది. ఒక సామాన్యగ్రహమైన భూమిలో ఎందుకో ఎప్పుడో ఎట్లో జనించిన జీవం కాలగమనంతో అంతరిస్తుందని ఖగోళవిజ్ఞానం సూచించింది. జగత్తు వస్తుగతమా (**Objective**), ఆత్మగతమా (**Subjective**) అన్న ప్రశ్న బయలిడింది. మహామేధావులైన విజ్ఞానవేత్తలుకూడ ఆధ్యాత్మికయోగులవలె జగత్తును శాసించే శక్తి ఒకటున్నదను నిర్ణయానికి వచ్చేరు.*

*ఆలిండియా రేడియోవారి అనుమతిని.

# సురేశ్వరాచార్యులు



= శ్రీ నిర్వికల్పానందస్వామి =

౧

పూర్వాశ్రమమున మండనమిశ్రు డను నామమున ప్రసిద్ధుడైన కర్మిష్ఠియే శాంకరశిష్యచతుష్టయమున నొకడుగ ప్రసిద్ధి నంది సురేశ్వరకర్మంది యని వృద్ధవ్యవహారము. భట్టకుమారిలుని వాదయుద్ధమున జయింప శంకరు డరిగినతరి ఆయన తుషానలమున ప్రాణములను పరిత్యజింపనుండెను. ఆయనయే స్వశిష్యుడగు మండనుని జయించి, మండనమొనర్పగలిగిన పూర్వమీమాంసాశాస్త్రఖండన మగునని సూచించెను. శంకరుడు మండనుని గృహమును అన్వేషింపదొడగెను. లోకులు, ఏ ఇంట పంజరమునందలి శుకములుగూడ "వేదము స్వతఃప్రమాణమా, లేక పరతఃప్రమాణమా? వేదము పౌరుషేయమా, లేక అపౌరుషేయమా? ఫలదాత కర్మమా, లేక ఈశ్వరుడా?" యని వచించుచుండునో ఆ వీడు మండనమిశ్రున దని గుర్తు తెల్పిరి. శంకరు డాగృహమున ప్రవేశించుసరికి గృహకర్త శ్రాద్ధకర్మ మొనరించుచుండెను. జీవశ్రాద్ధ మొనర్చుకొనిన సన్న్యాసిఆగమన మట్టిపట్ల అశుభకరము.

మండను డాగ్రహపరవశు డయ్యెను. కాని, అతిథి విష్ణుస్వరూపుడు. అందు సన్న్యాసి సాక్షాత్తుగ నారాయణుడు. భిక్షాగ్రహణమునకు ప్రార్థించెను. ఆ వింతయతిథి వాదభిక్ష నర్థించెను. శ్రాద్ధకర్మానంతరము మండనమిశ్రుని పత్ని ఉభయభారతి మాధ్యస్థ్యమున శాస్త్రవాదము జరిగెను. మండనుడు పరాస్త మయ్యెను. ఉభయభారతి అర్ధాంగమును జయించినగాని విజయము లభింప దని ఆ బాలయతికి దురవగాహమగు కామశాస్త్రీయపురుషార్థ విషయమై ప్రశ్నించెను. శంకరుడు పరకాయప్రవేశ మొనర్చి తద్విద్యారహస్యములను గ్రహించి, సముచిత సమాధానముల నొసగి, మండనుని నిగ పరిగ్రహించెను.

సురేశ్వరుడు శృంగేరీపీఠము నధివసించె నని కూడ తెలియవచ్చుచున్నది. ఇవియే మనకు లభ్యమగు తజ్జీవిత విశేషాంశములు.

౨

నైష్కర్మ్యసిద్ధి, బ్రహ్మసిద్ధి, ఇష్టసిద్ధి (లేక స్వారాజ్యసిద్ధి) యను ప్రకరణగ్రంథత్రయము, విధివివేకమను నిబంధనగ్రంథము, తైత్తిరీయబృహదారణ్యకోపనిషద్వార్తికద్వయము, పంచీకరణవార్తికము, మానసోల్లాసము అను గ్రంథములు సురేశ్వరవిరచితములు ప్రస్తుతము లభించుచున్నవి.

అందు ద్వాదశసాహస్రవార్తిక మనబడిన బృహదారణ్యవార్తికమును మూడు భాగములుగ ఆనందాశ్రమము (పూనా) వారు ఆనందగిరి టీకతోగూడ ప్రకటించిరి. కాని, ఇందు ౧౧,౧౫౧ శ్లోకములు మాత్రమే లభించుచున్నవి. ద్వితీయమగు తైత్తిరీయవార్తికముగూడ ఆనందగిరిటీకతో పూనానుండి వెలువడినది. ఈ రెండును గూడ శంకరుని ఉపనిషద్భాష్యమునకు విశేషవివరణములు.

బ్రహ్మసిద్ధి యను గ్రంథమునకు సుప్రసిద్ధుడగు వాచస్పతిమిశ్ర 'తత్త్వసమీక్ష' యను టీకను గూర్చె

* ఈవ్యాసకర్త ప్రారంభించియున్న 'అద్వైతధార' యను వ్యాసావళిలో ఇది రెండవది.

ను. విధివివేకమునకుగూడ 'న్యాయకణిక' యను టీకను విరచించెను. చిత్సుఖుడు, విద్యారణ్యుడు, అప్పయ్య దీక్షితులు మున్నగువారు బ్రహ్మసిద్ధి వాక్యములను తమ గ్రంథములలో నుదాహరించుకొనిరి. అమలానందుడు, ఆనందబోధుడు మొదలగువారు తత్త్వసమీక్ష టీకను తమ గ్రంథములలో పేర్కొనియుండిరి. కనుక ఈగ్రంథ మత్యంతప్రసిద్ధిని బొందెనని గ్రహింపగలము.

ఇష్టసిద్ధి, లేక స్వారాజ్యసిద్ధి యను గ్రంథమునకు వాచస్పతిమిశ్ర, నిత్యబోధఘనాచార్యులు, భాస్కరానందస్వామి యనువారలు టీకను రచించియుండిరి. కాశీనుండి మూడవవారి టీకతో మూల గ్రంథము వెలువడియున్నది.

నైష్కర్మ్యసిద్ధి యను ప్రకరణగ్రంథము అత్యంత ప్రసిద్ధము. దీనికి జ్ఞానోత్తముడు రచించిన 'చంద్రిక' యను టీకయు, చిత్సుఖాచార్యుని 'భావతత్త్వ ప్రకాశిక' యను టీకయు ఉత్తమామృతుని శిష్యుడగు జ్ఞానామృతుడు రచించిన 'విద్యాసురభి' యను టీకయు, దశరథప్రియుని శిష్యుడగు అఖిలాత్ముడు రచించిన 'వివరణ' మను టీకయు, అమృతసరవాసి యగు రామదత్తుని సారార్థ మను టీకయును కలవు.

శంకరాచార్యులవారి పంచీకరణ మను వచన గ్రంథమునకు వివరణ మగు పంచీకరణ వార్తికమునకు ఆనందగిరి రామతీర్థుల టీకలును, ద్వారకా పీఠాధీశులగు శాంత్యానంద సరస్వతీస్వామివారి విరచిత మగు టీకయు నున్నవి.

మానసోల్లాసము శ్రీ శంకరవిరచిత మగు దక్షిణామూర్తి స్తోత్రమునకు టీక.

## 3

సురేశ్వరాచార్యుని ముఖ్యగ్రంథ మగు నైష్కర్మ్యసిద్ధి ననుసరించి ఆయనమతవాదము నాలోకించుక పరిశీలింతము.

ఆబ్రహ్మస్తంబపర్యంతము సకల ప్రాణులకును దుఃఖమును, సన్నిరాకరణ ప్రవృత్తియును సహజముగనే యున్నవి. శరీరధారణమే దుఃఖకారణము. పూర్వ జన్మమునందలి ధర్మాధర్మములు దేహమునకు గారణములు. విహితకర్మానుష్ఠానము ధర్మమునకును, నిషిద్ధ కర్మానుష్ఠానము అధర్మమునకును కారణములు. ఈ కర్మములు రాగద్వేషప్రసూతములు. రాగద్వేషములు శోభనాశోభనాధ్యాసలకు ఫలితముగ సంభవించుచున్నవి. ఒకానొక వస్తువునందు రమణీయత్వబుద్ధి యుండుట శోభనాధ్యాస; తద్విపరీత బుద్ధి అశోభనాధ్యాస. అవిచారమూలమగు ద్వైతవస్తుబోధయే అధ్యాసకు హేతువు. స్వతస్సిద్ధమును, అద్వితీయమును నగు ఆత్మస్వరూపము అవగతమైనతోడనే అద్వైతప్రపంచము, సు క్తిరజతమువలె, నివృత్తమగును. కనుక, సకలానర్థనివృత్తినిమిత్తము ఆత్మబోధయే శరణ్యము. క్షయవ్యయరహితమును, అపరతంత్రమును నగునదియే ఆత్మసుఖము. ఈ సుఖమును ఆవృతమొనరించు విషయములను ఛేదించుటయే పరమపురుషార్థము. అజ్ఞానము తొలగినచో జ్ఞానోదయమై పరమపురుషార్థము సిద్ధించును. ఆత్మబోధ లేకుండుటవలననే సకలానర్థములును సంభవించుచున్నవి. ప్రమాణము లన్నియును అధ్యాసాంతర్గతములు. వేదాంతబలముననే ఆత్మబోధము కల్గును. ఆత్మయే బుద్ధికి సాక్షి. బ్రహ్మాత్మైక్య బోధమున అజ్ఞాననివృత్తి యగును. సంసారము అనర్థము. ఈ అనర్థమునకు హేతువు అజ్ఞానము. అజ్ఞాననివృత్తి యగు మోక్షమే పురుషార్థము. ఇది బ్రహ్మాత్మైక్యజ్ఞానమువలననే సిద్ధించును. ఇదియే శాస్త్రసంగ్రహము.

కర్మము ముక్తిదాయకము కాదు. ఏలయన, కర్మఫల మనంతవైచిత్ర్యముతో గూడియున్నది. ఇక మోక్షమన్ననో ఏకరూపము. అయినను, కర్మము ఆరాదుపకారకము. నిత్యనైమిత్తిక కర్మాచరణము చిత్తశుద్ధిని గలిగించి మోక్షప్రాపక మగుచున్నది. జ్ఞానికి గర్మాధికారము లేదు. అజ్ఞానికే కర్మాధికారము.

నిత్యకర్మానుష్ఠానమున ధర్మోత్పత్తియును, ధర్మోత్పత్తివలన పాపహానియును, తత్ఫలముగ చిత్తశుద్ధియును కలుగును. తరువాత క్రమముగ, వైరాగ్యమును మును లభ్యములై, మోక్షోపాయాన్వేషణమునకు కారణము లగును. ఈ అన్వేషణ సన్న్యాసయోగాభ్యాసములుగ పరిణమించి, చిత్తమున కైకాగ్రతను కూర్చి, మహావాక్యజ్ఞానమును లభింప జేయును. ఈ జ్ఞానప్రాప్తియే ముక్తి. ఇదియే అవిద్యోపరమము.

జ్ఞానకర్మములకు సముచ్చయ మసంభవము. ఏలయన, ఇవి బాధకబాధ్యములు. కనుక, ఇవి ఏకపురుషాశ్రయములు కాజాలవు. స్థాణువును దొంగగా తలచినపుడు పలాయన మెట్లు సంభవించుచున్నదో, అట్లే బుద్ధ్యాదులు ఆత్మగా భావితములైనపట్ల కర్మము సంభవించుచున్నది. కనుక, స్వరూపజ్ఞాన ముండిన పట్ల కర్మము సంభవించదు ; అజ్ఞానమున్న పట్లనే కర్మము. ఈ మిథ్యాజ్ఞానమున కాశ్రయము కర్మము.

బ్రహ్మము అద్వితీయము. అందు భేదాభేద ప్రసక్తి లేదు. బ్రహ్మజ్ఞానము పురుషతంత్రము కాక వస్తుతంత్ర మైనందువలన నియోగప్రసక్తి లేదు.

౪

శరీరము ఆత్మ కాదు; కాక ఇంద్రియములు, మనస్సు, బుద్ధి—వీనిలో నేయొక్కటియును ఆత్మ కాదు. వైరాగ్యము లేనిచో, సంసారనివృత్త్యభిలాషయును, ముముక్షుత్వమును, గురుప్రాప్తియును కలుగవు. గురూపదేశము లేకుండిన భ్రాంతితొలగదు. ఈ భ్రాంతితొలగకుండిన అజ్ఞానము నివృత్తము కాదు.

ఏకాత్మదర్శికి రాగద్వేషములకు తావు లేదు. దేహాదులు, ఘటాదులవలె, దృశ్యములు. కనుక, ఆత్మ కాజాలవు. అహంకారమమకారములును, ప్రయత్నము, ఇచ్ఛ మున్నగునవియును ఆత్మధర్మములు కావు. ఆత్మ నిరంశము, అకర్త. బ్రహ్మాత్మజ్ఞానమున అహంకారమును, దానికి మూలమగు అవిద్యయును తొలగిపోవును. కర్తృత్వభోక్తృత్వాదులు అవిద్యాకల్పితములు.

జ్ఞానికి సర్వాత్మభావసిద్ధి యైనప్పుడు, తదితరుల సుఖదుఃఖముల ననుభవించు దుఃస్థితి యేర్పడు నను శంక అసంగతము ; జ్ఞానోత్పత్తికి పూర్వ మిది తటస్థపడనట్లే జ్ఞానోదయానంతరకాలమునగూడ నది తటస్థపడదు. అదియునుగాక, స్వగతదుఃఖమే తుచ్ఛమైనప్పుడు, అన్యదుఃఖమున సంసక్తి ఎట్లు ఏర్పడగలదు?

ఆత్మ నిష్కలము, నిష్క్రియము, అద్వితీయము, పరిణామ రహితమును నైయున్నది. భోక్తృత్వాదికములు ఔపాధికములు. ఈవిధమగు ఆత్మస్వరూపమును గ్రహింపజాలకుండుటవలననే, 'అనాత్మ' భావము ఆత్మయం దుదయమగుచున్నది. శాస్త్రప్రమాణ మొక్కదానివలననే, తదుపదిష్టములగు శమాది సాధనలవలననే ఈ భ్రాంతి తొలగును. అనుమానాదులుగూడ గ్రహణీయములు కావు. వాని నాశ్రయించిన బౌద్ధులవలె నిరాత్మతనే పొంది మోసము ఘటిల్లును. ఆత్మ ప్రమాణగోచరము కాదు; అప్రమేయము.

అగుచో, శబ్దప్రమాణము—వాక్యవిజ్ఞానము—ఏరీతిగ ఆత్మజ్ఞానమును కలిగింపగలదు అనిన : అవిద్యానిరాకరణ ముఖముననే అని ప్రత్యుత్తరము. సుప్తవ్యక్తిని పేరుపెట్టి పిలచిన లేచునట్లు, శబ్దమహిమవలన ఆత్మ ప్రబోధిత మగుచున్నది.

ఆత్మ దృశ్యము కాదు, సర్వమునకును సాక్షి. జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు విలీనము లగును. జీవన్ముక్తస్థితియందు ద్వైత ప్రపంచము స్వప్నదృశ్యమువలె ప్రతిభాత మగును.

౫

సంసారవిరాగము, వాసనాపరిసమాప్తి, కర్మముల అరుచి, ప్రత్యగాత్మాభిముఖీనత్వము—ఇవియే అధికారిలక్షణములు. ఇవి లేనివాడు వేదాంతవిద్యకు అధికారి కాడు.

పద్మపాదాచార్యుల గ్రంథములవలెనే సురేశ్వరుల గ్రంథములుకూడ శాంకరమతవిస్తారమునకు దోడ్పడుచున్నవి. ముఖ్యసిద్ధాంతములలో భేదము లేకుండినను, స్థూలభేదము ననుసరించి ఈ ఉభయులలో ఒకింత అభిప్రాయభేద మున్నది. పద్మపాదులు భాట్ట మతమును గుఱించి ఏమియును చర్చింపలేదు. సురేశ్వరుడు తత్ఖండన మొనర్చెను.

తరువాతివారగు అమలానంద, విద్యారణ్య, చిత్సుఖాదులగు ఆచార్యబృందము సురేశ్వరుని సిద్ధాంతములను ప్రామాణికములుగ పరిగ్రహించిరి.




మేస్టరుగారు:—"ఈలాగే పిల్లలని చెడిపేస్తారు. అందుకనే తలిదండ్రులకు పిలలుండరాదని నేననేది."

(డెర్రిక్ గారి వ్యంగ్యచిత్రమున కనువాదము)

# శ్రీ కృష్ణ జననము



= డాక్టరు శ్రీ చిలుకూరి నారాయణరావు =

భూమిపై కారుమని ఏడ్పు వినబడినది.

అది కంపితధ్వని.

ఏడ్పు అన్నారుగాని, అది ఏడ్పు కాదు.

ముమ్ముందు లోకోద్ధరణమునకై చేయబోయే గీతమున కది మూలము.

అట్టి ధ్వని అంతకు పూర్వ మెప్పుడును వినబడలేదు.

అంతకుపూర్వ మెప్పుడును చలింపని కంఠము నుండి అది వెలువడినది.

ఆ గాఢాంధకారములో నివసించి ఉండిన ఒక జీవిని గురించి వారు నాకు తెలిపినారు.

అతని చక్షువులకు జ్యోతిర్లేశమైనా ఎన్నడును చేరి ఉండలేదు.

ఎక్కడనో గభీరగహ్వరాంతర్భాగమున నుండిన ట్లాత డుండేవాడు.

నిశ్శబ్దతా మధ్యమున నివసిస్తూ ఉండే ఒక జీవిని గురించి వారు నాకు తెలిపినారు. అతని శ్రోత్రములకు శబ్దము లేశమైనా ఎన్నడున్ను చేరి ఉండలేదు.

ఎల్లప్పుడును జలాధోభాగమున నివసించే ఒక జీవిని గురించి విన్నాను. అతడు నారాయణు డన్నారు. ఆ జలకవోష్ణత అపూర్వము, అపూర్వానుభూతము. కాని, —

ఆ జీవిని హిమశీతలజలములలో ఉన్న పాటుగా ముంచినారు.

అంతకుపూర్వము శ్వసింప నెరుగని ఆతని శ్వాసకోశములు విశాలములు కాజొచ్చినవి. అంతకు పూర్వము ముడుచుకొని పడిఉండిన శ్వాసకోశములను వాయు వొక్కసారిగా పూరించి పూరగించినది.

ఆ అనంతజీవి కారు మన్నాడు.

భూమిపై నొక కంపితధ్వని వినబడినది. ఆ కంఠధ్వని అశ్రుత పూర్వము. అపూర్వచాలిత కంఠబిలము నుండి ఆధ్వని బయలు వెడలినది.

తాత్కాలిక విశ్రాంతి తీసికొనిన పరమాత్మ అతడు.

తాత్కాలికమైనా, ఆ విశ్రాంతి ఊహాతీతము.

అతని కాహారము తినవలసిన కష్టమైనా లేకుండెను; మరి ఒక రాతని కోసము తినినారు. అతని జీవధాతువులకు పనియే లేదు; అతని జీవితమునకు కావలసిన ఉష్ణము మరి ఒకరు పనిచేసి కల్పించినారు. అతని జీవధాతువుల కషాయము కలిగించే విషముల నుంచీ, విషక్రిముల నుంచీ కూడా సంరక్షించుకోవలసిన పని అతనికి లేకుండెను. ఆ పని నతనికోస మితరజీవి జీవధాతువులు చేసినవి. తాను శ్వసింప నక్కర లేకుండగనే అతనికి కావలసిన ప్రాణవాయు వచ్చినది.—

ఏ జీవికి కల దిట్టి సౌకర్యము?

ఆ యోగి కట్టి విశ్రాంతిని కలిగింపనోచిన దేవకి పరమధన్య యైనది.

అట్టి పరమ విశ్రాంతిలో పనిచేసిన దతని హృదయ మొక్కటే.

అది జననమునకు పూర్వము నుంచిన్ని కొట్టు కొంటున్నది.

అవును! అతడు జన్మించక పూర్వము నుంచిన్ని అది కొట్టుకొంటున్నది, — మరి యే హృదయము కంటెను రెండింతలు వేగముతో.

అదే మానవహృదయము. లోకసంగ్రహము కోసమా తహతహ.

ఇప్పుడో—అతడు భూమిమీదికి వచ్చినాడు.

తన పరజీవిత కష్టము నంతటినీ తానే భరింప జూనుకొన్నాడు. అతని కన్నులకు లోకపువెలుతురు వ్యథను కలిగించినది. చెవులకు లోకపు చప్పుడు బాధ కలిగించినది. అతని జీవితధాతువుల కన్నిటికీ అమిత వేదన కలిగినది.

ఆ యోగి భూమిపై నవతరించినాడు.

అవతరిస్తూ, "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి" అని ఘోషించినాడు. ఆమహాఘోషణము చిన్నికృష్ణుని చిన్నిగొంతుకనుండి కారు మను కేకగా ఆ చెరసాలలో — ఆ సూతికాగృహములో ఉన్న వారికి వినిపించినది. ఆ కేక కర్థ మప్పు డెవ్వరికిని వ్యక్తము కాలేదు.

తన్నుదా దలంపక ఉండిన యోగి ఇప్పుడు తాను — తనది అని తలంప మొదలిడినాడు.

అతని హృదయ మెప్పటివలెనే కొట్టుకొంటున్నది.

ఎప్పటివలెనే లోకోద్ధరణ వ్యాపృతమై ఉన్నది.

ఆహృదయ మనాది. ఆహృదయ వీణాతంత్రు లవిరతముగా ప్రేమవాహినీ గీతములకు శ్రుతి మేళనము పొందిఉన్నవి.

ఆ యోగీశ్వరేశ్వరుని హృదయగీతికలన్నీ భగవద్గీతగా పరిణమించినవి.

బాలకృష్ణుని వేణుగానములోను, యువకృష్ణుడు ప్రేరేచిన గోపికాగీతలలోను, పరిణతకృష్ణుని ఉపదేశ గానములోను వినవస్తూఉన్నది ఆ ప్రేమగీతికయే.








సెకండస్ మాడరన్
నికిల్ సిల్వర్... రు. 44.

రవాణా యిబ్బందులవల్ల, ప్రకటించిన రకములన్నియు సప్లయిచెయ్య సాధ్యపడక పోవచ్చును. మావద్ద సరకుండినంతవరకు ఆర్డరులను సరఫరాచేయుటకు సర్వశక్తుల వినియోగించెదము. పేపరు కంట్రోలువల్ల కేటలాగు పంపలేనందుకు చింతిల్లుచున్నాము.

వెస్టుఎండ్ వాచ్ కంపెనీ, బొంబాయి & కలకత్తా.

**WEST END WATCH CO.**

**BOMBAY • CALCUTTA**

స్త్రీకి సంతానం సహజమైన కోరిక





లోధ్ర



దానిని సఫలత నొందిస్తుంది★

లోధ్ర అంతటా దొరుకును



కేసరికుటీరం లిమిటెడ్.
మదరాస్

# మీ కండ్లను కాపాడుకొను

జాయ్ కెమికల్ వర్క్సువారి **ఐరిట్** పూర్తిగా నిరపాయకరమైనది. కండ్లపొరలను హరించి దృష్టిని చక్కబరచుటలో దీనిప్రభావ మద్భుతము గనుక కండ్లపొరల ఆరంభదశలో దీనిని సర్వదా క్షేమముగను ప్రయోజనకరముగను ఉపయోగించవచ్చును.

**ఐరిట్** శుక్లములమసక (**Opacity of Cornea**) కు, బాధకలిగించు కంజంక్టివిటిస్ (**Painful conjunctivitis**)కు, గ్లకోమావలనదృష్టి లోపముకు, రెటీనాలేక కంటినరముల జబ్బుకు, కంటి నుంచి అన్యపదార్థములు తీసివేసిన తరువాత మిగులు హెచ్చుతగ్గులకు కూడ గట్టిగాపనిచేయును. కంటి ఆపరేషను తరువాత దీనిని ఉపయోగించినచో మిగిలిన పొరలను ఇతరదోషములను హరించును.

కన్ను ఆరోగ్యముగా నుండినపుడు ఉపయోగించినచో దృష్టి అభివృద్ధిఅగును, పొరలుగాని, ఏ ఇతరకంటిబాధలుగాని కలుగనేరవు. దీనిని తియ్యకకొంతకాల ముపయోగించుటవలన కంటి అద్దములు పెట్టుకొనవలసిన అవసరముకూడ తప్పించుకొనవచ్చును.

వెల 2 డ్రాములబుడ్డి 1-కి రు. 1-4-0. 4 డ్రాముల బుడ్డి రు. 2 లు.

**హోమియోపతి, బయోకెమిస్ట్రీ** యుద్ధమునకుపూర్వము నేను పనిచేసియున్న సుప్రసిద్ధజర్మను కంపెనీ కెమిస్టువద్ద నేను నేర్చుకొనినవిధానములతో మిక్కిలి శాస్త్రీయముగను, హామీగను తయారు చేయబడి పట్టుతప్పని నాహోమోపతీమందులతో మీమందులపెట్టెను నింపుడు. వీటివెల డ్రాము 1-కి 0-3-0, 0-3-6. బయోకెమిక్ మందుల ధర—పౌడరుగాని ట్రిట్యురేషన్ గాని—డ్రాము 1-కి 0-3-6, బిళ్లలు డ్రాము 1-కి 0-4-0.

**Dr. R. MOHALANOVIS,**
Post Box No. 10013, CALCUTTA.

# చిన్న - పెద్ద

[కథానిక]

= శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తి =

వెంకట్రామయ్య ఇల్లు చేరుకునేటప్పటికి పొద్దు కూకింది. కాంతారావు వున్న భాగం వరండాలో హరికేనులాంతరు చిన్నది చేసివుంది. ఇంట్లోకి వెళ్లి వుత్తరీయం అవతల పారేసి, బైట లష్టరుదీపం కొంచెం తగ్గించి, అరుగుమీద వున్న పడకకుర్చీ తీసి కిందవేసి, దాంట్లో కూచుని చుట్ట వెలిగించాడు వెంకట్రామయ్య. ఎదురుగుండా వున్నవారి దొడ్లో వున్న బాదంచెట్టుఆకుల సందునుంచి చందమామ కనపడీకనపడకుండా వున్నాడు.

"ఏమోయి తమ్ముడూ!" అన్నాడు వెంకట్రామయ్య— అప్పుడే వచ్చిన జగన్నాధం హరికేనులాంతరు పెద్దదిచేసి, పక్కన వున్న పుస్తకం తెరవగానే.

జగన్నాధం కాంతారావుకొడుకు. తొమ్మిదేళ్లుంటయి. కాంతారావుఇంట్లో వెంకట్రామయ్య అద్దెకుంటున్నాడు. వెంకట్రామయ్య పిలవగానే జగన్నాధంలేచి నిల్చున్నాడు.

"భోంచేశావా?"

"ఆ!" అన్నాడు జగన్నాధం.

"అప్పుడే! నాకు పెట్టకుండానే భోంచేశావే!" అన్నాడు వెంకట్రామయ్య ఆశ్చర్యం కనపరుస్తూ. జగన్నాధం మాట్లాడకుండా అక్కడే నిల్చున్నాడు.

"ఇక్కడికి రావోయి-పిలుస్తుంటేనే!" జగన్నాధం వెంకట్రామయ్య దగ్గిరికి వచ్చాడు.

"అన్నంలో ఏమేసుకు తిన్నావ్?"

"కందిపచ్చడీ—మరి—"

"కందిపచ్చడే—మరి నాకు పెట్టకుండానే తిన్నావే?"

జగన్నాధం మాట్లాడలేదు.

"పోనీ, ఈతడవ కందిపచ్చడి చేసుకున్నప్పుడు పెడతావా?"

జగన్నాధం మాట్లాడలేదు.

"ఓరి! ఈ తడవ చేసుకున్నా పెట్టవన్నమాట! ఏమండోయి, మీ మనమడు కాస్త కందిపచ్చడికూడా పెట్టట్ట!" అన్నాడు వెంకట్రామయ్య అప్పుడే వచ్చి వాకిట్లో కూచున్న శేషమ్మతో.

"వాడా-వొట్టిబడితె! పోయి చదువుకోరా!" అంది శేషమ్మ.

"అయితే నువ్విప్పుడేం చదువుతున్నావురా జగన్నాధం?" అన్నాడు వెంకట్రామయ్య.

"అయిదో క్లాసు!" అన్నాడు జగన్నాధం.

"ఇంతే—ఏదీ, నువ్వు చదివే పుస్తకం పట్టుకురా!"

జగన్నాధం పుస్తకాల దగ్గిరికి వెళ్లాడు.

"నాన్నగారూ, అమ్మ మడిగట్టుకోమంటున్నది" అంటూ వచ్చాడు వెంకట్రామయ్యకొడుకు శివరాము.

"అలాగేలే – వస్తున్నానందూ!" అన్నాడు వెంకట్రామయ్య.

"అదేమిట్రా, ఆయన పిలుస్తుంటే వెళ్లకుండా అలా మొద్దల్లే కూచున్నావు!" అంది శేషమ్మ మనమడితో.

"నేను చదువుకోఅక్కర్లేదేమిటే!" అన్నాడు జగన్నాథం.

"ఏడిచినట్లే వుంది నీచదువు — ఆయన పిలుస్తుంటే వెళ్లవేం? మావాడు వట్టి బడిత అయిపోతున్నాడు బాబూ — చదువని పేరేగాని వాడు చదివేదానికీ, వాడికి అర్థంఅయేదానికీ సంబంధం వుండదు. ఏమిటో మనస్సులో చదువుకుంటాడు. చూడరా వెధవా, వాళ్ల శివరాము ఎలా చదువుతున్నాడో గడగడా!" అంది శేషమ్మ లేచి వెళుతున్న జగన్నాథంతో, అప్పుడేవచ్చి వరండాలో కూచుని చదువుతున్న శివరామును చూపి.

"అయితే మీ పరీక్షలు జరుగుతున్నయ్యా?" అన్నాడు వెంకట్రామయ్య జగన్నాథం దగ్గిరికి రాగానే.

"ఆ!" అన్నాడు జగన్నాథం.

"రేపు ఏమిటి?"

"జాగ్రఫీ"

"అయితే మన దేశం దేన్ని పండించటంలో ప్రసిద్ధి?" అన్నాడు వెంకట్రామయ్య.

జగన్నాథం మాట్లాడలేదు.

"చెప్పరా మొద్దూ!" అంది శేషమ్మ.

"ఏమిటి మా వాడిని పరీక్షచేస్తున్నారా?" అన్నాడు కాంతారావు అప్పుడే వచ్చి.

"నువ్వు భోజనానికి లేవరా అబ్బాయీ!" అంది వెంకట్రామయ్యతల్లి రాజమ్మ వచ్చి గడపలో కూచుని.

"ఒరేయి, ఇటురా జగ్గూ!" అంది జగన్నాథం తల్లి దొడ్లోనించి. జగన్నాథం వెళ్లాడు.

"అదీ! ఎప్పుడు ఎవరు పిలుస్తారా అని సిద్ధంగా వున్నాడు వెధవ — ఆయ నడిగిందానికి సమాధానం చెప్పవేం?" అంది లోపలికి పోతున్న జగన్నాథాన్ని చూచి శేషమ్మ.

"నీకేందుకేం?" అన్నాడు జగన్నాథం.

"అంతేలే, ఆయనకొడుకువు గాదూ నువ్వు?" అంది శేషమ్మ.

"ఏమిటది మధ్య నన్ను ఇరికిస్తున్నావు!" అన్నాడు కాంతారావు తల్లితో.

"ఏంలేదు— వాడుకూడా నీకుమల్లేనే తయారవుతున్నాడని అన్నా. వాడేనేం తిట్టలేదు!" అంది శేషమ్మ.

"నాకుమల్లే తయారుకాకుండా చెయ్యరాదూ వాడిని?" అన్నాడు కాంతారావు.

"నిన్ను చేశాను; వాడిని చేస్తాను ఇక!" అంది శేషమ్మ.

"అలాంటప్పుడు మరి అనుకోవటం దేనికి?" అన్నాడు కాంతారావు.

"ఏమో నాయనా, పెద్దదాన్ని కనక అనుకుంటాను" అన్నది శేషమ్మ.

"నాన్నగారూ, అమ్మ మడిగట్టుకోవచ్చునంటున్నది!" అన్నాడు జగన్నాథం దబదబా వచ్చి.

"చంపుతా వెధవా నన్ను నాన్నగారూ అని పిలిచావంటే– నీ కిదివరకు ఎన్నోసార్లు చెప్పాను!"

"అదికూడా తప్పేనట్రా?" అంది శేషమ్మ.

"వాడు చేసే పన్లు అన్నీ తప్పేగా నీ దృష్టిలో! నాన్నగారుట నాన్నగారు——ఎక్కడ నేర్చుకున్నాడో!"

"ఇది మరీ బాగుందిరా!" అన్నది శేషమ్మ.

"నీ మనమడిమీద నీకున్న ప్రేమ నా కొడుకు మీద నాకు లేకపోలేదు లేవమ్మా– ఈ విషయంలో నువ్వు వాడిని వెనకేసుకుని రా నక్కర్లేదు." అన్నాడు కాంతారావు.

"నేను వెనకేసుకుని వస్తే సాగుతుందిట్రా పిచ్చివాడా. వాడి కిప్పుడే నేనంటే లక్ష్యం లేదు." అంది శేషమ్మ.

"మరి నేనంటే లక్ష్యముందేం?" అన్నాడు కాంతారావు.

"ఏదీ నీ ఎదటే - నువ్విటు మొహం తిప్పితే వాడిటు మళ్ళీ మామూలే. మరి నువ్వు వున్నా నేనంటే వాడికి లక్ష్యం లేదు సరేగదా!" అంది శేషమ్మ.

"అదికూడా నా తప్పేనా? వాడిని అలా చేసింది నువ్వు!" అన్నాడు కాంతారావు.

"చివరకు నేరం నామీదే పెట్టావూ — అంతేలే. నువ్వు అంతకంటె మరేమంటావు!" అన్నది శేషమ్మ.

"నే ననేదేమిటి? నేనంటే వాడికి లక్ష్యం ఎందుకుండాలి—నువ్వంటే ఎందుకు ఉండకపోవాలి?" అన్నాడు కాంతారావు.

"నామాటంటే వాడు ఒక్కపిసరు లక్ష్యం చెయ్యకుండా వున్న సమయాల్లో నువ్వు వాడిని ఒక్కసారన్నా కోప్పడితేగా వాడికి లక్ష్యం ఉండటానికి?" అంది శేషమ్మ.

"ఇది మరీ బాగుంది! నువ్వంటే వాడికి అసలు లక్ష్యం లేని స్థితి ఎందుకు రావాలి?"

"ఏమో నాకేం తెలుసు?" అంది శేషమ్మ.

"నీకు తెలిసిందల్లా వాడు అయిదోఏటనే నలభయ్యేళ్లవాడిమాదిరిగా వుండలేదనేగా?" అన్నాడు కాంతారావు.

"ఇంకా రెండేళ్లు తగ్గించు. రేపు వైశాఖమాసానికి నీ ముద్దులకుమారుడికి పదోఏడు వస్తుంది. అప్పుడే మరిచిపోయినట్టున్నావు!" అంది శేషమ్మ.

"వాడు నీతో మర్యాదగా వుండనిది ఇవాళ్ల కాదుగా-ఈ నాలుగేళ్లమట్టీ వాడు నీతో పెంకెగానే వుంటున్నాడుగా. నువ్వూ మరిచిపోయినట్టున్నావు!" అన్నాడు కాంతారావు.

"వాడి ఎదటే వాడిని ఇలా వెనకేసుకొస్తే పెంకెగా వుండ కేం చేస్తాడు?" అంది శేషమ్మ.

"వెనకేసుకుని రావటం తప్పుగాదుకాని వాడి ఎదటే ఆపని చెయ్యటం తప్పుకామాలు!" అన్నాడు కాంతారావు.

"నాయనా, నీకొడుకుని నీయిష్టం వచ్చినట్టు పెంచుకో. ఏదో పెద్దదాన్నికొబట్టి వాడింత చదువుకుని బాగుపడాలని నా కుంటుంది. నువ్వు అక్కర్లేదన్నా వుంటుంది. అనుకోటమేకాని నేననుకున్నట్టు ఎలా జరుగుతుంది? వాడు నీకొడుకాయె-నువ్వెంతో వాడూ అంతే. నీ కెంత లక్ష్యం వుందో వాడికీ అంతే వుంటుంది. నామాట నువ్వెంత విన్నావో వాడూ అంతే వింటాడు!" అంది శేషమ్మ.

"నా చిన్నప్పటి సంగతులు తప్ప నావిషయం నీ కింకేమీ జ్ఞాపకం లేదల్లే వుంది?" అన్నాడు కాంతారావు.

"ఎలా మరిచిపోతానూ? నీ పుత్రుడు ఒక్కొక్కపని చేస్తుంటే నీవు చేసిన పనులు కళ్లకుకట్టినట్టు వుంటయి. నువ్వు లేకపోతే వీడు నన్నెంత ఏడిపించేదీ నీకేం తెలుసు, గోడలూ చెట్లూ ఎక్కటం మొదలైన సకలవిద్యలూ నీకుమల్లేనే తెలుసు—"

"నాన్నా, భోజనానికి రమ్మంటున్నది అమ్మ!"

కాంతారావు లోపలికి వెళ్లాడు. కాంతారావుతో జగన్నాధంకూడా వెళ్లాడు.

"ఏం రాజమ్మగారూ, మీ ఇంట్లో భోజనాలయినయ్యా?" అంది శేషమ్మ.

"ఏదీ, మావాడు భోజనం చేస్తున్నాడు" అన్నది రాజమ్మ.

"మా కాంతారావు ఇప్పుడింకా నయం. వాడు చిన్నప్పుడు చేసిన గోల భగవంతుడికి తెలుసు" అంది శేషమ్మ.

"ఆ. చిన్నతనంలో అల్లరి పెద్దతనంలో వుంటుందిటండీ మీకు మరీ చాదస్తంగాని!" అంది రాజమ్మ.

"మీమనమడూ, కొడుకూ చూడండి — వాళ్లెలా వుంటారో?" అన్నది శేషమ్మ.

"మా వెంకట్రాముడు చిన్నప్పుడు ఒకచోట కూచో పెడితే అలా కదిలేవాడుకాదు!" అంది రాజమ్మ.

"అదృష్టం! తండ్రిపోలికే కొడుక్కి వచ్చింది. మా వాడు పెరుగుకుండలు ఎన్ని పగలకొట్టాడో లెక్కలేదు. వాడు మంచినీళ్లగ్లాసు గిరాటేస్తే జామ చెట్టుదగ్గిర పడేది" అంది శేషమ్మ.

"ఆ. చిన్నతనం" అంటూ రాజమ్మ లోపలికి పోయింది. శేషమ్మ అక్కడే కూచునివుంది. శివరాము లోపల్నించి వచ్చి పుస్తకం తీసుకుని గడగడా చదవటం మొదలుపెట్టాడు.

కాంతారావు ఇంటికొచ్చేసరికి జగన్నాథం ఒకమూల కూచునివున్నాడు.

"అమ్మ ఏదిరా?" అన్నాడు కాంతారావు.

"వచ్చావు బాబూ!" అంటూ వచ్చింది శేషమ్మ. వెనకాలే కాంతారావుభార్యకూడా వచ్చింది.

"నాన్నతో చెప్పమంటావా?" అంది జగన్నాథంతల్లి

"ఎలా నంగనాచిఅల్లే కూచున్నాడో చూడు! వొరేయి కాంతం! వీడితో వేగలేకుండావున్నాంరా. నువొక్కసారి వీడిని గట్టిగా భయంపెడితేగాని మరి మాటదక్కదు!" అంది శేషమ్మ.

"నన్నేం చెయ్యమంటావు?" అన్నాడు కాంతారావు.

"ఇవాళ వీడు వెంకట్రామయ్యగారి రిస్టువాచీ పగలగొట్టాడు. ఆయన లేనప్పుడు వాళ్లరేడియో తిప్పుతుంటాడు. రాజమ్మగారు అనేకసార్లు అంది. ఆయన లేకపోతే ఆ రేడియో ముట్టుకోటానికి ఆయనభార్యకే భయం. వాళ్లింట్లో శివరాముమటుకు కుర్రాడు కాదూ? వాడేమన్నా ఇలాటిపనులు చేస్తున్నాడా?" అంది శేషమ్మ.

"ఆయనరిస్టువాచీ ఎందుకు 'పగలకొట్టావురా?" అన్నాడు కాంతారావు.

"పెట్టుకోమని ఆయన నాకిచ్చాడు నాన్నా!" అన్నాడు జగన్నాథం.

"వెధవా, అబద్ధాలు చెబుతా వెందుకు— నువ్వు అడిగితే ఇచ్చాడా, వూరికే ఇచ్చాడా ?" అంది శేషమ్మ.

"నే నడిగితేనే ఇచ్చాడు!" అన్నాడు జగన్నాథం.

"ఎందుకు నువ్వాయన్ని అడగటం ?" అంది శేషమ్మ.

"వాడు కుర్రాడు గదా, వా డడిగితే మాత్రం ఆయన ఇయ్యటం దేనికి ?" అన్నాడు కాంతారావు.

"ఇస్తే పగలగొట్టాలని వుందా?" అంది శేషమ్మ.

"ఎలా పగిలిందిరా" అన్నాడు కాంతారావు.

"మేము బిళ్లంగోడు ఆడుతున్నాం నాన్నా— బిళ్ల వచ్చి నాచేతికి తగిలింది-వాచి పగిలింది!" అన్నాడు జగన్నాథం.

"నీ ఈడుకు నీకు బిళ్లంగోడు దేనికిరా ?" అంది శేషమ్మ.

"అదేమిటి అర్థంలేని మాట! వాడు ఏది చేసినా తప్పేనంటే ఎట్లా? అయితే పిల్లలు ఆడుకోరూ?" అన్నాడు కాంతారావు.

"పొద్దస్తమానం ఆటలేనా— ఆ స్కూలువాళ్ల కన్నా బుద్ధిలేదు. పరీక్షలయింతర్వాత ఈ శెలవలు దేనికి— వీళ్లు అల్లరి చెయ్యటానికి తప్పితే !" అంది శేషమ్మ.

"ఆటలో వెంకట్రామయ్యగారి నుదురు పగిలింది- అసలు కన్ను పోవలిసింది!" అన్నది కాంతారావు భార్య.

"ఆయ నెందు కున్నాడూ అక్కడ ?" అన్నాడు కాంతారావు.

"ఆయనా ఆడాడు నాన్నా!" అన్నాడు జగన్నాథం

"ఆడితే ?" అంది శేషమ్మ.

"నేను పిల్లని కొట్టబోతుండగా ఆయన పట్టుకుందామని దగ్గిరికి వచ్చి నిలబడ్డాడు. ఆ పిల్లజెల్లి ఆయనముఖంమీద తగిలింది!" అన్నాడు జగన్నాథం.

"ఆయనకు వీడితో ఆటలేమిటి?" అన్నాడు కాంతారావు.

"బాగుందే! ఏదో కుర్రాడు గదా అని చనువు చేస్తే ఆయనముఖం పగలగొట్టమనీ, రిస్టువాచి పగలగొట్టమనీ, రేడియో పాడుచెయ్యమనీ వుందా ఏమిటీ? వాడిని నువ్వు కొంచెం హద్దులో పెడితే తప్ప మరి లాభం వుండదు" అంది శేషమ్మ.

"నేను వాడిని హద్దులో పెట్టేదేమిటి-మీరు పెట్టరాదూ?" అన్నాడు కాంతారావు.

"ఇందాకటినించీ నన్ను వా డెంత ధిక్కరించాడో నీ కేం తెలుసు?" అంది శేషమ్మ.

"దీనికి నన్ను కోప్పడమంటే మటుకు నేనేం కోప్పడను? కుర్రవాడికి రిస్టువాచీ ఇయ్యటం ఆయన తప్పు."

"వీ డడగటం దేనికీ?"

"వాడు అనేకం అడుగుతాడు-వా డడిగినవన్నీ ఇస్తారా? అదైనా వాడిదగ్గిర పగిలిందికాని వాడు కాదు దాన్ని పగలగొట్టింది. ఆయనమొహం పగిలిందంటే వీడిది కాదు తప్పు. ఆటలో దెబ్బ అరటిపండు. పిల్లలతో ఆడుకోటానికి సిద్ధమయినవాడు దాని ఫలితానికికూడా సిద్ధం కావాలి. అనవసరంగా వాడిని కోప్పడమంటే మటుకు నేను కోప్పడను!"

"ఇలా అయితే మాట దక్కుతుందిట్రా వీడితో!" అంది శేషమ్మ.

"వాడిని ఇష్టంవచ్చినట్టు ఆడుకోనీయక వాడితో జోక్యం కలగచేసుకోవటం దేనికీ? ఆయన వీడితో ఆడుకోవటం దేనికీ? వీడికీ ఆయనకూ భేదం ఏమిటి? వాళ్ల శివరాముతో ఆయన ఎందుకు ఆడుకోడు?"

"వాళ్ల శివరాము ఇలాంటి పిచ్చిపను లేమీ చెయ్యడు!" అంది శేషమ్మ.

"పిచ్చిపను లని నీనమ్మకం-సరదా అని ఆయన అభిప్రాయం! ఇంతకూ ఆయనేమన్నా అన్నాడా వీ డిలా చేశాడని?"

"బాగుందిరా-ఆయన అంటాడేమిటి? వాళ్ల రాజమ్మ అంది!"

"ఆయనవాచీ పగిలినా ఆయనకు లేని దుగ్ధ ఆవిడకూ, నీకూ పట్టింది!" అన్నాడు కాంతారావు.

"సొమ్ము కాదట్రా-అలా అంటా వేమిటి?" అంది శేషమ్మ.

"ఆయనకుమటుకు కాదూ సొమ్ము? ఆయన తన కొడుకుతో ఆడుకోలేక మనవాడితో ఆడుకుంటున్నాడు. చిన్నప్పుడు చిన్నతనంగా వుండకపోతే ఆ చిన్నతనం పెద్దప్పుడు ఇలాగే వస్తుంది! నేను వాళ్ల శివరాముతో ఆడుకుంటే నావాచీ పగిలితే నే నతన్ని ఏమీ అనను సరేగదా మనస్సులోకూడా అనుకోను!" అన్నాడు కాంతారావు.

"నువ్వు పిల్లల్ని దగ్గిరికి రానియ్యటం — నేను చూడటం!" అన్నది శేషమ్మ.

"అవును! వాళ్లని ఆడుకోనీక మనం దేనికి? వాళ్లతో ఆడుకోవాలంటే మనంకూడా వాళ్లతో సమానం అవాలి. అప్పుడు ఏం జరిగినా అనుకోవలిసిన అవసరమే లేదు. వాళ్ల శివరాముతో ఆయనకు ఆడుకోవాలని వున్నా ఆ శివరాముకు ఆయనతో ఆడుకోవాలని లేదల్లే వుంది. అందుకనే ఆయన మనవాడి దగ్గిరికి చేరాడు!" అన్నాడు కాంతారావు.

"వా డిలా అల్లరిచేస్తుంటే వాడిని భయం పెట్టకపోతే ఎలాగురా?" అంది శేషమ్మ.

"నువ్వింతేమటుకు వాడి అల్లరి అల్లరి అని అనేకసార్లు చెప్పావు. తొమ్మిదేళ్లవాడు నలభైఏళ్ల వాడిమాదిరిగా ప్రవర్తించకపోవటం అల్లరి అని నీ నమ్మకం. పెద్దవాళ్లం మనమే చిలిపిచేష్టలు చేస్తూ, వెధవాలోచనలు మనస్సులో పెట్టుకుని మర్యాదస్థుల మల్లే తిరుగుతుంటే చిన్నపిల్లలు ఏ కల్మషం లేక

వాళ్ళ దారిని వాళ్లు ఆడుకుంటే మనం వోర్చలేకపోవట మేమిటి? పైగా ఇటువంటివాటికి నన్ను భయపెట్ట మంటావు. నాకొడుక్కు నాయందు భయమూ, భక్తీ కావు నాకు కావలిసింది. నాయందు వాడికి కొంచెం అభిమానమూ, ప్రేమా వుంటే చాలు. నువ్వు చెప్పినట్టు చేస్తే వీడూ శివరాములల్లే తయారయ్యేవాడు. శివరాము ఎంత మంచివాడయినా అటువంటి కొడుకు మటుకు నా కక్కర్లేదు. అటువంటి కొడుకే నాకూ వుంటే నేనూ వాళ్ల నాన్నకుమల్లే ఆడుకోటానికి ఎవరినన్నా వెతుక్కోవాలి!"

"నన్ను వీడు నాయనమ్మగారూ అని పిలవటం మొదలుపెట్టాడు — కో కామాలు!" అంది శేషమ్మ.

కాంతారావు నవ్వాడు.

"ఇందాకటి విషయాలన్నీ అయిపోయినయి కామాలు. నన్ను నాన్నగారూ అని పిలిస్తే కోప్పడితే వాడిని వెనకేసుకునివస్తివే ఆనాడు? ఇప్పుడు నిన్ను నాయనమ్మగారూ అని పిలవటం నీ కిష్టం లేదు కామాలు—తమాషే!"

"ఏడీ మీ జగ్గన్నాడా?" అంటూ లోపలికి వచ్చాడు వెంకట్రామయ్య.

"రండి!" అన్నాడు కాంతారావు.

"ఏడీ మీవాడు?" అన్నాడాయన.

"మా వాడు చాలా అల్లరి చేస్తున్నాట్టే!" అన్నాడు కాంతారావు ఆయన మొఖంమీద పట్టీచూచి.

"భలేవాడండీ మీవాడు. నామీద నల్భై పిల్లీలు ఎక్కించాడు. ఏడీ ?"

"మీ గడియారం పగిలిందిట?"

"వెధవగడియారం — ఇంకోటి వస్తుంది!" అన్నాడు వెంకట్రామయ్య.

"వాడిని పిలవ్వే!" అని కాంతారావు అంటూండగానే జగన్నాథం లోపలికి వచ్చాడు.

"రావోయ్ సినిమా కెళదాం!" అన్నాడు వెంకట్రామయ్య.

"వాడు మీతో సినిమా కేమిటి?" అంది శేషమ్మ.

"పర్వా లేదు! మీవాడిని పంపించాలండీ!" అన్నాడు కాంతారావుతో వెంకట్రామయ్య

కాంతారావు జగన్నాథంవంక చూచాడు. జగన్నాథందృష్టి అంతా తండ్రిమీదనే వుంది.

"వెళ్తావుట్రా?" అన్నాడు కాంతారావు.

'సై' అన్నట్టుగా తల వూపాడు జగన్నాథం.

"అయితే వెళ్లు!" అన్నాడు కాంతారావు.

జగన్నాథం ఒక్క పరుగు తీశాడు బైటికి.

"వోరేయి వెధవా— ఆ మట్టిమొఖం అదీ కడుగుతా రారా" అంది శేషమ్మ.

"నాకొద్దు!" అన్నాడు జగన్నాథం.

"చూడరా—అదీ వరస!" అంది శేషమ్మ.

శేషమ్మ బలవంతంగా జగన్నాథాన్ని పట్టుకుని, అతను గిజగిజా కొట్టుకుంటున్నా తీసుకువెళ్లి, మొఖం కడిగి, తల దువ్వి, ఇస్త్రీబట్టలు తొడుగుతుంటే కాంతారావుకు నవ్వు వచ్చింది. ఏదో అందామని వెంకట్రామయ్యవంక తిరిగాడు.

వెంకట్రామయ్య అలాగే నిలబడి జగన్నాథం వంకనే చూస్తున్నాడు. అతని ముఖంలో వర్ణనాతీతమైన వుత్సాహం తాండవమాడుతున్నది. కాంతారావు ఆశ్చర్యపోయినాడు.

జగన్నాథం వెంకట్రామయ్యతో వెళ్లింతరువాత "పాపం, ఆయన ఎంత బాధపడుతున్నాడో ఇప్పుడు-చిన్నతనంలో చిలిపిచేష్టలు చెయ్యాకపోవడం వల్ల!" అన్నాడు కాంతారావు భార్యతో.

# వరాత్రికి బ్రహ్మాండమైన విడుదల!

## ఆంధ్రదేశము నందలి ప్రధాన కేంద్రములలో

ఆదర్శ భారతవీరుడు, ఆజన్మ బ్రహ్మచారి, కౌరవపితామహుడు -

## భీష్ముని రసమయగాథ!




బెజవాడ శ్రీనివాస్ ఫిలిమ్సువారి విడుదల.

# యుద్ధానంతర సమస్యలు—అధిక యంత్రబలము*


శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య,

= శ్రీ పట్టాభిరామరావు =


వెంకటరంగయ్య:—యుద్ధానంతరం ఆర్థిక పునర్నిర్మాణం జరగవలసి ఉన్నదనియు, ఈ నిర్మాణము యొక్క ప్రధానోద్దేశం మనకు కావలసిన ఆహారం, బట్టలు, ఇండ్లు, ఆరోగ్యసౌకర్యాలు విద్యాసౌకర్యాలు ఇప్పటికంటె రెండు మూడురెట్లు ఎక్కువగా వృద్ధి కావలసియున్నదనియు అందరూ అంగీకరిస్తున్నారు. వీటి నన్నిటిని వృద్ధిచేయడంలో యంత్రబలాన్ని మనం ఎంతవరకు ఉపయోగించవలసి ఉంటుంది? అనేది మనం ఇప్పుడు చర్చించవలసిన విషయం.

పట్టాభిరామరావు:—నిజమే. కాని, ఇందులో చర్చకు అవకాశం ఏమి ఉన్నది? అనే సందేహం నాకు ప్రారంభంలోనే కలుగుతున్నది. ఇది నిర్వివాద విషయమని నాకు తోచుచున్నది. ఎందుకంటే ప్రపంచంలో ఆర్థికంగా అభివృద్ధిగాంచి సమస్త ఐహిక సౌఖ్యాలనూ అనుభవిస్తుండే ఇంగ్లండు, అమెరికా మొదలైన దేశాలలోని వారి సౌఖ్యాని కంతకూ విరివిగా వారు ఆర్థిక వ్యవహారా లన్నిటిలోనూ యంత్రాలను ఉపయోగిస్తూ ఉండడమే ప్రధానకారణం. వారి పరిశ్రమలు, వ్యవసాయం, రవాణా సౌకర్యాలు, వారి వినోదాలు, విలాసాలు—అన్నీ యంత్రమయం. అందుచేతనే, ఆ దేశాల చరిత్రను చదివి పరిశీలించిన వారందరూ ప్రస్తుత యుగానికి "యంత్రయుగం" అనే నామధేయం చేశారు. ఆర్థికంగా ఎంతో వెనుకబడి ఉండే మనంకూడా సిరిసంపదలతో పాశ్చాత్యులతో తులతూగవలెనంటే, వారివలె మనంకూడా యంత్రాల సహాయాన మన వ్యవహారాల నన్నిటిని నడుపుకోవలెను. అప్పటికి కాని, దారిద్ర్యం మనలను వదలదు.

వెంకటరంగయ్య:—పాశ్చాత్యులు యంత్రాలను వాడుతున్నారు గనుక మనంకూడా అలాగే చేయవలెననే వాదం నాకు నచ్చడం లేదు. పాశ్చాత్యులు అనుసరించే పద్ధతులన్నీ మనం కూడా అనుసరించవలసిందేనా?

పట్టాభిరామరావు:— కాదు. యంత్రాలను మనం ఎక్కువగా ఉపయోగించవలసి ఉన్నదనుటకు ఎన్నో కారణాలు ఉన్నవి. యంత్రాల మూలంగా మనం స్వల్పకాలంలో ఎక్కువ పని చేయగలుగుతాం. చేనేతకూ మిల్లులనేతకూ గల భేదాని కంతా ఇదేకదా కారణం. స్వల్ప శ్రమతో ఎక్కువ పదార్థాలను తయారుచేయగలుగుతాం. మనుష్య శక్తికి అతీతమైన పనులను యంత్రసహాయాన చాలా సులభంగా మనం చేయగలుగుతాం. నాణ్యమైనట్టియు, బహు సున్నితములైనట్టియు పదార్థాలను తయారు చేయగలుగుతాం. వస్తుసామగ్రి బాహుళ్యంగా ఉత్పత్తికావడంచేత అవి చాలా చౌకగా లభించగలవు. ప్రధానమైన వస్తువులన్నీ అందరి అందుబాటులోకి రావడానికి యంత్రాలే సాధనం.

వెంకటరంగయ్య:—మీరు చెప్పినదంతా పైకి చాలా ఆకర్షణీయంగా ఉన్నా చక్కగా ఆలోచిస్తే చాలా లోపాలతో కూడుకొన్నట్లు స్పష్టంఅవుతుంది. కూలిపనిచేసి జీవించేవారికి కూలిపని దొరకకపోవడం, నిరుద్యోగసమస్య ప్రబలం కావడం, అప్పుడప్పుడూ ఆర్థికవిధానాని కంతకూ ఎక్కడలేని ప్రమాదం సంభవించి వ్యాపార మాంద్యం కలగడం, వెల్తురూ, గాలీ లేని ఫ్యాక్టరీలలో పురుషులు మాత్రమే గాక స్త్రీలు, పిల్లలు పనిచేయడం, జనసమ్మర్దంతో కూడినట్టియు, దుర్గంధభూయిష్ఠమై సమస్త రోగాలకూ ఆలవాలములైన పట్నాలు పెరగడం, పెట్టుబడి పెట్టు ఎవరో కొద్దిమంది సాహుకార్లు లక్షాధికారులైనా కూలిపని చేసుకొనే సామాన్య జనం భిక్షాధికారులుగానే ఉండడం, పెట్టుబడిదార్లకూ కూలివాండ్రకూ సంఘర్షణలు అధికములై సమ్మెలు సంభవించడం-ఇదంతా యంత్రాలను అధికంగా వాడడంవల్ల కలిగిన ఫలితాలు కావా?

* ఇది మొన్న జనవరి 12-వ తేదీనాడు మద్రాసు రేడియోవారు చర్చారూపమున ప్రసారము చేసిన ప్రసంగము ; వారి సౌజన్యముతో, అనుమతితో ప్రకటింపబడినది.

ఇట్టి ప్రమాదాలకు కారణభూతాలైన యంత్రాలను మనం ఎక్కువగా వాడవలెనని చెప్పడం సమంజసం కాదని తోచుచున్నది.

పట్టాభిరామరావు:—మీరు కొంత పొరబడుచున్నారు. యంత్రాలను ఉపయోగించిన పాశ్చాత్య దేశాలలో ప్రసర్థమాన ఈలాటి అనర్థాలు బయలుదేరినమాట నిజమే కాని, ఇవన్నీ కాలక్రమాన అదృశ్యం అవుతున్నవి. ప్రారంభంలోనే అవి నిర్మూలం కాకపోవడానికి ఆ కాలపు ప్రభుత్వ విధానాలలోనూ, రాజ్యాంగతత్వాలలోనూ ఉన్న లోపాలే కారణం. ఆర్థిక వ్యవహారాలలో ప్రతివ్యక్తికీ పరిపూర్ణ స్వాతంత్ర్యం ఉండవలెననీ, ప్రభుత్వంవారు ఏలాటి జోక్యం కలుగచేసుకోకూడదనీ ఆకాలంవారు అనుకొనేవారు. అందుచేత, లోపాలను అరికట్టడానికి ప్రభుత్వంవారు సిద్ధపడలేదు. కాలక్రమాన ఈ తత్వం మారింది. యంత్రసహాయాన ఉత్పత్తి అయ్యే ధనం పెట్టుబడిదార్ల సౌఖ్యానికి మాత్రమే కాకుండా అందరియొక్క సౌఖ్యానికి వినియోగం కావలె ననినీ, అట్టి వినియోగం జరిగేటట్లు ప్రభుత్వంవారు నిర్బంధ శాసనాలు చేయవలసిన దనినీ అందరూ అభిప్రాయపడ్డారు. దాని ఫలితంగా కూలివాండ్ర సౌకర్యాలకు కావలసిన ఫ్యాక్టరీ చట్టాలు ఎన్నో అమలులోకి వచ్చినవి. నగర పారిశుధ్య సంఘాలు ఏర్పడ్డవి. కట్టుదిట్టాలతో ఫ్యాక్టరీల నిర్మాణం జరగడం సంభవించింది. ఈలాటి సంస్కరణాలు ఎన్నో జరిగినవి. ఇంకా జరుగుతున్నవి. కనుక యంత్రబలం అధికంకావడంవల్ల ఏర్పడే అనర్థాలు ప్రతిక్రియ లేని అనర్థాలు కావు. వాటిని ఎదుర్కొనవచ్చును. జయించవచ్చునుకూడా.

వెంకటరంగయ్య:—కనుక ఇప్పటికి ఒక విషయం తేలింది అన్నమాట. యంత్రాలమూలంగా కొన్ని ప్రమాదాలు సంభవించవచ్చును. దేశంలోని ప్రభుత్వంవారు ఆ ప్రమాదాలను గమనించి, వాటిని పోగొట్టడానికి కావలసిన శాసనాలుచేసి, ఆశాసనాలను నిష్పక్షపాతబుద్ధితో అమలులో ఉంచడానికి సిద్ధపడవలెను. అట్టిదృష్టి ప్రభుత్వంవారిలో ఉన్నగాని యంత్రవిధానాన్ని ప్రవేశపెట్టడం యుక్తం కాదు.

పట్టాభిరామరావు:- -నిజమే. ఆర్థిక వ్యవహారాలకున్నూ, రాజ్యాంగ వ్యవహారాలకున్నూ సన్నిహిత సంబంధం ఉన్నదన్నమాటను నేనూ అంగీకరిస్తున్నాను.

వెంకటరంగయ్య:—మరొక విషయంకూడా గమనించవలసిఉంది. ఆర్థికవ్యవహారాలు అనేకరకాలుగా ఉన్నవికదా? పరిశ్రమలనీ, వ్యవసాయంఅనీ, రవాణా సౌకర్యాలనీ మనం మామూలుగా ఈ వ్యవహారాలను విభజిస్తూఉంటాం. అన్నివ్యవహారాలలో యంత్రబలాన్ని అధికంచేయవలెనని మీ అభిప్రాయమా? లేక ఏదైనా వివక్ష అవసరమా?

పట్టాభిరామరావు:— తప్పకుండా కొంత వివక్ష చేయవలసిఉన్నది. పరిశ్రమలవిషయంలో యంత్రాలను ఉపయోగిస్తే తప్ప, మనకు కావలసిన వస్తుసముదాయాన్ని మనం అధికంగా ఉత్పత్తిచేయలేము. ఈ పరిశ్రమలుకూడా మూడు రకాలుగా ఉన్నవి. దేశసంరక్షణకు అవసరమైన యుద్ధసామగ్రిని తయారుచేసే పరిశ్రమలు కొన్ని. ఇప్పుడు జరుగుతున్న యుద్ధం ఆఖరు యుద్ధమని అనుకొనడానికి వీలులేదు కదా? భావికాలంలో ఎన్నో యుద్ధాలు రావచ్చును. రాగలవుకూడాను. మందుగుండుసామానులు, ఫిరంగులు, బాంబులు, టాంకులు, కవచసహితములగు కార్లు, యుద్ధనౌకలు, ఆకాశవిమానాలు మొదలైన యుద్ధపరికరాలను తయారుచేయుటకు కావలసిన పరిశ్రమలను ఎన్నిటినో మనం మనదేశంలో స్థాపించుకోవలసిఉంది. వీటిని స్థాపించుకోవడమే శ్రేయస్కరమని ఈమధ్యన బయలుదేరిన ఆర్థికప్రణాళికలకర్తలందరూ అంగీకరించారు. యంత్రాలసహాయం లేనిదే ఈ పరిశ్రమలు సాగవుకదా?

వెంకటరంగయ్య:— అవును. వీటితోపాటు మరికొన్ని ప్రధాన పరిశ్రమలు కూడ మనం స్థాపించుకోవలెను. సాధారణంగా వీటికి మూల పరిశ్రమలనీ, కీలకపరిశ్రమలనీ పేరుపెట్టి ఉన్నారు. విద్యుచ్ఛక్తిని జలపాతముల నుండి తయారుచేయడం, గనులనుండి లోహాలను తియ్యడం- వాటిని, ఉపయోగపరచుకోవడం, యంత్రాలను తయారుచేయడం వ్యవసాయాది వృత్తులలో కావలసిన రకరకములగు పనిముట్లను తయారుచేయడం, రసాయన పదార్థాల ఉత్పత్తి, రైలుబండ్లు, మోటారుకార్లు, లారీలు, బస్సులు తయారుచేసే ఇంజనీరింగు పరిశ్రమలు-ఇవన్నీకూడా ఈ కీలకపరిశ్రమలలో చేరుతవి. ఇవి ఏవీ కూడా యంత్ర సహా

యం లేనిదే నడిచేవికావు. ఈ కారణం చేత కూడా యుద్ధానంతరం మన దేశంలో యంత్రబలం చాలా అధికం కావలసి ఉంది.

పట్టాభిరామరావు:—ఈ సందర్భంలో ఒక ముఖ్య విషయాన్ని మనం గమనించడం అవసరం. యంత్రాలను ప్రవేశపెట్టడం మూలాన కూలిజనానికి కూలిదొరకకుండా పోతుందని అనేకులు ఆక్షేపణచేస్తూ ఉంటారు. కాని, ఈ ఆక్షేపణ యుద్ధపరిశ్రమల విషయంలోనూ, మనం అనుకొన్న కీలక పరిశ్రమల విషయంలోనూ వర్తించదు. కారణం ఏమిటంటే ఇవన్నీ చాలామట్టుకు కొత్తపరిశ్రమలు యంత్రసహాయాన వీటిని స్థాపిస్తే, ఇదివరకు కూలి దొరకక నిరుద్యోగులుగా ఉండేవారిలో చాలామందికి కూలి దొరుకుతుందని చెప్పవచ్చును.

వెంకటరంగయ్య:—ఈలాటి నూతనపరిశ్రమలు ఇంకనూ ఎన్నో ఉన్నవి. ఉదాహరణానికి ఒకటి రెండును మాత్రం సూచిస్తున్నాను. మన దేశంలో అనేక ప్రాంతాలలో రకరకములైన పండ్లు ఫలిస్తున్నాయి. కాని అవి చెడిపోకుండా సంవత్సరం పొడుగునా అనుభవయోగ్యంగా ఉండేటట్లు చేయగల 'కానింగు' పరిశ్రమ మన దేశంలో వ్యాప్తిగాంచలేదు. అట్టి పరిశ్రమను మనం స్థాపించ గలిగితే పండ్లను పండించే వారికి తినేవారికి ఎంతోలాభం. కాని, యంత్రసహాయం లేనిదీ దానిని స్థాపించలేము. అదే విధంగా, పాలు, వెన్న మొదలైనవి చెడిపోకుండా చాలాకాలం ఉండడానికి పరిశ్రమలు అవసరం. వ్యవసాయము, పసురక్షణ ప్రధాన జీవనోపాయంగా ఉన్నా, విదేశాలనేకాలలో ఈలాటి పరిశ్రమల మూలంగా ప్రజలు ఎంతో లాభం గడిస్తున్నారు. వీటినికూడా మనం నూతన పరిశ్రమలలో చేర్చవలసి ఉన్నది. అవి జరుగుటకుకూడా యంత్రబలం అధికం కావలెను.

పట్టాభిరామరావు :— ఆలోచించి చూస్తే, పదార్థాలను ఉత్పత్తిచేయడం, వాటిని చెడిపోకుండా ఉంచుకోవడంలోకూడా యంత్రాలు మనకు అవసరం అని చెప్పక తప్పదు. గ్రామఫోనులు, రేడియోలు, టెలిఫోనులు, సినిమాలు, సైకిళ్లు, టైపురైటర్లు ఇవన్నీ కూడా యంత్రాలేకావూ?

వెంకటరంగయ్య:—అవును. వీటి నన్నిటినీ జనబాహుళ్యంయొక్క అందుబడిలో ఉండేటట్లు చేయడమే కదా మన ఆదర్శం. ప్రతి గ్రామంలోనూ, రేడియోలు విద్యుద్దీపాలు, సినీమాలు ఉండడమంటే యంత్రబలం అధికంగా వాడడమేకాదూ? ఈలాగే విద్యావిషయంలోకూడ. అందరూ అక్షరాస్యులైనప్పుడు అందరి అందుబడిలో పుస్తకాలు, వార్తాపత్రికలు మాసపత్రికలు ఉండవలసిన అవసరం కలుగుతుంది. పుస్తకభాండాగారాలు వృద్ధి కావలసి ఉంటుంది. అంటే కాకితాలు అపరిమితంగా మనం తయారుచేసుకోవలెను. కాకితపు మిల్లులు వృద్ధి కావలెనన్న మాట. ఇదేవిధంగా, ముద్రణాలయాలు వృద్ధి కావలసి ఉంటుంది. పుస్తకాలు ఆకర్షణీయంగా ఉండడానికి వాటిలో చిత్రాలు, బొమ్మలు చాలా ఉండవలెను. అంటే ఫొటోగ్రాపులు తీయడానికి కావలసిన కామిరాలకు గిరాకి హెచ్చవుతుందన్నమాట.

పట్టాభిరామరావు: — కొసకు యంత్రబలం అధికం చేయవలెను అనే విషయంలో మీరు నాతో పూర్తిగా ఏకీభవించేటట్లై ఉన్నది. చూడండి, మనం వేసుకొనే దుస్తులుకూడా ఎంతో మారుతున్నవి. స్త్రీలు పురుషులు పిల్లలు అందరికీకూడా ఈకాలంలో కుట్టుపనివాండ్ర సహాయం ఎంతో అవసరం అవుతున్నది. కాని కుట్టుయంత్రాలు లేనిదీ కుట్టుపనివాండ్రకు మన అవసరాలను ఏలాగు తీరుస్తారు? ఇదే విధంగా చెప్పులు జోళ్లు, బూట్లు, మొదలైన పాదరక్షలను వాడేవారి సంఖ్యకూడా వృద్ధి అవుతున్నది. ఇవన్నీ అందరి అందుబడిలో ఉండేటట్లు మనం చౌకగా ఉత్పత్తిచేయవలసి ఉన్నది. పల్లెటూళ్లలో వంశపారంపర్యంగా జోళ్లుకుడుతున్నవారి మూలాన ఈ అవసరాలు తీరడం దుస్సాధ్యం. గొప్ప ఫ్యాక్టరీలు, యంత్రసహాయం ద్వారా స్థాపింపబడవలసి ఉన్నది. కనుక కొత్త పరిశ్రమల యందే కాకుండా పాత పరిశ్రమలలోకూడ మనం చాలవరకు యంత్రబలం అధికం చేసుకోవడమే ఉత్తమ మార్గం.

వెంకటరంగయ్య — అయితే మన దేశంలో వ్యవసాయం కదా ప్రధాన వృత్తి. నూటికి ఎనభై మంది వ్యవసాయం వల్ల జీవించేవారు. వ్యవసాయంలో కూడా, దున్నడానికి, నారువేయడానికి, నేలను చదునుచేయడానికి, కలుపుతీయడానికి, పైరుకోయడానికి, కుప్పల నూరవడానికి - సేద్యపు పనులన్నిటికీ కూడా యంత్రాలను ఉపయోగింపవలసిందనే నా మీ అభిప్రాయం?

పట్టాభిరామరావు — అవును. ఎకరా భూమి నుండి పాశ్చాత్య దేశాలలో మనం పండించే పంట కంటే ఎంతో ఎక్కువగా పండిస్తున్నారు. దీనికి కారణం వారు యంత్రాలను ఉపయోగించడమే. ఇటీవలవరకు వ్యవసాయంలో చాలా వెనకబడి ఉన్నట్టి రషియా దేశంలో కొత్త ప్రభుత్వం స్థాపింపబడ్డతర్వాత ట్రాక్టర్లు, అనే యంత్రాలను రైతులు ఉపయోగించడం చేత పంట ఎంతో అధికం అయింది. మనం కూడా అలాగే చేయవలెను.

వెంకటరంగయ్య:— ఈ విషయంలో మాత్రం నేను మీతో ఏకీభవించలేకున్నాను. మన పరిస్థితులకు, పాశ్చాత్య దేశాలలోని పరిస్థితులకును వ్యవసాయ విధానంలో చాలా భేదాలు ఉన్నవి. మన జనసంఖ్య చాలా ఎక్కువ. ఇప్పటికే పల్లెల్లోని జనానికి పూర్తిగా కూలి దొరకడంలేదు. ట్రాక్టర్లు మొదలైన యంత్రాలు వాడుకలోకి వస్తే వారికి ఇప్పుడు దొరుకుతున్న కూలికూడా దొరకదు. ఇంతేగాక మన రైతులందరూ స్వల్ప విస్తీర్ణం గల భూములను సాగుచేసేవారు. వేలకొద్ది రూపాయలు పెట్టి యంత్రాలను కొనడానికి, కొన్న తర్వాత వాటిని వాడడంలో ఖర్చుపెట్టవలసిన ద్రవ్యాన్ని ఖర్చుపెట్టడానికి కాని, వాటిని సంవత్సరం పొడుగునా ఉపయోగించడానికి గాని సమర్థులు కారు. మనుష్యబలం లేని దేశాలలో యంత్రాలకున్నట్టి అవసరం మనకు లేదు. కూలినాండ్రను పెట్టుకోవడమే మన రైతులకు చౌకమార్గం. ఇంతేకాకుండా ట్రాక్టర్లు మొదలైన యంత్రాలద్వారా మన భూములను లోతుగ దున్నిన పక్షాన భూమిలోని చెమ్మ తగ్గిపోయి పంటలకు నష్టం కలుగుతుందని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. కనుక వ్యవసాయంలో మాత్రం యంత్రాలుపయోగం విస్తారం లేదని తోస్తున్నది. ఇదిగాక యంత్రాధిక్యతమూలాన పశుసంపద తగ్గిపోవచ్చును. దానితో పాటు ఎరువుల సమస్య క్లిష్టతరం కావచ్చు.

పట్టాభిరామరావు:— బహుశా మీఅభిప్రాయమే సరియైనదేమో అని తోస్తున్నది. కాని వ్యవసాయదార్లకు యంత్రాలవల్ల ఏమీ ఉపయోగం ఉండదూ అనే వాదంతో నేను ఏకీభవించను. ఎందువల్ల అంటే మనం యుద్ధానంతరం ఇదివరకు సాగులోలేని అడవి ప్రదేశాలను బంజరు భూములను ఎక్కువగా సాగులోనికి తెచ్చి ఆహారపదార్థాలను అధికంగా ఉత్పత్తిచేయవలసి ఉన్నది. కొత్త జలాధారాలను నిర్మించవలసి ఉంది. ఈభూములను సాగులోకి తేవడంలో తొలితడవగా ఈ ట్రాక్టర్లు చాలా ఉపయోగిస్తవి. కొన్ని జలాధారాలనుండి, కాలువలనుండి, ఏర్లనుండి, బావులనుండి నీటిని పంపుచేయడానికి కొంతవరకు యంత్రసహాయం అవసరం.

వెంకటరంగయ్య:— కాని మన చర్చలో ఒక విషయం మరచిపోయాము. పరిశ్రమలలోనూ, వ్యవసాయంలోనూ ఉత్పత్తి అయిన వస్తువులను ఒక ప్రదేశాన్నుంచి, మరొక ప్రదేశానికి రవాణాచేయడం అవసరం కదా? ఇందులో యంత్రాలను మనం ఎంతవరకు ఉపయోగించవలసి ఉంటుంది? రైళ్లు, బస్సులు, లారీలు, మామూలు బండ్లు, పడవలు - ఇవి ప్రస్తుతం మనకు ఉండే రవాణా సౌకర్యాలు. మామూలు బండ్లమూలంగా యుద్ధానంతరం అభివృద్ధి కానున్న వ్యాపారం అంతా చక్కగా జరగదు. రైళ్లు, బస్సులు లారీలు ఎక్కువగా ఉపయోగంలోకి రావలసి ఉంటుంది.

పట్టాభిరామరావు:— నా అభిప్రాయం కూడా ఇదే. దూరం స్వల్పం అయినప్పుడు, బరువు కొంచంగా ఉన్నప్పుడు మామూలు బండ్లు పనికి రావచ్చునుకాని యుద్ధానంతరం మనం తలపెట్టిన వ్యాపార బాహుళ్యానికి యంత్ర సంబంధమైన రవాణా సౌకర్యాలు విరివిగా వృద్ధిపొందడం అవసరం. కాని ఈ అవసరం తీరడానికి రోడ్లు ఎక్కువ కావలసి ఉన్నది.

వెంకటరంగయ్య:— ఇప్పుడు మనం చేసిన చర్చవలన తేలిన సారాంశం ఏమిటంటే - మొత్తం మీద యంత్రబలం అధికం కానిదీ దేశంలో ఉత్పత్తి అయ్యే వస్తుసామగ్రి, ప్రజల ఆదాయం వృద్ధికాజాలదు. పరిశ్రమలలో యంత్రబలం తప్పదు. ఆదాయాన్ని చక్కగా వినియోగించుకోవడంలోకూడా యంత్రసహాయం అవసరం. వ్యవసాయంలో యంత్రాలను ఉపయోగించుటకు ఎక్కువ అవకాశం లేనట్టు కనుపిస్తున్నది. యంత్రాలను ఉపయోగించడంలో సంభవించు అనర్థాలను ప్రభుత్వంవారి సహాయాన తొలగించుటకు వీలున్నది. కనుక అధిక యంత్రబలం వాంఛనీయం.

# కలగూరగంప

## ఆ. నా. దాసస్మృతి



సీ. తెలివి తెల్గుల కైత జిలుగుదీపము తెన్గు
వారి నట్టింటిలో నారిపోయె
మీటపల్కుల తేనె లూట లూరెడి తెన్గు
చెలమ నట్టేటిలోఁ గలసిపోయె
పలుకుకల్కికి మీట పాటలాటలఁ దాల్చు
డాకాలిగజ్జె ముఖ్ఖేకఁబోయె
వేల్పుగొప్పల నుడుల్ వినువారి విందుగాఁ
గూయు కోయిల తెన్గుగున్న విడచె
తే. తెలుగు తొలిపల్కు వెలిబల్కు తెలివిజిలుగు
మేలిమానికముల గని కూలిపోయె
బమ్మతెగ తెల్వి కూటిలో దుమ్మువడియె
తనువు బాసి నారాయణదాసు పోవ.

సీ. అజ్జాడకాపురం బాదిభట్లకులంబు
ద్రవిడశాఖాదివ్యతరఫలంబు
హరికథాలాపమందిర సుందరాస్యంబు
గానామృతనిధాన కంబుగళము
వీణతీగల మీటు విన్నాణ మెఱిఁగిన
కరయుగం బతిమృదుకవనజిహ్వ
వివిధభాషాలసద్విజ్ఞానగురుమేధ
రాజరాట్సన్మానపూజనంబు
తే. గీ. గ్రంథసంతానపుత్రభాగ్యంబు గలిగి
ముసలియయ్యును వాణికి మురిపెమొదవు
రెండుచనుబాల గ్రోలుచు నుండుబిడ్డ
డసువు వీడె నారాయణదాసు నేఁడు.

సీ. అజ్ఞానతనువు బ్రహ్మజ్ఞానచితిఁ గాల్చ
భారతీమంత్రకర్మంబు నీకు
తెలుఁగుకన్నుల నూరి వెలిగారి వెచ్చనౌ
కన్నీటి తర్పణా లెన్నొ నీకు
ఆంధ్రవాగ్గుచ్చాన్న మాత్మశాంతికి గల్పి
యిడు ప్రేమపిండంబు లెన్నొ నీకు
సంగీతసాహితీభంగీకళాభ్యాస
శిష్యులు శ్రద్ధ నర్పింత్రు నీకు
తే. గీ. చావు కాదిది దివిలోని తావుకాని
నీవు పోలేదు నీకీర్తి చావలేదు
లోకు లేమన్న నీ కింత లోటులేదు
భవ్యగుణభాస శ్రీ ఆదిభట్లదాస!

రాంభట్ల లక్ష్మీనారాయణ

* * *

ఆటపాటలమేటియని గొప్ప పేరుసంపాదించు కొన్న శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు విజయనగరములో స్వగృహమున మొన్న జనవరి ౨వ తేదీనాడు తెల్లవారుఝామున పరమపదించి రని తెలుపుటకు మిక్కిలి విచారించుచున్నాము. వీరి మరణము

వల్ల ఆంధ్రజాతికేర్పడిన లోటు ఇంతింతనరానిది. ఆటలో, పాటలో, మాటలో అసలయిన తెలుగుదనము నెలకొల్పుకొని, తెనుగునాట హరికథలకు క్రొత్త ఒరవడిని దిద్ది, వానిపై ప్రజలకు అభిమానాదరములు పెద్దగా కల్పించిన దాసుగారి వ్యక్తిత్వమే వ్యక్తిత్వము. ఆయన ప్రతిభయే ప్రతిభ. స్వయముగా, ఏ సహాయమును లేకయే బహుభాషలలో పరినిష్ఠిత పాండిత్యము నార్జించి, నేర్చిన అన్ని భాషలలోను రసవత్కవనముకూడ ఆయన అల్లనేర్చెను. పరమవృద్ధులయ్యు పసిపాపల ఉత్సాహమును మించిన ఉత్సాహము, చురుకుదనము ఆయనకు పరమాభరణములయి యుండెను.

ఆయనఆత్మకు భగవానుడు శాంతి ప్రసాదించుగాక.

## కీ. శే. ఉమ్రాలీషా కవి గారు



కవీశ్వరులు, తాత్వికులు, కేంద్రశాసనసభ సభ్యులు నయిన శ్రీ ఉమ్రాలీషాకవిగారు (పిఠాపురము) శిష్యబృందమును చూచుటకై నర్సాపురము వెళ్లియుండి, అక్కడ మొన్న జనవరి ౨౩-వ తేదీసాయంత్రము అకస్మాత్తుగా పరమపదించిరి. వీరిది పండిత కుటుంబము. వీరు సంస్కృతమును సలక్షణముగా అభ్యసించిరి. ఆంధ్రసారస్వతమునుగురించి వేరుగా చెప్పనక్కరలేదు. తెలుగులో రకరకాలయిన కవితా రచనలను అనేకముచేసినారు. ఇట్టివారు నడివయస్సున చనిపోవుట విచారకరము.

---

## మన 'రాక్షస' సంతతివాళ్లమా ?

ఆదిలో మనిషిపుట్టుక ఎక్కడో, ఎప్పుడో మనకు తెలియదు. తెల్సుకుంటానికికూడా ప్రయత్నించము. ఎందుకంటే యీ మానవజాతి అమాంతంగా ఒక్కమాటుగా పుట్టుకొచ్చింది కాదు. ఏండ్లుపూండ్లు గడచినకొద్దీ పరిణామాలు పొందుతూవచ్చిన పురాణాల్లోని రాక్షసుల సంతతే నేటి యీ మానవజాతి.

అనాదిలో నివసించియుండిన మనుష్యుల అస్థుల కోసం బ్రిటెన్, ఫ్రాన్సు దేశాలలో చేసిన ప్రబల పరిశోధనలు యూరప్, ఆసియా, ఆఫ్రికా ఖండాలలో కూడా చేస్తేనే గాని యిదమిత్థమని తేల్చి చెప్పేటందుకు వీలులేదు. కాని, యీ సృష్టి ప్రారంభ దశలో ఎప్పుడో, హిమయుగానికి పూర్వం ఆగ్నేయ ఆసియాలోనో, లేక మలయా ద్వీపాలలోనో మానవుడు పుద్భవించినట్లు కొన్ని ఆధారాలు కనిపిస్తున్నవి.

ఏభయ్యేళ్లక్రితం జావాలో కొన్ని అస్థికలు దొరికినయ్యి. ఈమధ్యనే పెకింగ్‌లో ఒకరకం అస్థికలు దొరికినయ్యి. ఈ రెండవరకం జాతివారు ఏప్ (తోక లేని ఒక రకం కోతి) తీరుగా వున్నప్పటికీ, వాళ్లు మనుష్యులే నని ఏంజల్సు నిర్వచనాన్ని బట్టి తెలుస్తున్నది. వాళ్లూ నిప్పును ఉపయోగించేవా రని ఏంజల్సుశాస్త్రజ్ఞుడు వ్రాశాడు.

మధ్యజావాలోని నిట్రినిల్ అగ్నిపర్వతపు బూడిదకట్టుల క్రింద పుర్రెలు, క్రింది దవడలు దొరికినయ్యి. యివి నిర్ధారణగా మనిషి పుర్రెలే. యివి యీయుగ మానవుల పుర్రె దవడలకంటేనే గాక పై రెండుజాతుల పుర్రెదవడలకంటేకూడా పెద్దవి. ఈ

పుర్రెలో ఏప్ మెదడుకంటె పెద్ద మెదడు వుండి వుండాలి— ప్రస్తుత మానవుని మెదడుకంటె చిన్నదై యుండవచ్చును. కాని వాళ్ల తల మన తలంతా వుండి వుండాలి. ఎందువల్లనంటే ఆ యెముక మన యెము కంతా వున్నది. బహుశః గోరిల్లాకు వలెనే వాళ్లకూ పుర్రెపైనుండు కప్పునుంచి దవడకు పెద్ద కండరాలు వుండివుంటవి. వారికి పెద్దకోరలు ఉండేవి. కోరలకు, కొరుకుడుపళ్లకు మధ్య చాలా ఖాళీ వుండేది. యీ దొరికినవాటిలో ఒక విరిగిపోయిన దవడ వున్నది. యిది అన్నింటికన్నా చాలా పెద్దది. దీని ప్రమాణం దాదాపుగా ఒక పెద్ద మగగోరిల్లా దవడంత వుంది. కాని, అది మనిషిదవడను పోలివున్నది.

ఈ మధ్యను ఒక చైనా పరిశోధకుడు మూడు దంతాలను కొన్నాడు. అవి ఆదిమనివాసుల దంతాలను పోలివున్నాయి. చాలా పెద్దవి. వాటియొక్క పైభాగము మన దంతముల పైభాగముకంటె ఆరురెట్లు ఎక్కువ పరిమాణం కల్గివున్నది. మగ గోరిల్లా దంతం పైభాగంకంటె రెట్టింపు పరిమాణం కలిగి వున్నది. యీ దంతాలను బట్టి ఆ దంతాలు కల మనిషిని వూహించుకుంటే, ఆవ్యక్తి దాదాపు అర టన్ను తూకం కలిగివుండాలి. యీదంతాలు బహుశః సిచాన్, యునాన్, క్వాంగ్సి గుహలలో దొరికి వుండాలి. అక్కడ త్రవ్విచూస్తే ఆ భారీ శరీరాలు గల రాక్షసుల అస్థులు దొరకవచ్చును. కనీసం తొడ బొమికలైనా లభించగలవు. వాటినిబట్టి, ఆవ్యక్తులు నిటారుగా నడిచేవారో, ఎంత ఎత్తుండేవారో అంచనా వేసి తెలుసుకోవచ్చును.

ఈ రాక్షసులే కనక మన ముత్తాత ముత్తాతలై వుంటే మనకీ వాళ్లకీ మధ్య ఎన్ని దశాబ్దాలూ శతాబ్దాలూసహా స్రాబ్దాలు గడచివుండాలో. యీ ఆధారంతో మానవుని పరిమాణాన్ని తెల్సుకుంటం సులభం. కాని ఆదిమ నివాసుల శరీరాలపై వుండే రోమాలు, వాళ్ల కుండే కోరపళ్లు క్రమేపి ఎందుకు పోయినయ్యో గ్రహించటంమాత్రం దుస్తరం.

ఆవ్యక్తులే కనక రాక్షసులై య్యుంటే ఆ సమస్య విడిపోయింది. సాధారణంగా ఉష్ణదేశంలో వుండే యేనుగలు యిత్యాది భారీ మృగాలకు రోమాలు వూడిపోవడం సహజం. పెద్దపులిని కూడా పట్టి చీల్చిపారేసే జంతువుకు కోరపళ్లు అవసరం.

మానవుడు కురచైన కొద్దీ అతనికి కత్తులు కఠార్లు, నిప్పుయొక్క ఆవశ్యకత యెక్కువైంది— బలీయమైన అడవిమృగాలనుంచి రక్షించుకుంటానికి. ఇది కేవలం ఊహాగానం మాత్రమే. విజ్ఞానం అభివృద్ధి అయినకొద్దీ ఇలాంటి వింతవింత విషయాలు ఎలా పొడకడుతూ వుంటయ్యో చూడండి.

జి. బి. యస్. హాల్డేన్
("ఓ.పిల్సు వాల్")

## పండితాశయము

సం॥ ౧౯౪౬ జనవరినెల "భారతి"యందుఁ బ్రకటింపంబడిన "దాశరాజ్ఞ యుద్ధము" విపులము గాను, సుబోధము గాను రచితమైయున్నది.

కాని అందు "దాశరాజ్ఞ" శబ్దము నలువదియూడుచోట్లఁ బ్రయోగింపంబడియున్నది. రాజన్ శబ్దము బహువ్రీహి సమాసఘటితమై విశేషణ మగునపుడు మాత్రము "సురాజ్ఞః" శబ్దమగును. తత్పురుష, కర్మధారయ సమాసములందు "రాజన్" శబ్దము పరపదమై యుండునపుడు అకారాంతఃపుల్లింగమై "రామరాజ" అనురూపమట్లు ఏర్పడును. కనుక "దాశరాజ్ఞః" అను రూప ముండక "దాశరాజః" అను రూప ముండవలసి యుండును.

దాశరాజ్ఞశబ్దము వేదప్రయోగ మన్నచో నది ఆర్ష ము; మహాకవి ప్రయోగ మన్నచో, ప్రాచీనకవి ప్రయోగ మగునేని, తత్ప్రయోగ మంగీకృతము. ఆంగ్లేయభాషనుండి గ్రహింపబడిన దన్నచో, సంస్కృత సుశబ్దము లన్యభాషలకు వెళ్లి వికృతరూపములు దాల్చియున్నవి. ఉదాహరణము:—కాళీఘట్టము = కల్కట్ట, కలకత్తా; ముంబాపురము = బొంబాయి;

చెన్నకేశవపట్టణము=మదరాసు, మెద్రాసు; విశాఖపట్టణము=వైజాగ్‌పటేమ్; బృందావనపురము = బందరు, మచిలీపటన్, మసులిపటేమ్‌గా మారినట్లే పెక్కుశబ్దములు మాఱియున్నవి. ఆర్ష, మహాకవి, అన్యభాషాప్రయోగము లప్పకవి దాదుల కనర్హములు. అట్టగుటవలన నుపరికథితవ్యాసమునందు "దాశరాజ" అని ఉండినచో, అది సుపాఠమును, సమంజసము నై ఉండును.

ఇట్లు,

శ్రీ విక్రమదేవవర్మ.

జయపురము, ౧౨-౧-౮౫.

## సృష్టి వైపరీత్యములు

"కిరిల్లో" (RiRilow) అను రష్యా వ్యవసాయదారుడు ౭౦ సం. వయస్సు అయిన పిదప ౧౫ మంది పిల్లలను కనెను. మొత్తముమీద అతని సంతానము ౭౨. అతను రెండుసార్లు వివాహమాడెను. మొదటి భార్యకు ౫౭ గురు పిల్లలు పుట్టిరి. ఆమె ఒకసారి ౪ గురు చొ॥ ౪ సార్లును, ౩ గురుచొ॥ ౭ సార్లును, ౨ చొ॥ ౧౦ సార్లును పిల్లలు కనెను. ౭౦ సం. అయినపిదప అతను పెండ్లాడిన రెండవ భార్యకు ౬ సార్లు కవలపిల్లలు, ఒకసారి ముగ్గురు పుట్టిరి. ("The Ladies' Medical Guide" Published by S. Pancoast, M.D., Philadelphia 1859)

క్రీ. శ. ౮౧౪ సం.లో ఛార్లిమేన్ (Charle Magne) అను రోమను చక్రవర్తి చనిపోగా అతని శవమును కూర్చున్న స్థితిలోనుంచి, రాజ దుస్తులు తొడిగి, కిరీటమ్ము మొదలగునవి పెట్టియుంచగా ౪౦౦ సం. వరకు అతడు ఆ స్థితిలోనే యుండెను. ౧౧౬౫ సం.లో ఫ్రెడరికు అను చక్రవర్తి ఛార్లిమేన్ శరీరమును చెక్కుచెదరని స్థితిలో చూచెను.

యెల్లో స్టోన్ నేషనల్ పార్కు (Yellow Stone National Park) అనే మంచినీళ్ల సరస్సులో ౧౫ అ. వెడల్పు గల ఒక రాతిగట్టు కలదు. ఆ రాతి మధ్యను ఒక బిలము గలదు. దానినుండి వేడినీరు పైకి పొంగుచుండును. ఆసరస్సులో చేపలు పట్టి ఆ ఉడుకు నీటిలో కాల్చుకొని తిందురు.

భగవంతుని సృష్టిలో "ప్లాటిపస్" (Platypus) అనునది ఒక అద్భుతమయిన జంతువు. ఇది ఆస్ట్రేలియా దేశములో నివసించును. ఇది కొంత భాగము పక్షిగను, కొంతభాగము పాలిచ్చు జంతువుగను, మిగిలిన భాగము ప్రాకే జంతువుగను ఉండును. ఇది పక్షివలె గ్రుడ్లు పెట్టును. ముక్కు బాతు ముక్కువలె ఉండును. దేహము దళసరి బొచ్చుచే కప్పబడి యుండును. రెక్కలకు బదులుగా రెండు ముందరికాళ్లు గలవు. గ్రుడ్లు పెట్టునప్పటికి అది పిల్లలకు పాలిచ్చును. బాతువలె అరవక కుక్కవలె అరుచును. అది భూమిమీద, నీటిమీదకూడా ఉండును. వెనుకకాళ్లకు విష దంతము లుండును. వాటిగుండా విషమును పైకి వదలును.

జాన్ స్మిత్ (John Smith) అనువాడు చోరీ క్రింద విచారింపబడి, ఉరికి ఆజ్ఞాపింపబడెను. టైబర్ (Tybure) జైలులో అనేకమంది చూచుచుండగా ఉరితీయబడెను. ౧౫ నిముషములవరకు ఉరిత్రాళ్లలో వ్రేల్లాడబడిన పిదప ఆ త్రాళ్లనుండి వాడు బయటికి తీయబడెను. పిమ్మట కొంతసేపటికి వానికి తెలివివచ్చి బ్రతికినాడు. అందుచేతనే కాబోలు ఇప్పుడు చనిపోయేవరకూ ఉరితీయబడవలె నని కోర్టువా రాజ్ఞాపించుచున్నారు.

ఆఫ్రికా దేశమందు "డ్రైవర్సు" (Drivers) అనే ఒకజాతి చీమలు కలవు. పులులు, సింహములు, ఏనుగులు మొదలగు పెద్ద పెద్ద జంతువులు కూడా వీటిని తమ ప్రాణాపాయకరమగు శత్రువులుగా భావించును. అవి యుద్ధమునకు పోవు పటాలములవలె ఒక్కొక్క పర్యాయము లెక్కకు మిక్కుటముగా బయలుదేరును. ఈ చీమల పటాలము చుట్టును గట్టి దవడలు, రంపపు పళ్లవలె నుండు పళ్లు గల సోల్జరు (Soldier) చీమలు ఫారా యిచ్చుచుండును. ఒక బారులో అనేక లక్షల చీమ లుండును. ఒక సమయమందు ఎడతెగకుండా ఒకస్థలముగుండా రాత్రింబవళ్లు ౧౬ రోజులు నడిచినంతబారులు కలిగియుండును. ఏగ్రామమునయినా ఈచీమలు ప్రవేశించినపుడు, ఆ గ్రామవాసులు దానిని విడిచి పారిపోవుదురు. ఆ ఊరిలోనుండు జీవరాశినంతను అవి తినివేయును. చీమలు గ్రామముమీద దండయాత్ర చాలించిన తరువాత, ఆ గ్రామవాసులు తిరిగివచ్చి చీమలచే సూక్ష్మజీవులు లేకుండా పరిశుభ్రముగా ఉంచబడిన గృహములను పునశ్చ ప్రవేశింతురు.

ఆచంట కృష్ణారావు.





# విమర్శనము



## ఆంధ్రరచయితలు

కర్త: మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు. ప్రథమసంపుటి. ప్రకాశకులు: మణిమేఖల, పల్లిపాలెము, కాకినాడ తాలూకా. క్రౌనుసైజు ౧౬+౨౫౫+౧౫ పుటలు. వెల రు ౨-౮-౦.

సంఘమున ప్రస్తుతికెక్కినవారి జీవితములను దెలుసుకొనవలెనన్న కోర్కె సర్వసహజము. అందు రచయితలైనవారి జీవితరహస్యములను గుఱించి తెలిసికొన మనస్సు మఱింత త్తరపడును. విషయము లేమియును లభింపకపోయినచో, కట్టుకథలను కల్పించుకొని మనస్సు తృప్తిపడును. కందుకూరి వీరేశలింగము, గురజాడ శ్రీరామమూర్తిపంతులు, 'కవిత్వవేది' మున్నగువారలు కవులచరిత్ర కొక రూపము నొసగ ప్రయత్నించియుండిరి..

ప్రస్తుత గ్రంథమున పరవస్తు చిన్నయ్యసూరి గారి కాలము (౧౮౦౬) నుండి వేంకటరామకృష్ణ కవులవఱకు (౧౮౯౩) గల నలుబదియొక్కగు రచయితల చరిత్రములు 'కర్ణాటక'మైన భాషలో రుచ్యమగు రీతిని వర్ణితమైనవి. సాహిత్యపిపాసువు లందఱును చదువవలసినగ్రంథము. ముచ్చటయైన కూర్పు.

శ్రీ శాస్త్రిగారు మిగిలిన సంపుటములను గూడ త్వరలో వెలువరించి, ఆంధ్రిని సేవింతురుగాక!

నిత్యకల్యాణందస్వామి

---

## జననకాల విశేషాలు

గ్రంథకర్త: పూడిపెద్ది వెంకటరావుగారు. డబుల్ క్ర్యావ్ ౬౦ పుటలు. వెల ౦-౮-౦ లు. (౧౯౩౫)

ఇందులో జ్యోతిషశాస్త్రప్రవేశము లేనివారు కూడా తాము జన్మించిన కాలాన్ని బట్టి తెలిసికోదగిన విశేషాలు వర్ణితములైనాయి. కొంచెములో పుస్తకం ఆనందదాయకంగానే ఉంది. ఆయీ శాస్త్రజిజ్ఞాసువులే కాకుండా, అందఱూ పఠించి గ్రహింపవచ్చు.

'X'.

## ప్రబోధరత్నాకరము

శ్రీ వివేకానందస్వామిగారు అమెరికాలో వారి శిష్యులకిచ్చిన యుపన్యాసముల సంపుటము. మానవుని యందుగల వివేకము నుద్దీపింపజేయుటకుగాను ఇట్టి గ్రంథములు పరమావశ్యకము. నిష్ఠ-అద్వైతభావము, సమదృష్టి, ఆత్మవికాసము, సంగరాహిత్యము, ధర్మము - భగవంతుడు, తపస్సు, జ్ఞానము, భక్తి మొదలగు ప్రబోధరత్నము లిందుగలవు. ఇందుగలరత్నముల నన్నింటిని మనగారగ్రహింపగలిగినచో వాటిప్రకాశమువలన మానవునియందుగల అజ్ఞానాంధకారము నష్టముగా ఆత్మజ్యోతి దేదీప్యమానముగ ప్రకటితమై జీవన్ముక్తి ప్రసాదింపగల దనుటకు సందియములేదు. కాని ఇందలి యుపదేశముల క్రమములను హార్దికముగ నవలంబింప బూనుకొనుటచేతనే లాభము కలుగగలదు. కవికోకిల శ్రీ జాషువగారును, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారును అనువదించిన పద్యములుకూడ నిందు సందర్భానుసారముగా గలవు. వెల రు. ౧-౧౨-౦.

## భక్తియోగము

ఈ గ్రంథము మూడవముద్రణము నందుటయే దీనియందుగల పదార్థప్రాశస్త్యమును జాటుచున్నది.

మొత్తము ౧౮ అధ్యాయములు. భక్తి యన నేమి, దేనిపై భక్తిగలిగియుండవలెనో దాని లక్షణములు, అట్టిభక్తిని సాధించుటకు సాధనములు, అభ్యాసక్రమము, మంత్ర ఓంకారాదుల నిరూపణము, భక్తి యందు గల శాంత, దాస్య, వాత్సల్యాదిభేదములు మున్నగు విషయములను గురించి ఆర్ష గ్రంథప్రమాణములతో శ్రీ వివేకానందులవారిచ్చియుండిన యుపన్యాససంగ్రహమున కిది తెనుగు. ఆస్తికులకు పఠనీయమైన గ్రంథము. వెల ఒక రూపాయ.

పై ఉభయగ్రంథములకును గ్రంథకర్త: శ్రీ వివేకానందస్వామిగారు. అనువాదకుడు: శ్రీ చిరంతనానందస్వామిగారు. ప్రకాశకులు: శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు.

# గ్రంథ స్వీకారము

## యోగసిద్ధి

యోగి శ్రీ శుద్ధానందభారతి గ్రంథమునకు అనువాదము. అనువాదకులు: గవరవరం రామస్వామి కవిగారు ప్రకాశకులు: అణాబులియము, రామచంద్రపురము, తిరుచినాపల్లి జిల్లా. వెల రూపాయిన్నర.

---

## శాస్త్రీయ యుద్ధము

గ్రంథకర్త: పింగళి వెంకటరామయ్యగారు. ప్రకాశకులు: ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము, కొవ్వూరు, పశ్చిమగోదావరిజిల్లా. వెల ఒకరూపాయి.

---

## స్టాలిన్ [illegible]

రచయిత: యం. యస్. రాజలింగంగారు, సాధనసమితి, సికిందరాబాదు. వెల ౬ అణాలు.

## ప్రపంచకథలు

మొదటిభాగము. అనువాదకులు: కె. రాధాకృష్ణమూర్తి, పి. వి. సుబ్బారావుగార్లు. ప్రకాశకులు: జాకోబిన్‌పబ్లిషర్సు, తెనాలి. వెల రూపాయి.

---

## హిందూకోడ్ సమీక్ష

౭౫ పుటల లఘుగ్రంథము. గ్రంథకర్త: ముదిగొండ మల్లికార్జునరావుగారు. ప్రకాశకులు: శ్రీ సనాతన ధర్మమహాసభ, సికిందరాబాదు. వెల తెలియదు.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.




చక్కని రుచి, ఘుమ ఘుమలాడే
సువాసన, నేత్ర పర్వంగావుండే
రంగు, తక్కువధర, వీటి అన్నింటి
నిబట్టి లిప్టన్స్ టీ గర్ల్
మిగతా వాటిని తలదన్ని అత్యా
ధిక గౌరవాన్ని తెచ్చుకున్నది.




# లిప్టన్స్ టీ గర్ల్

మృదు మధురమైన ఇండియన్ డస్ట్ టీ

LTK 84 G



# సర్వాంగ సౌందర్యము

అజంతా గుహల గోడలమీద రేఖా వర్ణమిశ్రమవల్ల శిల్పి సృష్టించిన సర్వాంగ సుందరమూర్తుల సౌందర్యంలో యెక్కడా కొంచముకూడా లోపములేదు. మీదైనిక జీవనములోకూడా సుస్వాదు, సుగంధిత టీని త్రాగడములోను త్రాగించుటలోనూ మీరు ఒక పరిపూర్ణ సౌందర్యము యొక్క ఉపభోగమును అనుభవిస్తూ వున్నారు. సార్థక శిల్పానికివలెనే టీ సమస్తశక్తులను మేలు కొల్పుతుంది; మనస్సు సంతోషంతో నిండుతుంది. మీరు పరివారము, ప్రియజనముతో సహా ప్రతిదినము ఆనంద దాయకమైనటీతో మీకు గలసదవకాశాన్ని సార్థకమొనరించండి. మహాశిల్పి సృష్టించిన దానికి వలెనే టీకూడా అపార తృప్తితో మీ హృదయాన్ని నింపగలుగుటను మీరే గ్రహింపగలరు.



టీ చేయు క్రమము:—శుద్ధమైన వేడినీరు. కొంచము వేడిచేసిన శుద్ధమైనపాత్ర. ఒక స్పూన్ టీ యొక్కొక్కరికిన్ని, మొత్తముగా నొక స్పూన్ యధికముగాను పాత్రలోవేసి, బాగుగా మరుగుచున్న నీటిని పోయవలెను. 5 నిమిషములు తాళి గిన్నెలలో పోసి పాలు చక్కెర చేర్చవలెను.





## కుటుంబానికంతకూ హితవగు యేకైక పానీయము యా టీ.

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్‌పాన్షన్ బోర్డువారిచే ప్రకటింపబడినది

I. K. 200 B TG.

